శ్రీరస్తు.

# దైవజ్ఞకర్ణామృతము.

## జ్యోతిశ్శాస్త్రము.

టీకాతాత్పర్యోదాహరణసహితము

రెండుభాగములు.

ఇది

శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాజావారి సంస్థానపోష్యులును
స్కంధత్రయజ్యోతిష్ప్రజ్ఞాధురంధరులును గోదావరి
జిల్లా కోటిఫలినివాసులును నగు

శ్రీమద్వేమూరి సూర్యనారాయణసిద్ధాంతిగారిచే

సకలజనోపయోగముగ రచియింపఁబడి

రెండవకూర్పు 1000

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలలో

క్రొత్తపల్లి సూర్యరావుచే

ముద్రింపఁబడి

పనుమర్తి విశ్వపతిశాస్త్రిచే

కాకినాడలోఁ బ్రకటింపఁబడియె.

1910



వెల రు 1-8-0.

# విజ్ఞాపనము.

---

పండితవర్యులార!

ఈదైవజ్ఞకర్ణామృతము (పూర్వభాగము) మొదటికూర్పు ప్రతులచిరకాలములో నే వ్యయమగుటచే పండితులు దీని నాదరించుచున్నారని తలంచి రెండవకూర్పువేయుటకు శ్రీ నేమూరి సూర్యనారాయణసిద్ధాంతిగారిని ప్రార్థించి మొదటికూర్పులో లేని విశేషవిషయములిందుఁ జేర్పించుటయేకాక నుత్తరభాగమునఁ జాతకపరిచ్ఛేదము పంచాంగసాధనప్రకరణమును సాధ్యమైనంతవఱకు సకలజనులకు సులభముగా బోధపడునట్లు తాత్పర్యోదాహరణములతో వ్రాయించి ముద్రింపించి ప్రకటించినాఁడను. దీనినిగూడ విద్వాంసులు చిత్తగించి పూర్వాపరముఁజూచి యేవేని లోపములున్నచో మూఁడవముద్రణమునం దిద్దుకొనుటకై తెలియఁజేయఁ బ్రార్థించుచున్నాఁడను. చాలదినములనుండి యిది యచ్చులోనున్నదని ప్రచురించుచుండియును గారణాంతరములచే శీఘ్రముగా వెలువరింపలేక పోయినందులకు పెద్దలు మన్నింతురుగాక!

ఈదైవజ్ఞకర్ణామృతముయొక్క ద్వితీయముద్రణముయొక్క కాపీరైటు మున్నగు సర్వస్వాతంత్ర్యములును పైసిద్ధాంతిగారివలన నేను పొందియున్నాను. కాఁబట్టి యితరులెవ్వరును ముద్రింపఁగూడదు.

ఇట్లు, విధేయుఁడు,
పసుమర్తి విశ్వపతిశాస్త్రి,
దైవజ్ఞ కార్యస్థానము, కాకినాడ.

## —విషయసూచిక.—

పుట.

పుట.

పుట.

శ్రీరస్తు.

శ్రీగజాననాయనమః.

శ్రీమదాంధ్రతాత్పర్యోదాహరణసహితే

# దైవజ్ఞకర్ణామృతే

---

పూర్వభాగే—మిశ్రఫలబిందౌ

## కాలపరిచ్ఛేదః

శ్లో॥ నిరుపమగుణజాలం నిత్యకళ్యాణలీలం
కరవిలసితశూలం కాళికాభక్తిలోలం
నికటగగణమాలం నీచసంహారశీలం
మదకలితకపోలం విఘ్నరాజంభజేలమ్॥

శ్లో॥ ఆదిత్యాబ్ధి భవానలా స్సమభవ న్నేత్రాణి యస్యేశితుః
పక్షౌయస్య మహామతే రభవతాం కాళీచ దుర్గాతథా
సశ్రీమన్నగసింహకోపదహనజ్వాలాభ్రమాలాయితః
పాయాత్సాళువపక్షి రా డురుకృపాకూపారయూపోహరః॥

శ్లో॥ చతుర్భుజాం విశాలాక్షీంపాశాంకుశ ధనుర్ధరాం
స్వర్ణపీతాంబరాం మాలాధరాం శ్రీలలితాం భజే॥

శ్లో॥ హరికృష్ణాహ్వాయగురూ హరి కృష్ణావివోద్ధితౌ
జ్యోతిశ్శాస్త్రప్రదేష్టారౌద్వావతౌ భావయేన్వహమ్॥

ఈశాస్త్రమంతకును గాలమే యాధారము గనుక ముందుగాఁ గాలసాధనము చెప్పఁబడుచున్నది.

## ౧. పాదచ్ఛాయాభ్యో దివాఘటీసాధనమాహ.

### ౧. కాలపరిచ్ఛేదః

శ్లో॥ అహస్సార్ధాద్రినేత్రోనం ౨౭-౩౦ శిష్టం పాదయుతంహరః
వసు ౮ ఘ్నం త్రి 3 హృతం ఘస్రమానం హారహృతం ఘటీః॥౧

టీక॥ అహః అహస్సు, సార్ధాద్రినేత్ర-సార్ధ, అరగడియతోఁగూడిన, అద్రినేత్ర=౨౭ చేతను, ఊనం=తీసివేయఁబడినదై, శిష్టం=మిగిలినది-పాదయుతం, పాద=పాదచ్ఛాయలతో, యుతం=కూర్చఁబడినదై, హారః=హారమను పేరుగలదియగును. వసుఘ్నం, వసు=౮ చేత, ఘ్నం=గుణింపఁబడినట్టియు, త్రిహృతం, త్రి=3 చేత, హృతం=భాగింపఁబడినట్టియు, ఘస్రమానం=దినమానము, హారహృతం, హార=హారమనుదానిచేత, హృతం=భాగింపఁబడినదై, ఘటీః=గడియ విగడియలు వచ్చునని యర్థము.

తాత్పర్యము॥ తానుప్రొద్దుగట్టెడు నాఁటిదినమానములో ౨౭-౩౦ తీసివేసి మిగిలిన శేషములో పాదచ్ఛాయలు గూడిన హారమను పేరుగలది యగును. అది యటుండనిచ్చి, దినమానమును ౮ చేతగుణించి 3 చేతభాగింపఁగా వచ్చిన ఘటికాదిని వెనుక సాధించినహారముచే మరల భాగింపఁగా గడియలువచ్చును. ఆశేషమును ౬౦ చేత గుణించి వెనుకటి హారముచేతనే భాగింపఁగా విగడియలువచ్చును. ఇది రెండుయామము లకు లోపల నయిన నింతప్రొద్దయినదనియుఁ బిమ్మట నయిన నింత ప్రొద్దున్నదనియుం జెప్పవలయును.

ఉదాహరణము—శాలివాహనశకము ౧౮౧౪ అగు నీ నందననామసంవత్సర ఆశ్వయుజ శుద్ధ ౧౫ గురువారమునాఁడు పూర్వాహ్ణచ్ఛాయలు ౧౦-౩౦ దినమానములో ౨౭-౩౦ ను తీసివేసి శేషము ఛాయలతోఁ గూర్పవలయు. కనుక దినమానము $29\frac{3}{8}—27\frac{1}{2}=2\frac{1}{16}+10\frac{1}{2}$ ఛాయలు$=12\frac{3}{8}$ ఇది హారమనిచెప్పఁబడును.

దినమానము $29\frac{3}{8}\times8\div3=78\frac{14}{18}\div12\frac{3}{8}$ వెనుకటిహారము=ఘ ౬ విఘ ౧౫. ఇది ఘటికాది. పూర్వాహ్ణమందు గనుక ౬ ఆరుగడియల ౧౫ విగడియల ప్రొద్దెక్కినదని చెప్పవలెను.

భిన్నగణితముఁ దెలిసినవారిట్లు చేయవలెను.

గడియ ౧ కి విగడియలు ౬౦. ఛాయయనఁగా వడుగు ౧ కి విచ్ఛా[illegible] ౬౦.

విచ్ఛాయలనఁగా, ఒక యడుగులోఁ జిల్లర-అనగా :—ఎండలో నిలిచిన వా[illegible] డను వారి కాలి యడుగులలోఁ గొలువగా నెన్ని పాదములగునో అన్ని ఛా[illegible]వ్రాసి కొని తుదకు అడుగునకుఁ దగ్గిపోయినరెండల నప్పుడు చిల్లర తెలియవలెను. ఎట్లంటే, తనయడుగు ప్రమాణమును ౬౦ పాళ్ళు చేసి యందొక పాలునకు విచ్ఛాయయని తెలియునది. అనఁగా సుమారు తన యడుగులోఁ బరకవాసిగ నీడయుండెనా ౨౪ విచ్ఛాయలనియు, పాతికయనఁగా నాలుగవపాలుగ నుండెనా ౧౫ విచ్ఛాయలనియు, నగముగనుండెనా ౩౦ విచ్ఛాయలనియు, ముప్పాతికవాసిగ నుండెనా ౪౫ విచ్ఛాయలనియు, నొక పరక తక్కువగా నుండెనా ౫౭౪ విచ్ఛాయలనియుం జెప్పఁబడును. ఇట్లు ఛాయవిచ్ఛాయలందెలిసి నీడనుగొలిచి యిన్ని ఛాయల యిన్ని విచ్ఛాయలని వ్రాసికొనునది.

భిన్నగణితముఁ దెలియనివారు ప్రొద్దుగట్టెడు క్రమము. ఎట్లంటే ;

దినము ౨౯|౩౬ ఇందులో

దీనిని ౨౭|౩౦ తీసివేయఁగా

ఛాయ విచ్ఛాయలు } ౨| ౬ శేషము- దీనిలో

౧౦|౩౦ కూడఁగా

అయినమొత్తము ౧౨|౩౬ ఇది హారమని చెప్పఁబడును.

దినమానము ౨౯|౩౬ దీనిని

౮ దీనిచేత గుణింపఁగా

౨౩౬-౪౮ అయినది-దీనిని 3 చే భాగింపవలెనుగనుక

3 )౨౩౬-౪౮( ౭౮|౫౬ ఇది లబ్ధము.

భాజ్యఘటికావి యీఘటికాదిని హారమను దానిచేత భాగింపవలెను గనుక భాజ్యము ౭౮|౫౬ ను వెనుకటి హారము ౧౨|౩౬ చే భాగించుటకు రెండుప్రతులను సవర్ణింపవలెను గనుక ౭౮ ని ౬౦ చే గుణింపగా

౬౦

౪౬౮౦ ఇందులో

౫౬ కూడఁగా

౪౭౩౬ ఇది భాజ్యసవర్ణనము.

అంశఃగా నన్నియును విగడియలయినవి. హారము ౧౨|౩౬ దీనినిగూడ సవర్ణింపవలెను. గనుక ౧౨

౬౦

౭౨౦ దీనిలో

౩౬

౭౫౬ ఇది హారసవర్ణనము.

భాజ్యసవర్ణనము ౪౭౩౬ హారసవర్ణనము ౭౫౬ చేత భాగింపవలెను గనుక.

భాజ్యసవర్ణనము.

హారసవర్ణనము ...౭౫౬)౪౭౩౬( ౬ గడియలు

౪౫౩౬ లబ్ధము

౨౦౦ శేషము- దీనిని ౬౦ చే గుణింపవలెను.

౬౦

౭౫౬ )౧౨౦౦౦( ౧౫ విగడియలు లబ్ధము

౭౫౬

౪౪౪౦

౩౭౮౦

౬౬౦

ఈప్రకారము చేయఃగా ౬ గడియల ౧౫ విగడియలు వచ్చినవి. సవర్ణనమంఃగా ఘటికావిఘటికలను గాని, భాయువిచ్ఛాయులనుగాని దేకజాతికి మార్చుట యని భావము.

అట్లు సవర్ణించినపిమ్మట నొకదానితో నొకటి భాగించుట సుకరమై యుండును. ఈశాస్త్రమం దిదిపరిభాష.

## ౨. అథస్థూలమార్గేణపాదచ్ఛాయాభ్యోఘటీసాధనం.

శ్లో॥ కరాగ్న్యబ్ధ్యబ్ధివహ్న్యశ్వ్యేకార్ధాభ్రాభ్రదళేందవః
మధ్యోద్ధృతప్రభాభిస్తుభాజితానవశత్రవః॥

తా॥ కర ౨, అగ్ని ౩, అబ్ధి ౪, అబ్ధి ౪, వహ్ని ౩, అశ్వి ౨, ఏక ౧, అర్ధ ½ అభ్రం, అభ్రం, దళ ½ ఇందవః ౧ ఈ ౧౨ సంఖ్యలును చైత్రాదిగా ౧౨ నెలలకును

ధ్రువాంకము లగును గనుక తాను ప్రొద్దుగట్టు నెలకే యంక మగునో ఆయాయంకము ను దనయిష్టపాదచ్ఛాయలలోఁ గూడి యామొత్తముచేత ౬౯ని భాగింపఁగా ఘటికాది వచ్చును. స్వల్పతేడావచ్చినను మిక్కిలి తేలిక గనుక దోషము లేదని పెద్దలు చెప్పిరి. "స్వల్పాంతరత్వాచ్చ బహూపయోగా ద్వ్యత్ర్యజ్యతే తన్నతు దూషణాయ" అని కేశవాచార్యాదులు సెలవిచ్చిరి గనుక వెనుకటిప్రొద్దునకును, నీశ్లోకమువలన వచ్చిన దానికిని ౧౫ విగడియలు తేడా గనుక దోషము లేదు. ౧౫ విగడియలు=౬ మినిట్లు.

ఉదాహరణము. పూర్వోక్తఆశ్వయుజ శుద్ధ ౧౫ గురువారమున పూర్వాహ్ణచ్ఛాయలు ౧౦।౩౦ కి చైత్రాదిగా యీ ఆశ్వయుజమాసము ౭ వదిగనుక పూర్వోక్తమాసధ్రువాంకములలో ౭ వది ౧ గనుక దీనిని ఛాయలు ౧౦।౩౦ తోఁ జేర్పఁగా ౧౧।౩౦ ఇది ఛేదకము, ఛేద్యము సర్వదా ౬౯ గనుక యీ ఛేద్యమును ఛేదకముచే భాగింపవలెను గనుక ఛేద్యఛేదకములు రెంటిని సవర్ణింపఁగా

ఛేద్యము
ఛేదకము ౬౯౦ )౪౧౪౦( ౬ ఘడియలుమాత్రమే వచ్చును
౪౧౪౦

ఇది లఘుమార్గము.

పగలు పాదచ్ఛాయవలనను రాత్రి శిరోనక్షత్రమును గంటితోఁజూచియుఁ గాలమును నిర్ణయించుట స్థూలమనఁబడును గాని సూక్ష్మము గాదు. పగలు ద్వాదశాంగుళశంకుయొక్క ఛాయాంగుళమువలనను దివారాత్రములందు ౬౦ భాగలు గల తురీయ యంత్రమువల్లను గణితరీతిగా సాధింపఁబడుకాలమే బహు నికరమైయుండును. అది సిద్ధాంతశాస్త్రమందు విశదముగ జెప్పఁబడియున్నది. అయినను కొద్దిపాటికృషివల్ల సాధ్యమగును గాని విశేషశ్రమలేదు. అట్లు చేసికొనుటకు వీలుగానిచో వెనుకటి స్థూలమార్గమువల్ల నించుమించుగ దెలియు నని పెద్ద లట్లనుగ్రహించిరి. ఇఁకఁ బగలు పాదచ్ఛాయలవల్ల సాధించు ప్రకరణము లన్నిటిలో నతిస్వల్పమై సమ్యముగ ప్రొద్దునచ్చుటకు మిక్కిలి లఘుపద్ధతిగా నొక్కసారిణి యీదిగువను వ్రాయఁబడుచున్నది. అందుకు ౩౬౫ పదకములు సాధింపఁబడినవి. అనఁగా మధ్యసూర్యుఁడు మేషప్రవేశ

మయిన దినము మొదలు మరల మేషప్రవేశ మగువఱకు ౩౬౫ దినము లగును గనుక దినము ౧ కి ౧ పదకము చొప్పున సౌరసంవత్సరదినములు ౩౬౫ కి ౩౬౫ పదకములు సాధింపఁబడినవి. కనుక మధ్యరవి మేషప్రవేశదినాదిగా నిష్టదినము వఱకెన్నవదిన మగునో యన్నవదినపదకముగ జూడఁగా, మొదట పదకసంఖ్యయు, రెండవది భాజ్య ఘటికాదియు, ౩వది యుతిఘటికాది, ౪వది నాఁటిదినప్రమాణఘటికాదియు నని వ్రాయఁబడియున్నది. ఈసంగతులనుపట్టి ప్రొద్దుగట్టుకు నీసాధనము ముందు స్పష్ట ముగ నుదాహరింపఁబడుచున్నది. మధ్యరవి మేషప్రవేశమయిన దినము మొదలుకొని యిష్టదినమువఱకును యెన్నవదినమగునో తెలియుటకహర్గణసాధనము ముందీగ్రంథము యొక్క ఉత్తరభాగమందు విశదీకరింపఁబడియున్నది. అయినను మొదటిభాగమందు ను గొంచెము వ్రాయఁబడుచున్నది. అహర్గణమును సాధించకపోయినను మఱియొకసు లభమార్గము గలదు. ఎట్లనఁగా; తాను ప్రొద్దుగట్టఁదలఁచిన యిష్టదినమందు పం చాంగరీత్యా దినమానమును చూచి యాదినమానముతో సమముగా నేపదకములో దిన మానమున్నదో చూచి యాపదకమే నాఁటిదినపదకమని తెలిసి దానివల్ల నన్నియుఁ దెలియవలెను. ఒకవేళ ౪, ౫ పదకములలో దినమానము సమముగా నుండెనేని అం దులో నేదైనను గ్రహింపవచ్చును.

కాలజ్ఞానాత్ ప్రతిదినభాజ్యపదకాని, దినప్రమాణానిచ.

| దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- ఒఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౮౧-౩౫ | ౩-౩౨ | ౩౦-౫౯ | ౧౮ | ౮౩-౨౩ | ౪-౧౩ | ౩౧-౪౦ |
| ౧ | ౮౧-౪౩ | ౩-౩౫ | ౩౧- ౨ | ౧౯ | ౮౩-౨౯ | ౪-౧౫ | ౩౧-౪౨ |
| ౨ | ౮౧-౪౮ | ౩-౩౭ | ౩౧- ౪ | ౨౦ | ౮౩-౩౪ | ౪-౧౭ | ౩౧-౪౪ |
| ౩ | ౮౧-౫౪ | ౩-౩౯ | ౩౧- ౬ | ౨౧ | ౮౩-౩౯ | ౪-౧౯ | ౩౧-౪౬ |
| ౪ | ౮౨- ౨ | ౩-౪౨ | ౩౧- ౯ | ౨౨ | ౮౩-౪౪ | ౪-౨౧ | ౩౧-౪౮ |
| ౫ | ౮౨- ౭ | ౩-౪౪ | ౩౧-౧౧ | ౨౩ | ౮౩-౫౦ | ౪-౨౩ | ౩౧-౫౦ |
| ౬ | ౮౨-౧౨ | ౩-౪౬ | ౩౧-౧౩ | ౨౪ | ౮౩-౫౫ | ౪-౨౫ | ౩౧-౫౨ |
| ౭ | ౮౨-౨౦ | ౩-౪౯ | ౩౧-౧౬ | ౨౫ | ౮౪- ౦ | ౪-౨౭ | ౩౧-౫౪ |
| ౮ | ౮౨-౨౫ | ౩-౫౧ | ౩౧-౧౮ | ౨౬ | ౮౪- ౫ | ౪-౨౯ | ౩౧-౫౬ |
| ౯ | ౮౨-౩౩ | ౩-౫౪ | ౩౧-౨౧ | ౨౭ | ౮౪-౧౧ | ౪-౩౧ | ౩౧-౫౮ |
| ౧౦ | ౮౨-౩౮ | ౩-౫౬ | ౩౧-౨౩ | ౨౮ | ౮౪-౧౬ | ౪-౩౩ | ౩౨- ౦ |
| ౧౧ | ౮౨-౪౪ | ౩-౫౮ | ౩౧-౨౫ | ౨౯ | ౮౪-౧౯ | ౪-౩౪ | ౩౨- ౧ |
| ౧౨ | ౮౨-౪౯ | ౪- ౦ | ౩౧-౨౭ | ౩౦ | ౮౪-౨౪ | ౪-౩౬ | ౩౨- ౩ |
| ౧౩ | ౮౨-౫౪ | ౪- ౨ | ౩౧-౨౯ | ౩౧ | ౮౪-౨౬ | ౪-౩౭ | ౩౨- ౪ |
| ౧౪ | ౮౩- ౦ | ౪- ౪ | ౩౧-౩౧ | ౩౨ | ౮౪-౩౨ | ౪-౩౯ | ౩౨- ౬ |
| ౧౫ | ౮౩- ౫ | ౪- ౬ | ౩౧-౩౩ | ౩౩ | ౮౪-౩౭ | ౪-౪౧ | ౩౨- ౮ |
| ౧౬ | ౮౩-౧౩ | ౪- ౯ | ౩౧-౩౬ | ౩౪ | ౮౪-౪౦ | ౪-౪౨ | ౩౨- ౯ |
| ౧౭ | ౮౩-౧౮ | ౪-౧౧ | ౩౧-౩౮ | ౩౫ | ౮౪-౪౫ | ౪-౪౪ | ౩౨-౧౧ |

| దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౩౬ | ౮౪-౪౮ | ౪-౪౫ | ౩౨-౧౨ | ౫౫ | ౮౫-౫౧ | ౫-౯ | ౩౨-౩౬ |
| ౩౭ | ౮౪-౫౩ | ౪-౪౭ | ౩౨-౧౪ | ౫౬ | ౮౫-౫౩ | ౫-౧౦ | ౩౨-౩౭ |
| ౩౮ | ౮౪-౫౫ | ౪-౪౮ | ౩౨-౧౫ | ౫౭ | ౮౫-౫౩ | ౫-౧౦ | ౩౨-౩౭ |
| ౩౯ | ౮౫-౩ | ౪-౫౧ | ౩౨-౧౮ | ౫౮ | ౮౫-౫౬ | ౫-౧౧ | ౩౨-౩౮ |
| ౪౦ | ౮౫-౯ | ౪-౫౩ | ౩౨-౨౦ | ౫౯ | ౮౫-౫౯ | ౫-౧౨ | ౩౨-౩౯ |
| ౪౧ | ౮౫-౧౨ | ౪-౫౪ | ౩౨-౨౧ | ౬౦ | ౮౬-౧ | ౫-౧౩ | ౩౨-౪౦ |
| ౪౨ | ౮౫-౧౪ | ౪-౫౫ | ౩౨-౨౨ | ౬౧ | ౮౬-౧ | ౫-౧౩ | ౩౨-౪౦ |
| ౪౩ | ౮౫-౧౭ | ౪-౫౬ | ౩౨-౨౩ | ౬౨ | ౮౬-౧ | ౫-౧౩ | ౩౨-౪౦ |
| ౪౪ | ౮౫-౨౨ | ౪-౫౮ | ౩౨-౨౫ | ౬౩ | ౮౬-౪ | ౫-౧౪ | ౩౨-౪౧ |
| ౪౫ | ౮౫-౨౨ | ౪-౫౮ | ౩౨-౨౫ | ౬౪ | ౮౬-౪ | ౫-౧౪ | ౩౨-౪౧ |
| ౪౬ | ౮౫-౨౭ | ౫-౦ | ౩౨-౨౭ | ౬౫ | ౮౬-౪ | ౫-౧౪ | ౩౨-౪౧ |
| ౪౭ | ౮౫-౩౦ | ౫-౧ | ౩౨-౨౮ | ౬౬ | ౮౬-౭ | ౫-౧౫ | ౩౨-౪౨ |
| ౪౮ | ౮౫-౩౫ | ౫-౩ | ౩౨-౩౦ | ౬౭ | ౮౬-౭ | ౫-౧౫ | ౩౨-౪౨ |
| ౪౯ | ౮౫-౩౮ | ౫-౪ | ౩౨-౩౧ | ౬౮ | ౮౬-౭ | ౫-౧౫ | ౩౨-౪౨ |
| ౫౦ | ౮౫-౩౮ | ౫-౪ | ౩౨-౩౧ | ౬౯ | ౮౬-౯ | ౫-౧౬ | ౩౨-౪౩ |
| ౫౧ | ౮౫-౪౩ | ౫-౬ | ౩౨-౩౩ | ౭౦ | ౮౬-౯ | ౫-౧౬ | ౩౨-౪౩ |
| ౫౨ | ౮౫-౪౩ | ౫-౬ | ౩౨-౩౩ | ౭౧ | ౮౬-౯ | ౫-౧౬ | ౩౨-౪౩ |
| ౫౩ | ౮౫-౪౫ | ౫-౭ | ౩౨-౩౪ | ౭౨ | ౮౬-౯ | ౫-౧౬ | ౩౨-౪౩ |
| ౫౪ | ౮౫-౪౮ | ౫-౮ | ౩౨-౩౫ | ౭౩ | ౮౬-౭ | ౫-౧౫ | ౩౨-౪౨ |

| దినపదక సంఖ్యా. | ఛాయాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | ఛాయాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౭౪ | ౮౬-౭ | ౫-౧౫ | ౩-౨-౪౨ | ౯౩ | ౮౫-౩౫ | ౫-౩ | ౩-౨-౩౦ |
| ౭౫ | ౮౬-౭ | ౫-౧౫ | ౩-౨-౪౨ | ౯౪ | ౮౫-౩౨ | ౫-౨ | ౩-౨-౨౯ |
| ౭౬ | ౮౬-౭ | ౫-౧౫ | ౩-౨-౪౨ | ౯౫ | ౮౫-౩౦ | ౫-౧ | ౩-౨-౨౯ |
| ౭౭ | ౮౬-౪ | ౫-౧౪ | ౩-౨-౪౧ | ౯౬ | ౮౫-౨౭ | ౫-౦ | ౩-౨-౨౭ |
| ౭౮ | ౮౬-౪ | ౫-౧౪ | ౩-౨-౪౧ | ౯౭ | ౮౫-౨౪ | ౪-౫౯ | ౩-౨-౨౬ |
| ౭౯ | ౮౬-౪ | ౫-౧౪ | ౩-౨-౪౧ | ౯౮ | ౮౫-౨౨ | ౪-౫౮ | ౩-౨-౨౫ |
| ౮౦ | ౮౬-౧ | ౫-౧౩ | ౩-౨-౪౦ | ౯౯ | ౮౫-౧౯ | ౪-౫౭ | ౩-౨-౨౪ |
| ౮౧ | ౮౬-౧ | ౫-౧౩ | ౩-౨-౪౦ | ౧౦౦ | ౮౫-౧౪ | ౪-౫౫ | ౩-౨-౨౨ |
| ౮౨ | ౮౫-౫౯ | ౫-౧౨ | ౩-౨-౩౯ | ౧౦౧ | ౮౫-౧౧ | ౪-౫౪ | ౩-౨-౨౧ |
| ౮౩ | ౮౫-౫౬ | ౫-౧౧ | ౩-౨-౩౮ | ౧౦౨ | ౮౫-౯ | ౪-౫౩ | ౩-౨-౨౦ |
| ౮౪ | ౮౫-౫౩ | ౫-౧౦ | ౩-౨-౩౭ | ౧౦౩ | ౮౫-౬ | ౪-౫౨ | ౩-౨-౧౯ |
| ౮౫ | ౮౫-౫౩ | ౫-౧౦ | ౩-౨-౩౭ | ౧౦౪ | ౮౪-౫౮ | ౪-౪౯ | ౩-౨-౧౬ |
| ౮౬ | ౮౫-౫౧ | ౫-౯ | ౩-౨-౩౬ | ౧౦౫ | ౮౪-౫౩ | ౪-౪౭ | ౩-౨-౧౪ |
| ౮౭ | ౮౫-౪౮ | ౫-౮ | ౩-౨-౩౫ | ౧౦౬ | ౮౪-౫౦ | ౪-౪౬ | ౩-౨-౧౩ |
| ౮౮ | ౮౫-౪౫ | ౫-౭ | ౩-౨-౩౪ | ౧౦౭ | ౮౪-౪౫ | ౪-౪౪ | ౩-౨-౧౧ |
| ౮౯ | ౮౫-౪౩ | ౫-౬ | ౩-౨-౩౩ | ౧౦౮ | ౮౪-౪౦ | ౪-౪౨ | ౩-౨-౯ |
| ౯౦ | ౮౫-౪౦ | ౫-౫ | ౩-౨-౩౨ | ౧౦౯ | ౮౪-౩౭ | ౪-౪౧ | ౩-౨-౮ |
| ౯౧ | ౮౫-౪౦ | ౫-౫ | ౩-౨-౩౨ | ౧౧౦ | ౮౪-౩౨ | ౪-౩౯ | ౩-౨-౬ |
| ౯౨ | ౮౫-౩౮ | ౫-౪ | ౩-౨-౩౧ | ౧౧౧ | ౮౪-౨౯ | ౪-౩౮ | ౩-౨-౫ |

| వత్సర సంఖ్యా. | భాగ్యాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | వత్సర సంఖ్యా. | భాగ్యాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౧౧౨ | ౮౪-౨౧ | ౪-౩౫ | ౩౨- ౨ | ౧౩౧ | ౮౨-౩౯ | ౩-౫౬ | ౩౧-౨౩ |
| ౧౧౩ | ౮౪-౧౬ | ౪-౩౩ | ౩౨- ౦ | ౧౩౨ | ౮౨-౩౩ | ౩-౫౪ | ౩౧-౨౧ |
| ౧౧౪ | ౮౪-౧౧ | ౪-౩౧ | ౩౧-౫౮ | ౧౩౩ | ౮౨-౨౮ | ౩-౫౨ | ౩౧-౧౯ |
| ౧౧౫ | ౮౪- ౫ | ౪-౨౯ | ౩౧-౫౬ | ౧౩౪ | ౮౨-౨౩ | ౩-౫౦ | ౩౧-౧౭ |
| ౧౧౬ | ౮౪- ౦ | ౪-౨౭ | ౩౧-౫౪ | ౧౩౫ | ౮౨-౧౫ | ౩-౪౭ | ౩౧-౧౪ |
| ౧౧౭ | ౮౩-౫౫ | ౪-౨౫ | ౩౧-౫౨ | ౧౩౬ | ౮౨-౧౦ | ౩-౪౫ | ౩౧-౧౨ |
| ౧౧౮ | ౮౩-౫౦ | ౪-౨౩ | ౩౧-౫౦ | ౧౩౭ | ౮౨- ౪ | ౩-౪౩ | ౩౧-౧౦ |
| ౧౧౯ | ౮౩-౪౪ | ౪-౨౧ | ౩౧-౪౮ | ౧౩౮ | ౮౧-౫౬ | ౩-౪౦ | ౩౧- ౭ |
| ౧౨౦ | ౮౩-౩౯ | ౪-౧౯ | ౩౧-౪౬ | ౧౩౯ | ౮౧-౫౧ | ౩-౩౮ | ౩౧- ౫ |
| ౧౨౧ | ౮౩-౩౪ | ౪-౧౭ | ౩౧-౪౪ | ౧౪౦ | ౮౧-౪౬ | ౩-౩౬ | ౩౧- ౩ |
| ౧౨౨ | ౮౩-౨౯ | ౪-౧౫ | ౩౧-౪౨ | ౧౪౧ | ౮౧-౪౧ | ౩-౩౪ | ౩౧- ౧ |
| ౧౨౩ | ౮౩-౨౬ | ౪-౧౪ | ౩౧-౪౧ | ౧౪౨ | ౮౧-౩౩ | ౩-౩౧ | ౩౦-౫౮ |
| ౧౨౪ | ౮౩-౧౮ | ౪-౧౧ | ౩౧-౩౮ | ౧౪౩ | ౮౧-౨౭ | ౩-౨౯ | ౩౦-౫౬ |
| ౧౨౫ | ౮౩-౧౩ | ౪- ౯ | ౩౧-౩౬ | ౧౪౪ | ౮౧-౨౨ | ౩-౨౭ | ౩౦-౫౪ |
| ౧౨౬ | ౮౩- ౭ | ౪- ౭ | ౩౧-౩౪ | ౧౪౫ | ౮౧-౧౪ | ౩-౨౪ | ౩౦-౫౧ |
| ౧౨౭ | ౮౩- ౨ | ౪- ౫ | ౩౧-౩౨ | ౧౪౬ | ౮౧- ౯ | ౩-౨౨ | ౩౦-౪౯ |
| ౧౨౮ | ౮౨-౫౭ | ౪- ౩ | ౩౧-౩౦ | ౧౪౭ | ౮౧- ౧ | ౩-౧౯ | ౩౦-౪౬ |
| ౧౨౯ | ౮౨-౫౨ | ౪- ౧ | ౩౧-౨౮ | ౧౪౮ | ౮౦-౫౬ | ౩-౧౭ | ౩౦-౪౪ |
| ౧౩౦ | ౮౨-౪౬ | ౩-౫౯ | ౩౧-౨౬ | ౧౪౯ | ౮౦-౫౧ | ౩-౧౫ | ౩౦-౪౨ |

| దివసదళ సంఖ్యా. | భోజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దివసమానం ఘ- విఘ | దివసదళ సంఖ్యా. | భోజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దివసమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౧౫౦ | ౮౦-౪౩ | ౩-౧౨ | ౩౦-౩౯ | ౧౬౯ | ౭౮-౪౨ | ౨-౨౬ | ౨౯-౫౩ |
| ౧౫౧ | ౮౦-౩౭ | ౩-౧౦ | ౩౦-౩౭ | ౧౭౦ | ౭౮-౩౪ | ౨-౨౩ | ౨౯-౫౦ |
| ౧౫౨ | ౮౦-౩౨ | ౩- ౮ | ౩౦-౩౫ | ౧౭౧ | ౭౮-౨౮ | ౨-౨౧ | ౨౯-౪౮ |
| ౧౫౩ | ౮౦-౨౪ | ౩- ౫ | ౩౦-౩౨ | ౧౭౨ | ౭౮-౨౦ | ౨-౧౮ | ౨౯-౪౫ |
| ౧౫౪ | ౮౦-౧౯ | ౩- ౩ | ౩౦-౩౦ | ౧౭౩ | ౭౮-౧౫ | ౨-౧౬ | ౨౯-౪౩ |
| ౧౫౫ | ౮౦-౧౧ | ౩- ౦ | ౩౦-౨౭ | ౧౭౪ | ౭౮- ౭ | ౨-౧౩ | ౨౯-౪౦ |
| ౧౫౬ | ౮౦- ౬ | ౨-౫౮ | ౩౦-౨౫ | ౧౭౫ | ౭౮- ౨ | ౨-౧౧ | ౨౯-౩౮ |
| ౧౫౭ | ౭౯-౫౮ | ౨-౫౫ | ౩౦-౨౨ | ౧౭౬ | ౭౭-౫౭ | ౨- ౯ | ౨౯-౩౬ |
| ౧౫౮ | ౭౯-౫౩ | ౨-౫౩ | ౩౦-౨౦ | ౧౭౭ | ౭౭-౪౯ | ౨- ౬ | ౨౯-౩౩ |
| ౧౫౯ | ౭౯-౪౭ | ౨-౫౧ | ౩౦-౧౮ | ౧౭౮ | ౭౭-౪౪ | ౨- ౪ | ౨౯-౩౧ |
| ౧౬౦ | ౭౯-౩౯ | ౨-౪౮ | ౩౦-౧౫ | ౧౭౯ | ౭౭-౩౮ | ౨- ౨ | ౨౯-౨౯ |
| ౧౬౧ | ౭౯-౩౪ | ౨-౪౬ | ౩౦-౧౩ | ౧౮౦ | ౭౭-౩౦ | ౧-౫౯ | ౨౯-౨౬ |
| ౧౬౨ | ౭౯-౨౬ | ౨-౪౩ | ౩౦-౧౦ | ౧౮౧ | ౭౭-౨౫ | ౧-౫౭ | ౨౯-౨౪ |
| ౧౬౩ | ౭౯-౨౧ | ౨-౪౧ | ౩౦- ౮ | ౧౮౨ | ౭౭-౧౭ | ౧-౫౪ | ౨౯-౨౧ |
| ౧౬౪ | ౭౯-౧౩ | ౨-౩౮ | ౩౦- ౫ | ౧౮౩ | ౭౭-౧౨ | ౧-౫౨ | ౨౯-౧౯ |
| ౧౬౫ | ౭౯- ౩ | ౨-౩౫ | ౩౦- ౨ | ౧౮౪ | ౭౭- ౪ | ౧-౪౯ | ౨౯-౧౬ |
| ౧౬౬ | ౭౯- ౦ | ౨-౩౩ | ౩౦- ౦ | ౧౮౫ | ౭౬-౫౯ | ౧-౪౭ | ౨౯-౧౪ |
| ౧౬౭ | ౭౮-౫౨ | ౨-౩౦ | ౨౯-౫౭ | ౧౮౬ | ౭౬-౫౪ | ౧-౪౫ | ౨౯-౧౨ |
| ౧౬౮ | ౭౮-౪౭ | ౨-౨౮ | ౨౯-౫౫ | ౧౮౭ | ౭౫-౪౬ | ౧-౪౨ | ౨౯- ౯ |

| దినపదక సంఖ్యా. | ఛాయార్క ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | ఛాయార్క ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౧౮౮ | ౭౬-౪౦ | ౧-౪౦ | ౨౯- ౭ | ౨౦౭ | ౭౪-౪౭ | ౦-౫౭ | ౨౮-౨౪ |
| ౧౮౯ | ౭౬-౩౫ | ౧-౩౮ | ౨౯- ౫ | ౨౦౮ | ౭౪-౪౨ | ౦-౫౫ | ౨౮-౨౨ |
| ౧౯౦ | ౭౬-౨౭ | ౧-౩౫ | ౨౯- ౨ | ౨౦౯ | ౭౪-౩౭ | ౦-౫౩ | ౨౮-౨౦ |
| ౧౯౧ | ౭౬-౨౨ | ౧-౩౩ | ౨౯- ౦ | ౨౧౦ | ౭౪-౨౯ | ౦-౫౦ | ౨౮-౧౭ |
| ౧౯౨ | ౭౬-౧౪ | ౧-౩౦ | ౨౮-౫౭ | ౨౧౧ | ౭౪-౨౩ | ౦-౪౮ | ౨౮-౧౫ |
| ౧౯౩ | ౭౬- ౯ | ౧-౨౮ | ౨౮-౫౫ | ౨౧౨ | ౭౪-౧౮ | ౦-౪౬ | ౨౮-౧౩ |
| ౧౯౪ | ౭౬- ౪ | ౧-౨౬ | ౨౮-౫౩ | ౨౧౩ | ౭౪-౧౩ | ౦-౪౪ | ౨౮-౧౧ |
| ౧౯౫ | ౭౫-౫౮ | ౧-౨౪ | ౨౮-౫౧ | ౨౧౪ | ౭౪- ౮ | ౦-౪౨ | ౨౮- ౯ |
| ౧౯౬ | ౭౫-౫౦ | ౧-౨౧ | ౨౮-౪౮ | ౨౧౫ | ౭౪- ౨ | ౦-౪౦ | ౨౮- ౭ |
| ౧౯౭ | ౭౫-౪౫ | ౧-౧౯ | ౨౮-౪౬ | ౨౧౬ | ౭౪- ౨ | ౦-౪౦ | ౨౮- ౭ |
| ౧౯౮ | ౭౫-౪౦ | ౧-౧౭ | ౨౮-౪౪ | ౨౧౭ | ౭౩-౫౭ | ౦-౩౮ | ౨౮- ౫ |
| ౧౯౯ | ౭౫-౩౫ | ౧-౧౫ | ౨౮-౪౨ | ౨౧౮ | ౭౩-౫౨ | ౦-౩౬ | ౨౮- ౩ |
| ౨౦౦ | ౭౫-౨౭ | ౧-౧౨ | ౨౮-౩౯ | ౨౧౯ | ౭౩-౪౯ | ౦-౩౫ | ౨౮- ౨ |
| ౨౦౧ | ౭౫-౨౧ | ౧-౧౦ | ౨౮-౩౭ | ౨౨౦ | ౭౩-౪౪ | ౦-౩౩ | ౨౮- ౦ |
| ౨౦౨ | ౭౫-౧౬ | ౧- ౮ | ౨౮-౩౫ | ౨౨౧ | ౭౩-౩౯ | ౦-౩౧ | ౨౭-౫౮ |
| ౨౦౩ | ౭౫-౧౧ | ౧- ౬ | ౨౮-౩౩ | ౨౨౨ | ౭౩-౩౬ | ౦-౩౦ | ౨౭-౫౭ |
| ౨౦౪ | ౭౫- ౬ | ౧- ౪ | ౨౮-౩౧ | ౨౨౩ | ౭౩-౩౧ | ౦-౨౮ | ౨౭-౫౫ |
| ౨౦౫ | ౭౪-౫౮ | ౧- ౧ | ౨౮-౨౮ | ౨౨౪ | ౭౩-౨౬ | ౦-౨౬ | ౨౭-౫౩ |
| ౨౦౬ | ౭౪-౫౨ | ౦-౫౯ | ౨౮-౨౬ | ౨౨౫ | ౭౩-౨౦ | ౦-౨౪ | ౨౭-౫౧ |

| దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | భాజ్యః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౨౨౬ | ౭౩-౧౮ | ౦-౨౩ | ౨౭-౫౦ | ౨౪౫ | ౭౨-౨౮ | ౦- ౪ | ౨౭-౩౧ |
| ౨౨౭ | ౭౩-౧౫ | ౦-౨౨ | ౨౭-౪౯ | ౨౪౬ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౨౮ | ౭౩-౧౦ | ౦-౨౦ | ౨౭-౪౭ | ౨౪౭ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౨౯ | ౭౩- ౭ | ౦-౧౯ | ౨౭-౪౬ | ౨౪౮ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౩౦ | ౭౩- ౪ | ౦-౧౮ | ౨౭-౪౫ | ౨౪౯ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౩౧ | ౭౨-౫౯ | ౦-౧౬ | ౨౭-౪౩ | ౨౫౦ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౩౨ | ౭౨-౫౭ | ౦-౧౫ | ౨౭-౪౨ | ౨౫౧ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౩౩ | ౭౨-౫౪ | ౦-౧౪ | ౨౭-౪౧ | ౨౫౨ | ౭౨-౨౦ | ౦- ౧ | ౨౭-౨౮ |
| ౨౩౪ | ౭౨-౪౯ | ౦-౧౨ | ౨౭-౩౯ | ౨౫౩ | ౭౨-౨౦ | ౦- ౧ | ౨౭-౨౮ |
| ౨౩౫ | ౭౨-౪౯ | ౦-౧౨ | ౨౭-౩౯ | ౨౫౪ | ౭౨-౨౦ | ౦- ౧ | ౨౭-౨౮ |
| ౨౩౬ | ౭౨-౪౬ | ౦-౧౧ | ౨౭-౩౮ | ౨౫౫ | ౭౨-౧౭ | ౦- ౦ | ౨౭-౨౮ |
| ౨౩౭ | ౭౨-౪౩ | ౦-౧౦ | ౨౭-౩౭ | ౨౫౬ | ౭౨-౨౦ | ౦- ౧ | ౨౭-౨౮ |
| ౨౩౮ | ౭౨-౪౧ | ౦- ౯ | ౨౭-౩౬ | ౨౫౭ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౩౯ | ౭౨-౩౮ | ౦- ౮ | ౨౭-౩౫ | ౨౫౮ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౪౦ | ౭౨-౩౫ | ౦- ౭ | ౨౭-౩౪ | ౨౫౯ | ౭౨-౨౨ | ౦- ౨ | ౨౭-౨౯ |
| ౨౪౧ | ౭౨-౩౩ | ౦- ౬ | ౨౭-౩౩ | ౨౬౦ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౪౨ | ౭౨-౩౩ | ౦- ౬ | ౨౭-౩౩ | ౨౬౧ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౪౩ | ౭౨-౩౦ | ౦- ౫ | ౨౭-౩౨ | ౨౬౨ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |
| ౨౪౪ | ౭౨-౨౮ | ౦- ౪ | ౨౭-౩౧ | ౨౬౩ | ౭౨-౨౫ | ౦- ౩ | ౨౭-౩౦ |

| దినపరిమాణ సంఖ్యా. | భోగ్యః ఘ-విఘ | యుతిః ఘ-విఘ | దినమానం ఘ-విఘ | దినపరిమాణ సంఖ్యా. | భోగ్యః ఘ-విఘ | యుతిః ఘ-విఘ | దినమానం ఘ-విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౨౬౪ | ౭౨-౨౮ | ౦- ౪ | ౨౭-౩౧ | ౨౮౩ | ౭౩-౨౬ | ౦-౨౬ | ౨౭-౫౩ |
| ౨౬౫ | ౭౨-౩౦ | ౦- ౫ | ౨౭-౩౨ | ౨౮౪ | ౭౩-౨౮ | ౦-౨౭ | ౨౭-౫౪ |
| ౨౬౬ | ౭౨-౩౩ | ౦- ౬ | ౨౭-౩౩ | ౨౮౫ | ౭౩-౩౩ | ౦-౨౯ | ౨౭-౫౬ |
| ౨౬౭ | ౭౨-౩౫ | ౦- ౭ | ౨౭-౩౪ | ౨౮౬ | ౭౩-౩౯ | ౦-౩౧ | ౨౭-౫౮ |
| ౨౬౮ | ౭౨-౩౮ | ౦- ౮ | ౨౭-౩౫ | ౨౮౭ | ౭౩-౪౧ | ౦-౩౨ | ౨౭-౫౯ |
| ౨౬౯ | ౭౨-౪౧ | ౦- ౯ | ౨౭-౩౬ | ౨౮౮ | ౭౩-౪౭ | ౦-౩౪ | ౨౮- ౧ |
| ౨౭౦ | ౭౨-౪౧ | ౦- ౯ | ౨౭-౩౬ | ౨౮౯ | ౭౩-౫౨ | ౦-౩౬ | ౨౮- ౩ |
| ౨౭౧ | ౭౨-౪౩ | ౦-౧౦ | ౨౭-౩౭ | ౨౯౦ | ౭౩-౫౪ | ౦-౩౭ | ౨౮- ౪ |
| ౨౭౨ | ౭౨-౪౬ | ౦-౧౧ | ౨౭-౩౮ | ౨౯౧ | ౭౪- ౦ | ౦-౩౯ | ౨౮- ౬ |
| ౨౭౩ | ౭౨-౪౯ | ౦-౧౨ | ౨౭-౩౯ | ౨౯౨ | ౭౪- ౨ | ౦-౪౦ | ౨౮- ౭ |
| ౨౭౪ | ౭౨-౫౧ | ౦-౧౩ | ౨౭-౪౦ | ౨౯౩ | ౭౪- ౮ | ౦-౪౨ | ౨౮- ౯ |
| ౨౭౫ | ౭౨-౫౭ | ౦-౧౫ | ౨౭-౪౨ | ౨౯౪ | ౭౪-౧౦ | ౦-౪౩ | ౨౮-౧౦ |
| ౨౭౬ | ౭౨-౫౯ | ౦-౧౬ | ౨౭-౪౩ | ౨౯౫ | ౭౪-౧౬ | ౦-౪౫ | ౨౮-౧౨ |
| ౨౭౭ | ౭౩- ౨ | ౦-౧౭ | ౨౭-౪౪ | ౨౯౬ | ౭౪-౨౩ | ౦-౪౮ | ౨౮-౧౫ |
| ౨౭౮ | ౭౩- ౭ | ౦-౧౯ | ౨౭-౪౬ | ౨౯౭ | ౭౪-౨౯ | ౦-౫౦ | ౨౮-౧౭ |
| ౨౭౯ | ౭౩-౧౦ | ౦-౨౦ | ౨౭-౪౭ | ౨౯౮ | ౭౪-౩౪ | ౦-౫౨ | ౨౮-౧౯ |
| ౨౮౦ | ౭౩-౧౦ | ౦-౨౦ | ౨౭-౪౭ | ౨౯౯ | ౭౪-౩౯ | ౦-౫౪ | ౨౮-౨౧ |
| ౨౮౧ | ౭౩-౧౮ | ౦-౨౩ | ౨౭-౫౦ | ౩౦౦ | ౭౪-౪౫ | ౦-౫౬ | ౨౮-౨౩ |
| ౨౮౨ | ౭౩-౨౦ | ౦-౨౪ | ౨౭-౫౧ | ౩౦౧ | ౭౪-౫౨ | ౦-౫౯ | ౨౮-౨౬ |

| దినపదక సంఖ్య. | భాజ్యః ఘ. విఘ | యుతిః ఘ. విఘ | దినమానం ఘ. విఘ | దినపదక సంఖ్య. | భాజ్యః ఘ. విఘ | యుతిః ఘ. విఘ | దినమానం ఘ. విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౩౦౨ | ౭౪-౫౮ | ౧- ౧ | ౨౮-౨౮ | ౩౨౧ | ౭౬-౫౧ | ౧-౪౫ | ౨౯-౧౧ |
| ౩౦౩ | ౭౫- ౩ | ౧- ౩ | ౨౮-౩౦ | ౩౨౨ | ౭౬-౫౯ | ౧-౪౭ | ౨౯-౧౪ |
| ౩౦౪ | ౭౫- ౮ | ౧- ౫ | ౨౮-౩౨ | ౩౨౩ | ౭౭- ౪ | ౧-౪౯ | ౨౯-౧౬ |
| ౩౦౫ | ౭౫-౧౬ | ౧- ౮ | ౨౮-౩౫ | ౩౨౪ | ౭౭-౧౨ | ౧-౫౨ | ౨౯-౧౯ |
| ౩౦౬ | ౭౫-౧౯ | ౧- ౯ | ౨౮-౩౬ | ౩౨౫ | ౭౭-౧౭ | ౧-౫౪ | ౨౯-౨౧ |
| ౩౦౭ | ౭౫-౨౭ | ౧-౧౨ | ౨౮-౩౯ | ౩౨౬ | ౭౭-౨౫ | ౧-౫౭ | ౨౯-౨౪ |
| ౩౦౮ | ౭౫-౩౨ | ౧-౧౪ | ౨౮-౪౧ | ౩౨౭ | ౭౭-౨౫ | ౧-౫౭ | ౨౯-౨౪ |
| ౩౦౯ | ౭౫-౩౭ | ౧-౧౬ | ౨౮-౪౩ | ౩౨౮ | ౭౭-౩౬ | ౨- ౧ | ౨౯-౨౮ |
| ౩౧౦ | ౭౫-౪౫ | ౧-౧౯ | ౨౮-౪౬ | ౩౨౯ | ౭౭-౪౪ | ౨- ౪ | ౨౯-౩౧ |
| ౩౧౧ | ౭౫-౫౦ | ౧-౨౧ | ౨౮-౪౮ | ౩౩౦ | ౭౭-౪౯ | ౨- ౬ | ౨౯-౩౩ |
| ౩౧౨ | ౭౫-౫౬ | ౧-౨౩ | ౨౮-౫౦ | ౩౩౧ | ౭౭-౫౭ | ౨- ౯ | ౨౯-౩౬ |
| ౩౧౩ | ౭౬- ౧ | ౧-౨౫ | ౨౮-౫౨ | ౩౩౨ | ౭౮- ౨ | ౨-౧౧ | ౨౯-౩౮ |
| ౩౧౪ | ౭౬- ౬ | ౧-౨౭ | ౨౮-౫౪ | ౩౩౩ | ౭౮-౧౦ | ౨-౧౪ | ౨౯-౪౧ |
| ౩౧౫ | ౭౬-౧౪ | ౧-౩౦ | ౨౮-౫౭ | ౩౩౪ | ౭౮-౧౫ | ౨-౧౬ | ౨౯-౪౩ |
| ౩౧౬ | ౭౬-౧౯ | ౧-౩౨ | ౨౮-౫౯ | ౩౩౫ | ౭౮-౨౩ | ౨-౧౯ | ౨౯-౪౬ |
| ౩౧౭ | ౭౬-౨౭ | ౧-౩౫ | ౨౯- ౨ | ౩౩౬ | ౭౮-౨౮ | ౨-౨౧ | ౨౯-౪౮ |
| ౩౧౮ | ౭౬-౩౨ | ౧-౩౭ | ౨౯- ౪ | ౩౩౭ | ౭౮-౩౬ | ౨-౨౪ | ౨౯-౫౧ |
| ౩౧౯ | ౭౬-౧౮ | ౧-౩౯ | ౨౯- ౬ | ౩౩౮ | ౭౮-౪౧ | ౨-౨౬ | ౨౯-౫౩ |
| ౩౨౦ | ౭౬-౪౬ | ౧-౪౨ | ౨౯- ౯ | ౩౩౯ | ౭౮-౪౯ | ౨-౨౯ | ౨౯-౫౬ |

| దినపదక సంఖ్యా. | ఛాయాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ | దినపదక సంఖ్యా. | ఛాయాః ఘ- విఘ | యుతిః ఘ- విఘ | దినమానం ఘ- విఘ |
|---|---|---|---|---|---|---|---|
| ౩౪౦ | ౭౮-౫౫ | ౨-౩౧ | ౨౯-౫౮ | ౩౫౩ | ౮౦-౧౬ | ౩- ౨ | ౩౦-౨౯ |
| ౩౪౧ | ౭౯- ౦ | ౨-౩౩ | ౩౦- ౦ | ౩౫౪ | ౮౦-౨౪ | ౩- ౫ | ౩౦-౩౨ |
| ౩౪౨ | ౭౯- ౫ | ౨-౩౫ | ౩౦- ౨ | ౩౫౫ | ౮౦-౨౯ | ౩- ౭ | ౩౦-౩౪ |
| ౩౪౩ | ౭౯-౧౩ | ౨-౩౮ | ౩౦- ౫ | ౩౫౬ | ౮౦-౩౭ | ౩-౧౦ | ౩౦-౩౭ |
| ౩౪౪ | ౭౯-౧౮ | ౨-౪౦ | ౩౦- ౭ | ౩౫౭ | ౮౦-౪౩ | ౩-౧౨ | ౩౦-౩౯ |
| ౩౪౫ | ౭౯-౨౬ | ౨-౪౩ | ౩౦-౧౦ | ౩౫౮ | ౮౦-౪౮ | ౩-౧౪ | ౩౦-౪౧ |
| ౩౪౬ | ౭౯-౩౨ | ౨-౪౫ | ౩౦-౧౨ | ౩౫౯ | ౮౦-౫౬ | ౩-౧౭ | ౩౦-౪౪ |
| ౩౪౭ | ౭౯-౩౭ | ౨-౪౭ | ౩౦-౧౪ | ౩౬౦ | ౮౧- ౧ | ౩-౧౯ | ౩౦-౪౬ |
| ౩౪౮ | ౭౯-౪౫ | ౨-౫౦ | ౩౦-౧౭ | ౩౬౧ | ౮౧- ౬ | ౩-౨౧ | ౩౦-౪౮ |
| ౩౪౯ | ౭౯-౫౦ | ౨-౫౨ | ౩౦-౧౯ | ౩౬౨ | ౮౧-౧౨ | ౩-౨౩ | ౩౦-౫౦ |
| ౩౫౦ | ౭౯-౫౮ | ౨-౫౫ | ౩౦-౨౨ | ౩౬౩ | ౮౧-౧౭ | ౩-౨౫ | ౩౦-౫౨ |
| ౩౫౧ | ౮౦- ౩ | ౨-౫౭ | ౩౦-౨౪ | ౩౬౪ | ౮౧-౨౫ | ౩-౨౮ | ౩౦-౫౫ |
| ౩౫౨ | ౮౦-౧౧ | ౩- ౦ | ౩౦-౨౭ | ౩౬౫ | ౮౧-౩౦ | ౩-౩౦ | ౩౦-౫౭ |

ఈపదకములను ఉపయోగించుకొను పద్ధతి.

ఇష్టదినస్యసావనాహర్గణసాధనమాహ.

శ్లో॥ మధ్యోర్గతో మాసచయః ఖరామ ౩౦ హతో దినాఢ్య స్సతుశుద్ధి హీనః

నిరగ్రఖాంగాం ౬౦ శవిశోధితోయం శారద్వాఖ్యోర్క ముఖోద్యనంఘః॥

తా॥ ఏదినమందు తాను ప్రొద్దుగట్టఁదలఁచెనో నాఁటికావర్తమానసంవత్సరము లోఁ గడచిన నెలలను ౩౦ చేత గుణించి దానిలో నావర్తమానమాసములో శుద్ధప్రతిపత్తు మొదలు తన యిష్టదినమునాఁటికి గతించిన దినములను గూడి దానిలో ఉత్తరభాగమందుఁ జెప్పిన శుద్ధి ధ్రువముయొక్క ఊర్ధ్వాంకమునుమాత్రము తీసివేసి అది రెండుస్థలములయందుంచి యందొకప్రతిని ౬౦ చే భాగింపఁగా వచ్చినలబ్ధమును మాత్రము రెండవప్రతిలోఁ దీసివేసినట్టయిన అదియే దినగణ మను పేరుగలది యగును.

ఈదినగణమును ౨ ప్రతులుగానుంచి అందొక ప్రతిలో నుత్తరభాగమందుఁ జెప్పినవారధ్రువము యొక్క ఊర్ధ్వాంకమును మాత్రము కూడి ౭ చే భాగింపఁగా శేషము ఆదివారమునుండి లెక్కింపఁగా అన్నవారము ఆదినమునఁ గావలెను. ఆవారము తన యిష్టతిథినాఁటి వారమునకు సరిగానుండెనా రెండవప్రతిగా నుంచిన దినగణము స్ఫుటమైనదనియే వ్రాసికోవలెను. ఒకవేళ ౧ వారము తక్కువ అయిన రెండవ ప్రతిలో ౧ కూడవలెను. ఒకటిహెచ్చువచ్చి నట్టయిన ఆరెండవ ప్రతిలో ౧ తీసివేయవలయును.

ఈలాగుచేయఁగా నయిన రెండవ ప్రతిగానుంచిన దినగణము స్ఫుటమగును. దానిని స్ఫుట దినగణమని వ్రాసికోవలెను. దీనికే అహర్గణమనియు, ఖుద్రపదయమనియు, దినగణమనియు, ద్యుగణమనియు ద్యుసంఘమనియు అనేకనామములు గలవు. దీనిప్రయోజనము వ్రాసెదను.

౮. అథదినగణపదకానా ముపయోగమాహ.

శ్లో॥ అహర్గణేన తుల్యం యత్పదం సంగృహ్య తత్స్ఫుటం
యుతియుక్తప్రభాభక్తాద్భాజ్యాన్నాడ్యాదికం భవేత్
స్వేష్టనాడీ హృతోభాజ్యోయుతిహీనః ప్రభాభవేత్ ॥

తా॥ ఈప్రకార మహర్గణము సాధించుకొని యాయహర్గణమెంతయగునో యంతసంఖ్యగల దినగణపదకమును చూడ దానిలో మొదటికలము దినపదక క్రమసంఖ్యయు, రెండవ కలము భాజ్యఘటికాదియు, మూఁడవకలము యుతి ఘటికాదియు, నా

లుగవకలము నాటిదినప్రమాణమును తెలియఁజేయును. ఆదినగణ పదకములు ౧ మొదలు ౩౬౫ వరకును వ్రాయఁబడియున్నవి. అందుచేత యిష్టదినమునకు ఎన్నవపదకము వచ్చునో అన్నవపదకమును గుర్తుగనుంచఁగా "యుతియుక్తప్రభాభక్తాత్ ;" అను పైశ్లోకార్థరీతిచే నాదిన పదకములో వ్రాసియున్న యుతియను దానిలో పాద చ్ఛాయలుగూడి దానిచేతను భాజ్యమను దానిని భాగింపఁగా గడియలు విగడియలువచ్చును.

ఇదిపాదచ్ఛాయలవలన ప్రొద్దుగట్టెడు వన్ని ప్రకరణములలో బహునికరమయినది. ఇఁక విలోమవిధిచేత నిష్టఘటికలవేళ కిన్నిపాదచ్ఛాయలు వచ్చునని తెలియు సాధనమును "స్వేష్టనాడీ హృతో భాజ్యః" అనెడి పైశ్లోకార్థముచేతం జెప్పుచున్నాఁడు. ఎట్లనిన ;

తనయిష్ట ఘటికలచే భాజ్యమును భాగించఁగా వచ్చిన లబ్ధములో యుతి యను దానిం దీసివేయగా మిగిలినదియె పాదచ్ఛాయలగును.

ఉదాహరణము :—పైనుదాహరించిన నందన సంవత్సర ఆశ్వియుజ శుద్ధ ౧౫ గురువారము ఉదయమున పాదచ్ఛాయలు ౧౦|౩౦ టికి ప్రొద్దుగట్టవలసియుండెను గనుక ముందువ్రాసిన శ్లోకప్రకారము వచ్చినశాలివాహనశకము ౧౮౧౪. శ్లోకప్రకారమీయేటికి వారధ్రువము ౪|౪౩|౧౫. శ్లోకప్రకారమీయేటికి శుద్ధిధ్రువము ౧౬|౪౨|౧౧. శ్లోకప్రకార మీదినమున కహర్గణము ౧౭౬. శ్లోకప్రకారము దినగణపదక సంఖ్య ౧౭౬ యీపదకములో వ్రాసియున్న భాజ్యఘటికాది ౭౭|౫౭ యుతిఘటికాది ౨|౯ దిన ప్రమాణ ఘటికాది ౨౯|౩౬ యీప్రకార మీయుపకరణములను సాధించుకొని పాదచ్ఛాయలు కొలుచుకొని ప్రొద్దుగట్టవలెను గనుక—

ఈదినము ఉదయమున పాదచ్ఛాయలు ౧౦|౩౦ ఇందులో యుతి ౨|౯ కూడగా నైనది. ౧౨|౩౯ దీనిచేత భాజ్యము ౭౭|౫౭ ను భాగింపఁగా వచ్చిన లబ్ధము ఘటికలు వచ్చును. ఆశేషమును ౬౦ చేత గుణించి మరల యుతియుత పాదచ్ఛాయలచేతనే భాగించగా విగడియలు వచ్చును. కనుక యుతియుతపాదచ్ఛాయలు ౧౨-౩౯ దీనిని సవర్ణింపగా ౭౫౯ ఇది ఛేదక మనఁబడును. భాజ్యము ౭౭-౫౭ దీనిని సవర్ణింపగా ౪౬౭౭ దీనిని పై ఛేదకముచేత భాగించవలెను గనుక :—

భాజ్యసవర్ణము.

ఛేదకము ౭౫౯ ) ౪౬౭౭ ( ౬ గడియలు
౪౫౫౪
౧౨౩ శేషము
౬౦ దీనిచే గుణించగా
ఛేదకము ౭౫౯ ) ౭౩౮౦ ( ౯ విగడియలు
౬౮౩౧
౫౪౯

ఈ ప్రకారము చేయఁగా సూర్యోదయాది ౬ గడియల ౯ విగడియల ప్రొద్దెక్కినని తెలియవలయును. ఇది స్పష్టమైన ప్రకరణము. ఇదిచూడఁగాఁ గొంచెము కఠినమని తోఁచును, గాని కఠినము గాదు. బహుసులభమైనది. రెండుమూఁడుపర్యాయములు చూచినయెడల నతి సుకరముగ నుండును- పాదచ్ఛాయాప్రకరణము లన్నిటిలోను నికరమైనది గనుక నాదరింపఁదగినది.

౯. వెనుకటి వారధ్రువ, శుద్ధిధ్రువములను గణితశ్రమలేశము లేకుండఁ గడచిన ప్రభవాదిగా రాఁగల అక్షయాంతమును ౬౦ సంవత్సరములవఱకు సారిణి వ్రాయఁబడుచున్నది.

వారధ్రువమునకును, శుద్ధిధ్రువమునకును ౩ ప్రతులు సాధింపబడినవి. అయితే పూర్వోక్తధ్రువములయొక్క యూర్ధ్వాంకములుమాత్రమే ప్రయోజనముగనుక ఘటికాది విడిచిపెట్టి ఊర్ధ్వాంకములు మాత్రము ౬౦ సంవత్సరములకు వ్రాయఁబడినవి. శకము ౧౭౮౯ మొదలు శకము౧౮౪౮ వఱకు.

| క్రమసంఖ్య | సంవత్సరముల పేర్లు. | ఏరేటి కంటి నారదుప్రకారము. | ఏరేటి కంటి వసిష్ఠప్రకారము. | క్రమసంఖ్య | సంవత్సరముల పేర్లు. | ఏరేటి కంటి నారదుప్రకారము. | ఏరేటి కంటి వసిష్ఠప్రకారము. |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ప్రభవ | ౧ | ౧౦ | ౩౧ | హేమలంబి | ౪ | ౧౨ |
| ౨ | విభవ | ౨ | ౨౧ | ౩౨ | విలంబి | ౫ | ౨౩ |
| ౩ | శుక్ల | ౩ | ౨ | ౩౩ | వికారి | ౬ | ౪ |
| ౪ | ప్రమోద | ౫ | ౧౩ | ౩౪ | శార్వరీ | ౦ | ౧౫ |
| ౫ | ప్రజాపతి | ౬ | ౨౪ | ౩౫ | ప్లవ | ౨ | ౨౬ |
| ౬ | ఆంగీరస | ౦ | ౫ | ౩౬ | శుభకృత్ | ౩ | ౭ |
| ౭ | శ్రీముఖ | ౧ | ౧౬ | ౩౭ | శోభకృత్ | ౪ | ౧౮ |
| ౮ | భావ | ౩ | ౨౭ | ౩౮ | క్రోధి | ౫ | ౨౯ |
| ౯ | యువ | ౪ | ౮ | ౩౯ | విశ్వావసు | ౦ | ౧౦ |
| ౧౦ | ధాత | ౫ | ౧౯ | ౪౦ | పరాభవ | ౧ | ౨౧ |
| ౧౧ | ఈశ్వర | ౬ | ౦ | ౪౧ | ప్లవంగ | ౨ | ౨ |
| ౧౨ | బహుధాన్య | ౧ | ౧౧ | ౪౨ | కీలక | ౩ | ౧౩ |
| ౧౩ | ప్రమాధి | ౨ | ౨౨ | ౪౩ | సౌమ్య | ౫ | ౨౪ |
| ౧౪ | విక్రమ | ౩ | ౩ | ౪౪ | సాధారణ | ౬ | ౫ |
| ౧౫ | వృష | ౪ | ౧౪ | ౪౫ | విరోధికృత్ | ౦ | ౧౬ |
| ౧౬ | చిత్రభాను | ౬ | ౨౬ | ౪౬ | పరీధావీ | ౧ | ౨౭ |
| ౧౭ | సుభాను | ౦ | ౭ | ౪౭ | ప్రమాదీ | ౩ | ౯ |
| ౧౮ | తారణ | ౧ | ౧౮ | ౪౮ | ఆనంద | ౪ | ౨౦ |
| ౧౯ | పార్థివ | ౨ | ౨౯ | ౪౯ | రాక్షస | ౫ | ౧ |
| ౨౦ | వ్యయ | ౪ | ౧౦ | ౫౦ | నల | ౬ | ౧౨ |
| ౨౧ | సర్వజిత్ | ౫ | ౨౧ | ౫౧ | పింగళ | ౧ | ౨౩ |
| ౨౨ | సర్వధారి | ౬ | ౨ | ౫౨ | కాళయుక్తి | ౨ | ౪ |
| ౨౩ | విరోధి | ౦ | ౧౩ | ౫౩ | సిద్ధార్థి | ౩ | ౧౫ |
| ౨౪ | వికృతి | ౨ | ౨౪ | ౫౪ | రౌద్రి | ౪ | ౨౬ |
| ౨౫ | ఖర | ౩ | ౫ | ౫౫ | దుర్మతి | ౬ | ౭ |
| ౨౬ | నందన | ౪ | ౧౬ | ౫౬ | దుందుభి | ౦ | ౧౮ |
| ౨౭ | విజయ | ౫ | ౨౭ | ౫౭ | రుధిరోద్గారి | ౧ | ౨౯ |
| ౨౮ | జయ | ౦ | ౮ | ౫౮ | రక్తాక్షి | ౩ | ౧౦ |
| ౨౯ | మన్మథ | ౧ | ౧౯ | ౫౯ | క్రోధన | ౪ | ౨౧ |
| ౩౦ | దుర్ముఖి | ౨ | ౦ | ౬౦ | క్షయ | ౫ | ౨ |

### ఉదాహరణము.

గ్రంథోదాహరణ దినము; అనఁగా:—నందన సం॥ ఆశ్వయుజ శు ౧౫ గురువారము నాఁటికి అహర్గణము లేక దినగణము సాధింపఁబడుచున్నది. ఈయాశ్వయుజ మాసమునకు చైత్రాదిగా గతించిన నెలలు ౬ దీనిని 30 చే గుణింపఁగా నయిన దినములు ౧౮౦ ఇందులో నీయాశ్వయుజములో శు ౧౫ నాఁటికి గతదినములు ౧౪ కూడఁగా ౧౯౪ అయినది. ఇందులో నీసారిణి ప్రకారమీనందనసంవత్సరమునకు వ్రాయఁబడిన శుద్ధధ్రువము ౧౬ ను తీసివేయఁగా ౧౭౮ అయినది. ఇందులో దీనియొక్క ౬౦వ భాగము ౨ నుతీసివేయఁగా ౧౭౬. ఇదియహర్గణమని చెప్పఁబడును గాని వారము సరిచూడవలెను గనుక ౧౭౬ లో నీనందనకు వ్రాయఁబడిన వారధ్రువమగు ౪ టిని కూడఁగా ౧౮౦ అయినది. దీనిని ౭ చే భాగింపఁగా శేషము ౫. ఆదివారాది ౫ వది గురువారము. నేఁటివారము సరిగానే వచ్చినది. కాన పైనివ్రాసిన యహర్గణము ౧౭౬ స్పష్టమయినదే గనుక దానిలో రహితసహితములు చేయనక్కఱలేదు. అహర్గణము ౧౭౬ గనుక ౧౭౬ వ దినగణపదకమునే గ్రహించునది.

## ౧౦. అథరాత్రి కాలసాధన మాహ.

రాత్రి శిరోగతనక్షత్రమువలన ప్రొద్దుగట్టుసాధనము.

దాని యుపయోగమునకొఱకు నక్షత్రస్వరూపములు చెప్పఁబడుచున్నవి.

| నక్షత్రముల సంఖ్య | నక్షత్రముల నామములు. | ఏనక్షత్రమునకెన్ని చుక్కలుండును | నక్షత్రముల పోలికలు. | ఏనక్షత్రమునందు ఏచుక్క యోగతార. | నక్షత్రస్వరూపములను దెలిపెడు వాక్యములు. |
|---|---|---|---|---|---|
| ౧ | అశ్విని | ౩ | గుఱ్ఱము | ఉత్తరపుచుక్క | తురగముఖాశ్వినీత్రిణి |
| ౨ | భరణి | ౩ | త్రికోణ | దక్షిణపుచుక్క | భరణీయోనిస్త్రిణి |
| ౩ | కృత్తిక | ౬ | మంగలికత్తి | దక్షిణపుచుక్క | క్షురవత్కృత్తికాషట్కం |
| ౪ | రోహిణి | ౫ | రథము | * | రోహిణీశకటంపంచ |
| ౫ | మృగశిర | ౩ | లేడితల | ఉత్తరపుచుక్క | మృగశిరామృగశిరోరూపంత్రిణి |
| ౬ | ఆర్ద్ర | ౧ | పవడము | * | ఆర్ద్రాప్రవాళమేకం |
| ౭ | పునర్వసు | ౫ | నావ | * | పునర్వసూనావఃపంచ |
| ౮ | పుష్యమి | ౩ | పొట్లపువ్వు | మధ్యచుక్క | పుష్యమీశరత్రిణి |
| ౯ | ఆశ్లేష | ౬ | పాము | * | ఆశ్లేషాసర్పాబుతుః |
| ౧౦ | మఘ | ౫ | పెండ్లిపాలకీ | * | మఘాందోళికాపంచ |
| ౧౧ | పుబ్బ | ౪ | మంచపుకోళ్లవలెనుండును | ఉత్తరపుచుక్కలు | పూర్వోత్తరే ద్వేద్వేఖట్వాకారం |
| ౧౨ | ఉత్తర | | | | |
| ౧౩ | హస్త | ౫ | అఱచెయ్యి | పడమరచుక్క | హస్తాపాణిఃపంచ |
| ౧౪ | చిత్త | ౧ | ముత్యము | * | చిత్తామాక్తికమేకం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౫ | స్వాతి | ౧ | మాణిక్యము | * | స్వాతీ మాణిక్య మేకం. |
| ౧౬ | విశాఖ | ౫ | కుమ్మరసారె | ఉత్తరపుచుక్క | విశాఖాకులాలచక్రం పంచ |
| ౧౭ | అనూరాధ } | ౬ | కామతోగూడిన } | వీనిలో నడిమిచుక్కలు | { అనూరాధా జ్యేష్ఠాంగుళి ఛత్రాకారం |
| ౧౮ | జ్యేష్ఠ } | | గొడుగు } | | { షట్కం |
| ౧౯ | మూల | ౬ | అంకుశము | * | మూలాంకుశ షట్కం |
| ౨౦ | పూర్వాషాఢ } | ౪ | విరిగిన మంచపుకో } | ఉత్తరపుచుక్కలు | { పూర్వోత్తరాషాఢే ద్వేద్వే వికలఖట్వా |
| ౨౧ | ఉత్తరాషాఢ } | | ళ్ళవలె నుండును } | | { కారం |
| ౨౨ | శ్రవణం | ౩ | పిల్లనగ్రోవి | మధ్యచుక్క | శ్రోణా వేణునాదం త్రీణి |
| ౨౩ | ధనిష్ఠా | ౪ | మద్దెల | పడమరచుక్క | ధనిష్ఠామృదంగం చతుష్కం |
| ౨౪ | శతభిషం | ౧౦౦ | పట్టణము | * | శతతారాపురాకారం శతం |
| ౨౫ | పూర్వాభాద్ర } | ౪ | విరివియైన మంచపు } | ఉత్తరపుచుక్కలు | { పూర్వోత్తరాభాద్రే ద్వేద్వే బృహత్ఖ |
| ౨౬ | ఉత్తరాభాద్ర } | | కోళ్ళవలె నుండును } | | { ట్వాకారం |
| ౨౭ | రేవతి | ౩౨ | చేప | దక్షిణపుచుక్క | రేవతీద్వాత్రింశన్మత్స్యాకారం |

* ఈగుర్తుగల నక్షత్రములలో స్పష్టముగ గనుపడునదే యోగతారయని తెలియునది.
అనూరాధ మొదలు ఉత్తరాషాఢ వఱకు గ నక్షత్రములను యామ్యపంచకమని వ్యవహరింతురు.

## ౧౧. శిరోగతనక్షత్రములవలన మేషాదుల భుక్తులు తెలిసికొను సాధనము.

శిరోనక్షత్రములును, వాని యోగతారలును దెలిసినపిమ్మట ఆశిరోనక్షత్రమువలన తత్కాలలగ్నము ఇదియనియు, ఆలగ్నములో నింత భుక్తియైనదనియు, పిమ్మట సూర్యాస్తమయాది ఇంతరాత్రియైనదనియుఁ దెలియును. ఈస్ఫుటవాక్యములను బట్టి కాలము చక్కఁగా వచ్చుచున్నది.

| ఇవి శిరోనక్షత్రములగు పేరుల. | ఈలగ్నము లగును. | ఆయాలగ్నములందింత భుక్తి యగు ఘ- విఘ | శిరోనక్షత్రములవలన లగ్నమును, లగ్నభుక్తియు దెలియుటకు ఈకాలమునకు ఈవాక్యములు క్రొత్తగా స్ఫుటము చేయబడిరి. |
|---|---|---|---|
| శ్రవణము | మేషము లో | ౧-౪౮ | శ్రోణా మేషే కోదవాః |
| ధనిష్ఠ | మేషము | ౩-౨౯ | శ్రవిష్ఠా మేషే గోధీరాః |
| శతభిషం | వృషభము | ౪-౨౫ | శతభిషగ్వృష భేవోమరాః |
| పూర్వాభాద్ర | మిథునము | ౦-౪౩ | పూర్వాభాద్రామిథునే వోలఘుః |
| ఉత్తరాభాద్ర | మిథునము | ౨-౨౮ | ఉత్తరాభాద్రామిథునే రంజరాః |
| రేవతి | కర్కాటకము | ౦-౩౮ | రేవతీ కర్కినజీకః |
| అశ్వని | కర్కాటకము | ౧-౫౨ | అశ్వనీ కర్కి కంరామ |
| భరణి | కర్కాటకము | ౪- ౩ | భరణీ కర్కి భోగః |
| కృత్తిక | సింహము | ౧-౨౦ | కృత్తికాసింహే హోనభాః |
| రోహిణి | సింహము | ౩-౨౩ | రోహిణీ సింహే లోగురుః |
| మృగశిర | సింహము | ౫-౧౪ | మృగశీర్షా సింహేమోభటా |
| ఆర్ద్ర | కన్య | ౧- ౨ | ఆర్ద్రాకన్యాకరా |
| పునర్వసు | తుల | ౦-౪౯ | పునర్వసూ తులానోధవః |
| పుష్యమి | తుల | ౨-౪౮ | పుష్యస్తులా రదేవాః |
| ఆశ్లేష | తుల | ౨-౫౮ | ఆశ్లేషాతులా రోదేశాః |
| మఘ | వృశ్చికము | ౧-౧౨ | మఘావృశ్చికే కరయా |
| పుబ్బ | వృశ్చికము | ౪-౧౨ | పూర్వావృశ్చికే ఘోరయః |
| ఉత్తర | వృశ్చికము | ౫-౧౨ | ఉత్తరావృశ్చికే శారయః |

ఈవాక్యములుయీకాలమునకు మనదేశమునకు క్రొత్తగా పెద్దలు స్ఫుటముచేసినారు గనుక బహు ప్రశస్తము. శ్రోణా మేషేరతా॥ అని చాలాకాలము క్రిందం చేయబడి నానాట అయనాంశలు పెరిగి ఆవాక్యములు శిథిలమాయినందున ప్రస్తుతము చాలా తేడా వచ్చుచున్నవి కొన్నిచోట్ల లగ్నభేదములే గలుగుచున్నవి.

ఈవాక్యముల ప్రకారము కటపయాది అక్షరసంకేతములవల్ల అంకసంఖ్యను తెలిసి గడియ విగడియలను తెలిసికొనవలయును.

కటపయాదిసంజ్ఞలనఁగా-

క -ట-ప-య= ౧
ఖ -ఠ-ఫ-ర = ౨
గ -డ-బ-ల = ౩

| ఇవి శిరోనక్షత్రములగు వెడల. | ఈలగ్నము లగును. | అయాలగ్నము లందింత భుక్తి యగు ఘ- విఘ. | శిరోనక్షత్రములవలన లగ్నమును, లగ్నభుక్తియును దెలియుటకు ఈకాలమునకు ఈవాక్యములు క్రొత్తగా స్ఫుటము చేయబడియె. |
|---|---|---|---|
| హస్త | ధనుస్సు | ౨- ౫ | హస్తాధనూరామ |
| చిత్రి | ధనుస్సు | ౪-౧౫ | చిత్రి ధనుర్భామయాః |
| స్వాతి | మకరము | ౧-౧౨ | స్వాతీ మకరే కోరాయ |
| విశాఖ | మకరము | ౩-౫౦ | విశాఖామకరే గావమః |
| అనూరాధ | కుంభము | ౦-౫౪ | అనూరాధా కుంభే నోవిశ |
| జ్యేష్ఠ | కుంభము | ౨- ౨ | జ్యేష్ఠా కుంభే ఖరా |
| మూల | కుంభము | ౪- ౧ | మూలాకుంభే వోపా |
| పూర్వాషాఢ | మీనము | ౨-౧౯ | పూర్వాషాఢా మీనేరోధకః |
| ఉత్తరాషాఢ | మీనము | ౩-౨౦ | ఉత్తరాషాఢా మీనే గోనఖాః |

ఘ—ఢ-భ—వ = ౪
ఙ —ణ—మ—శ = ౫
చ —త-...ష = ౬
ఛ -థ—...స = ౭
జ —ద-...హ = ౮
ఝ -ధ—...ళ = ౯

ఈపఙ్క్తులలో ప్రతిపఙ్క్తికిని తిన్నగా వ్రాసియున్న యక్షరములన్నిటికిని = ఈగుర్తు వేసి వ్రాసిన అంకెకు సమానమని పెద్దలు చెప్పియున్నారు.

ఉదాహరణము :—"శ్రోణామేషే కోదేవాః" అను మొదటివాక్యప్రకారము శ్రవణము శిరోనక్షత్రమైనప్పుడు, మేషే=మేషలగ్నములో, కోదేవాః అను ౩ అక్షరములలో మొదటి యక్షరముగు, కో=అనేక కారమునకు వెనుకటి యుదాహరణ ప్రకారము కటపయాదిసంకేతములలో కకారమునకు ౧ గనుక ౧ గడియ యనియు తక్కిన రెండక్షరములలో మొదటిదగు దే=దకారమునకు ౮ న్ని రెండవదియగు వాః=వకారమునకు ౪ న్ని గనుక "అంకానాం వామతోగతిః" అనే న్యాయముచేత కుడినుంచి యెడమకువేయగా ౪౮ అగును గనుక ౪౮ విగడియలనియు తెలియవలెను. అనగా శ్రవణము శిరోగతమయినప్పుడు మేషలగ్నములో ౧-౪౮ ఘటికాది భుక్తియగునని తాత్పర్యము.

—శిరోగతనక్షత్రమనఁగా ఎప్పుడు నక్షత్రము శిరోగతమగునో చెప్పబడుచున్నది.—

శిరోనక్షత్రమనఁగా; ఆకాశమధ్యమందున్న నక్షత్రము. ఆకాశమధ్యమనఁగా; తాను ఉత్తరముఖముగా ధ్రువునకెదురుగా నిలిచి ధ్రువసూత్రముగుండా ఆకాశమధ్యభాగమును చూడగా తనభ్రూమధ్యమునకు సరిగా నేనక్షత్రము గనుపించునో యదియే శిరోనక్షత్రమని తెలియవలయును. అట్టి శిరోనక్షత్రమువల్ల పైనఁజెప్పిన వాక్యములనుబట్టి పొద్దును, లగ్నమును, లగ్నభుక్తియు నేర్పరుపవలెను అయితే; అశ్వని మొదలగు కొన్ని నక్షత్రములు లోకచాలుగా మిక్కిలి పొడవుగలిగి యుండునుగదా? అట్టినక్షత్రములు శిరోగతమైనప్పుడు దానిముఖము, మధ్యము, పుచ్ఛము యీ ౩ టిలో నేభాగము ధ్రువునకభిముఖమైనప్పుడు శిరోగతమని యేర్పరుపవలసినది. అని శంకగలుగగా తచ్ఛంకాపనోదము కొరకు సూర్యసిద్ధాంతమందు యోగతారలను జెప్పియున్నారు. యోగతారలనగా; ఫలానా నక్షత్రమునకు ఫలానా దిశయందుండు ఫలానాచుక్క యోగతారయనియు, దానింబట్టి నక్షత్రసంబంధమైన కార్యములన్నియు సాధించుకొనవలయుననియు, తాత్పర్యము.

ఏనక్షత్రమున కేచుక్క యోగతారయైనదియు, వెనుక వ్రాసిన నక్షత్రస్వరూపాది పరిష్కారములో ౫ వ కోష్టకములో నుదాహరింపఁబడియున్నది. కనుక దానివలన యోగతారలను తెలిసికొనవలెను.

మఱియు, శిరోనక్షత్రములు చూచునప్పుడు కొన్ని నక్షత్రములు ధ్రువసూత్రమునకు సరిగాఁజేరునప్పుడును, కొన్ని యింకా రాకుండగనున్ను, కొన్ని నక్షత్రములు ధ్రువసూత్రమును అతిక్రమించినతర్వాతనున్ను శిరోగతములగా భావింపవలసియున్నది. అదియెట్లనిన:

శ్లో. జ్యేష్ఠాదీనా మతిక్రమ్య రేవత్యాది రనాగతం
ఉత్తరాది సమంకుర్యా న్నవద్వాదశ షట్క్రమాత్.

తా॥ జ్యేష్ఠ మొదలు ఉత్తరాభాద్ర అఖరువఱకు ౯ నక్షత్రములు శిరోభాగమును అతిక్రమించిన తర్వాతనున్ను, రేవతి మొదలు పుష్య అఖరువఱకు ౧౨ నక్షత్రములు రాకుండగానున్ను, ఉత్తర మొదలు అనూరాధ అఖరువఱకు ౬ నక్షత్రములు సరిగా జేరునప్పుడున్ను శిరోనక్షత్రములుగా భావించి కాలము, లగ్నము, లగ్నభుక్తి మొదలైనవి సాధింపవలెను. ఈప్రకారము శిరోనక్షత్రమువల్ల ఫలానా లగ్నమనియు, దానిలో నింతభుక్తియనియు తెలియబడును.

౧౩. ఇంక మేషాది సంక్రమణములు ౧౨ టియందును ఫలానాలగ్నము అఖరయ్యేవరకు నింతకాలము మొత్తమగుననియు, దానిని బట్టి ఇంతరాత్రి ప్రొద్దు అయినదని తెలియుటకై బాల బోధకొరకు ఒకసారిణి వ్రాయఁబడుచున్నది.

మేషాది సంక్రమణములయందు మేషాదిప్రతిలగ్నము అఖరుకున్ను అయ్యే ఘటికాది మొత్తమును ఈసారిణివల్ల తెలియఁబడుచున్నది.

ఈసారిణివల్ల సూర్యోదయాది తన యిష్టలగ్నముయొక్క ఆఖరుకున్ను ఉదయమునుంచి వేరీజు చేయునక్కరలేకుండా యేవిధమునయిన శ్రమయును లేకండా ఉదయాది యింతకాలమయినదనియు యీసారిణి చూచినమాత్రాన తెలియఁబడును. ఇది బహూపయోగము.

| సంక్రమణాని. | మేషలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | వృషభలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | మిధునలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | కర్కటలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | సింహలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | కన్యాలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | తులాలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | వృశ్చికలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | ధనుర్లగ్నాంతము నక్షత్ర ఘటికాది. | మకరలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | కుంభలగ్నాంతము నక్షత్ర ఘటికాది. | మీనలగ్నాంతము నక్షత్ర ఘటికాది. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
| మేషే ... | ౪-౨౦ | ౯-౧౬ | ౧౪-౪౨ | ౨౦-౧౩ | ౨౫-౩౩ | ౩౦-౪౮ | ౩౬-౧౨ | ౪౧-౪౫ | ౪౭-౪ | ౫౧-౪౭ | ౫౫-౫౮ | ౬౦-౦ |
| వృషభే ... | ౬౦-౦ | ౪-౫౬ | ౧౦-౨౨ | ౧౫-౫౩ | ౨౧-౧౩ | ౨౬-౨౮ | ౩౧-౫౨ | ౩౭-౨౫ | ౪౨-౪౪ | ౪౭-౨౭ | ౫౧-౩౮ | ౫౫-౪౦ |
| మిధునే ... | ౫౫-౪ | ౬౦-౦ | ౫-౨౬ | ౧౦-౫౭ | ౧౬-౧౭ | ౨౧-౩౨ | ౨౬-౫౬ | ౩౨-౨౯ | ౩౭-౪౮ | ౪౨-౩౧ | ౪౬-౪౨ | ౫౦-౪౪ |
| కర్కటకే ... | ౪౯-౩౮ | ౫౪-౩౪ | ౬౦-౦ | ౫-౩౧ | ౧౦-౫౧ | ౧౬-౬ | ౨౧-౩౦ | ౨౭-౩ | ౩౨-౨౨ | ౩౭-౫ | ౪౧-౧౬ | ౪౫-౧౮ |
| సింహే ... | ౪౪-౭ | ౪౯-౩ | ౫౪-౨౯ | ౬౦-౦ | ౫-౨౦ | ౧౦-౩౫ | ౧౫-౫౯ | ౨౧-౩౨ | ౨౬-౫౧ | ౩౧-౩౪ | ౩౫-౪౫ | ౩౯-౪౭ |
| కన్యాయాం ... | ౩౮-౪౭ | ౪౩-౪౩ | ౪౯-౯ | ౫౪-౪౦ | ౬౦-౦ | ౫-౧౫ | ౧౦-౩౯ | ౧౬-౧౨ | ౨౧-౩౧ | ౨౬-౧౪ | ౩౦-౨౫ | ౩౪-౨౭ |
| తులాయాం ... | ౩౩-౩౨ | ౩౮-౨౮ | ౪౩-౫౪ | ౪౯-౨౫ | ౫౪-౪౫ | ౬౦-౦ | ౫-౨౪ | ౧౦-౫౭ | ౧౬-౧౬ | ౨౦-౫౯ | ౨౫-౧౦ | ౨౯-౧౨ |
| వృశ్చికే .. | ౨౮-౮ | ౩౩-౪ | ౩౮-౩౦ | ౪౪-౧ | ౪౯-౨౧ | ౫౪-౩౬ | ౬౦-౦ | ౫-౩౩ | ౧౦-౫౨ | ౧౫-౩౫ | ౧౯-౪౬ | ౨౩-౪౮ |
| ధనుషి ... | ౨౨-౩౫ | ౨౭-౩౧ | ౩౨-౫౭ | ౩౮-౨౮ | ౪౩-౪౮ | ౪౯-౩ | ౫౪-౨౭ | ౬౦-౦ | ౫-౧౯ | ౧౦-౨ | ౧౪-౧౩ | ౧౮-౧౫ |
| మకరే ... | ౧౭-౧౬ | ౨౨-౧౨ | ౨౭-౩౮ | ౩౩-౯ | ౩౮-౨౯ | ౪౩-౪౪ | ౪౯-౮ | ౫౪-౪౧ | ౬౦-౦ | ౪-౪౩ | ౮-౫౪ | ౧౨-౫౬ |
| కుంభే ... | ౧౨-౩౩ | ౧౭-౨౯ | ౨౨-౫౫ | ౨౮-౨౬ | ౩౩-౪౬ | ౩౯-౧ | ౪౪-౨౫ | ౪౯-౫౮ | ౫౫-౧౭ | ౬౦-౦ | ౪-౧౧ | ౮-౧౩ |
| మీనే ... | ౮-౨౨ | ౧౩-౧౮ | ౧౮-౪౪ | ౨౪-౧౫ | ౨౯-౩౫ | ౩౪-౫౦ | ౪౦-౧౪ | ౪౫-౪౭ | ౫౧-౬ | ౫౫-౪౯ | ౬౦-౦ | ౪-౨ |

శిరోనక్షత్రమువల్ల సూర్యాస్తమయాది రాత్రిగతము తెలియు సాధనము.

శిరోనక్షత్రమువల్ల అప్పుడు ఫలానాలగ్నమని తెలిసి యాలగ్నమునకు వెనుకటి లగ్నాంతమునకు సారిణిలో యెంతఘటికాది వ్రాయబడియున్నదో ఆమొత్తములో శిరోనక్షత్రమువల్ల తెలియబడిన లగ్నభుక్తినికూడి యందులో అదినమున పంచాంగము లో తిథి చివరవ్రాసియున్న భుక్తియను దానిని తీసివైచి ఆమిగిలినది యాదినమున సూర్యోదయాది తన యిష్టశిరోనక్షత్ర సమయమునకైన కాలము ఘటికాదియగును. అదియొకవేళ నాదినము దినమానముకంటె నధికమయ్యేనేని దానిలో నాదినమానమును తీసివేయుగా శేషము సూర్యాస్తమయాది యింతరాత్రియైనదని తెలియవలయును. దీని యుదాహరణము యీక్రింద చూపబడియున్నది.

౧౮. అథప్రకారాంతరేణ శిరోనక్షత్రా ద్రాత్రిగతమాహ.

శ్లో॥ ఇనభాది శిరోభాంతం శిరోభాదినభాంతకం
సప్తోనితం నఖఘ్నంచ నవాప్తం నాడికాదికం.

తా॥ తాను ప్రొద్దుగట్టుకొను నాటినాత్రి రెండు యామములకు లోగానయ్యేనేని అప్పటికి సూర్యుడేనక్షత్రమునందుండునో యానక్షత్రము మొదలు తన యిష్ట శిరోనక్షత్రము వఱకును లెక్కింపవలెను. రెండు యామములకు పైనుంచి శిరోనక్షత్రము మొదలు సూర్యుడుండు నక్షత్రమువఱకును లెక్కింపవలెను. ఇట్లు లెక్కింపగానైన సంఖ్యలో ౭ ను తీసివేసి యాశేషమును ౨౦ చే గుణించి ౯ చే భాగింపగా వచ్చిన లబ్ధము ఘడియలు, ఆశేషము ౬౦ చే గుణించి తిరుగా ౯ చే భాగింపగా విఘడియలు వచ్చును. ఈఘటికాది రెండుజాములకు లోపుగా నయ్యేనేని అంతరాత్రి యైనదనియు, పరముగానైన నంతయున్నదనియును తెలియవలయును.

ఉదాహరణము :—నందన సం॥ ఆశ్వయుజ శు ౧౫ గురువారమునాటి రాత్రి శ్రవణము శిరోనక్షత్రముగా నున్నది. ధ్రువునకెదురుగా నిలిచి మీదికిజూడగా యాశ్రవణము ధ్రువసూత్రమును కొంచెమతిక్రమించి యున్నది. అయితే; "జ్యేష్ఠాదీనామతిక్రమ్య" అనే శ్లోకప్రకారము ఇది జ్యేష్ఠాదినవకములోనిది గనుక ఖమధ్యమును కొంచెమతిక్రమింపవలెను గనుక నీశ్రవణమిప్పుడాలాగునే కొంచెమతిక్రమించి యున్నది. కాబట్టి శ్రవణమే శిరోగతమై యున్నదని నిశ్చయింపబడెను. ౯౦ ౧౧ రుగల ఫారములోఁ జెప్పఁబడిన ప్రకారము శ్రవణము శిరోనక్షత్రము గనుక మేషలగ్నములో ౧-౪౮ ఘటికాదిభుక్తియని తేలినది. కనుక యీరోజున కన్యాసంక్రమణ

ములో ౨౨ తేదీ గనుక సెం ౧౩ ఘగల లగ్నసారిణిలో కన్యాసంక్రమణ కోష్టకము లో సదరు వర్తమాన మేషలగ్నమునకు వెనుకటి లగ్నమగు మీనలగ్నాంతమునకు వ్రాసియున్న ఘటికాది ౩౪-౨౭ ఇందులో మేషలగ్న భుక్తిఘటికాది ౧-౪౮ ని గూడగా ౩౬-౧౫ ఇందులో నీదినమున పంచాంగము తిథి చిగురున వ్రాసియున్న భుక్తియనునది ౩-౩౭ దీనిని తీసివేయఁగా శేషము ౩౨-౩౮ ఇది యీదినము సూర్యోదయాది శ్రవణము శిరోగతమగుటకు యైన ఘటికాది. ఈదినమున దినమాన ము ౨౯-౩౬ ఆఘటికాది దినమానముకంటె నధికమైనది. కనుక దానిలో నీదినమాన మును తీసివేయగా ౩-౨ ఉన్నది. ఇదియే సూర్యాస్తమయాదియైన రాత్రియని తెలియ బడినది.

## ౧౫. అథప్రకారాంతరేణ ఖమధ్యనక్షత్రాల్లగ్నసాధనమాహ.

శ్లో. అశ్వన్యాది వియన్మధ్య నక్షత్రం షట్సమన్వితం
వేదఘ్నం నేత్ర సంయుక్తం నవభిర్భాగమాహరేత్
తల్లబ్ధం రాశయః ప్రోక్తాస్తచ్ఛేషో నవమాంశకాః.

టీక. అశ్వన్యాది వియన్మధ్యనక్షత్రం- అశ్వన్యాది=అశ్వని మొదలు, వియన్మ ధ్య=ఆకాశమధ్యమందుండు, నక్షత్రం=నక్షత్రసంఖ్య, షట్=౬ తోడ, సమన్వితం కూ ర్చబడినదై; వేదఘ్నం- వేద- ౪ చేతను; ఘ్నం- గుణింపబడినదై; నేత్రసంయు క్తం- నేత్ర- ౨ తోడ; సంయుక్తం- కూర్చబడినదై; నవభిః- ౯ చేతను; భాగమాహ రేత్=భాగింపవలసినది.

తా॥ తాను నిర్ణయించుకొన్న శిరోనక్షత్రము, అశ్వన్యాదిగాలెక్కించగా సెం తసంఖ్యగలది యగునో ఆసంఖ్యనుంచుకొని యందులో ౬ కూడి ౪ చే గుణించి ౨ ను కూడి ౯ చే భాగింపగా వచ్చినలబ్ధము మేషాదిగత లగ్నసంఖ్యయగును. ఆశేషము ఎం తయుండునో అన్ని గతనవాంశలగును. కనుక ఆనవాంశ సంఖ్యచేత నవాంశప్రమాణ ము ౩ భాగల ౨౦ లిప్తలను గుణించిన, నది భాగాదియగును. ఈభాగాదియొక్క సె త్తిమీద వెనుకటి లబ్ధమగు మేషాదిగత లగ్నసంఖ్యను చేర్చినట్టియిన వదిరాశ్యాది ల గ్నమని వ్రాసికోదగినది.

ఉదాహరణము :—వెనుకటి యుదాహరణములో శ్రవణము శిరోనక్షత్రమని వ్రాయబడియుండెనుగదా. ఆశ్రవణము అశ్వని మొదలుకొని యెంచగా ౨౨ వ నక్ష

త్రియయినది. దానిలో ౬ కూడగా ౨౮ ఇది ౪ చే గుణింపగా ౧౧౨ అయినది. ఇందులో ౨ కూడగా ౧౧౪ అయినది. దీనిని ౯ చే భాగింపగా లబ్ధము ౧౨ కనుక మేషాది ౧౨ లగ్నములు గతించినవి. అనగా మీనము వెళ్ళిపోయి వర్తమానము మేషలగ్నమాయెను. వెనుక ౯ చే భాగింపగా మిగిలిన శేషము ౬ కనుక యీ ౬ న్ను గత నవాంశలు కాబట్టి, యీ ౬ చే నవాంశపరిమాణము ౩-౨౦ ని గుణింపగా ౨౦ భాగలు వచ్చినవి అనగా వర్తమానమేషలగ్నముయొక్క ౩౦ భాగలలో ౨౦ భాగలు భుక్తమైనవని తెలియునది.

| | |
|---|---|
| రాశ్యాదిలగ్నము ౦-౨౦-౦-౦ | రాశి ౧ కి భాగలు =౩౦ |
| భాగ ౧ కి లిప్తలు=౬౦ | లిప్త ౧ కి విలిప్తలు=౬౦ |

## ౧౬. అథ లగ్నప్రమాణఘటికాది లిఖ్యతే.

లగ్నపరిమాణములు రెండువిధములు: అవిసాయనములనియు, నిరయనములనియును అందు నిరయనలగ్నములు అనగా; స్వదేశ చరఖండములచేత రహిత సహితములగు లంకోదయములు. ఇవియే స్వోదయములని నామాంతరముగలవి. ఇవిసిద్ధాంతశాస్త్రరీత్యా తత్కాల స్ఫుటరవి, అయనాంశలవల్ల లగ్నసాధన కాలసాధనాదులందుపయోగము. వీనినే కొందరు కొంచెము హెచ్చుతగ్గుగాజేసి "మీన మేష చతుర్నాడ్యః" అని వ్యవహరించుచున్నారు. కాని ఘటికాది లగ్నభుక్తులు దినమానాదుల సామ్యము మొదలగువానికి సరిపడవు కనుక సాయనలగ్నములు అని నామాంతరముగల స్ఫుట లగ్నములే సాధారణ వాడుకలకు బహూపయోగము. కాబట్టి యిచ్చట స్ఫుటలగ్న పరిమాణములనే వ్రాయుటమైనది. ఈస్ఫుటలగ్నపరిమాణములు అయనాంశలు పెరిగినకొలదిని నానాటికి వ్యత్యయముగలవి యగును. కనుక కొంతకాలమునకు బుద్ధిమంతులు మరల సవరణచేయుచుండవలెను. వాటినిసవరించి సాధించుకొను విధానము, ఈదైవజ్ఞకర్ణామృతము యొక్క యుత్తరభాగమగు రెండవసంపుటములో సిద్ధాంతపరికరణములో స్పష్టముగ వ్రాయబడియున్నది. కనుక యిటువంటి పరికరణములనగా కాలక్రమమున కొంతకాలమునకు తేడావచ్చి మరలయెవరిదేశములకువారు యేకాలమున కాకాలమందు మరల మరల స్ఫుటము చేసికొనవలసినవాటి నిర్ణయమంతయును రెండవభాగమందు విస్తరించి వ్రాయబడినది గనుక ఆయాస్థలములయందు ఆపరికారము చేయవలెను. ఈ క్షేత్రమునకు కాలమునకు స్ఫుటమైనవేయిందు వ్రాయబడినవిగనుక సందియము లేదు.

—స్ఫుటలగ్న ప్రమాణవిఘటికలు —

శ్లో. సీతారి 270 తాధార 265 మురంగ 326 కాంగా 337 నరాంగ 320 శంకాల 317 వరాంగ 324 గండగాః 333 ధీకాల 316 గుంజార 263 యమాఖు 217 శైవరా 242 క్రియాణి మీనాంత వినాడికాస్ఫుటాః ॥

ఈ శ్లోకములో మేషము మొదలు మీనము ఆఖరు వరకు 12 లగ్నములకును 12 సంఖ్యలు వరుసగా వ్రాయబడియున్నవి. అవివానియొక్క ప్రమాణము వినాడికలు గనుక విగడియలను 60 చే భాగింపగా ఘడియలు, విఘడియలు నేర్పడును. కాబట్టి దీనికి వేరే టీక వ్రాయవలసినపనిలేదు.

12. అథస్థూల మార్గేణ ప్రకారాంతరేణ దివారాత్రౌ కాలసాధనమాహ॥

శ్లో. "అంగులీ మేరుమానాయ సప్తాంగుళి ధరాయచ । అంగులీ ఘటికా ద్వేద్వే కాలమానం వినిర్దిశేత్."

తా. ఎండలో నుత్తరదిఙ్ముఖుడై నిలుచుండి దొప్పగా గాకుండ దోసిలి బాగా విప్పలించి చాచి రెండు అంగుష్ఠములను ముడిచి తక్కిన యంగుళులు 8 టిలో 2 టివిడా చి కుడిచేతి తర్జన్యంగుళిని మాత్రము దానిమధ్య పర్వము మధ్యమాంగుళీ మధ్యపర్వము నుతగులునట్లుచాపియుంచి తతిమ్మ పైభాగమును, అనగాకుడిచేతి తర్జనీమధ్య పర్వము యొక్క పైపగమును వంకరలేకుండ చీలవలె మీదికెత్తియుంచి చూడగా ఆయెత్తియుంచిన తర్జనీఖండము యొక్కనీడ కుడిచేతి మధ్యమాంగుళి మొదలు యెన్ని వేళ్ళ మీద ప్రసరించి యుండునో అన్ని రెండుంబరకలు అనగా వ్రేలు 1 కి 2ఘడియ చొ॥ అయిన ఘడియను 15 ఘడియలలో తీసివేయగా నెన్ని మిగులునో అప్పుడన్ని ఘడియల ప్రొద్దెక్కినని తెలియవలెను. మరియు; ఈప్రకారము సూర్యోదయము మొదలు సూర్యుడు నెత్తిమీదకు వచ్చేపర్యంతము చూడవలయును. మధ్యాహ్నము మొదలు సాయంత్రమువఱకును దక్షిణదిక్కుగా నిలుచుండి వెనుకటిరీతిగానే ఘడియలను నిర్ణయించి అన్నిఘడియల ప్రొద్దున్నదని చెప్పవలెను. ఇదియొక విధము.

ఈలాగుననే చంద్రునియొక్క వెన్నెలయందును ఘడియలను నిశ్చయించి ఆఘడియలు చంద్రోదయాదిగా భావించి చెప్పవలెను.

ఉదాహరణము :—బహుళ ౨ రోజున రాత్రి వెన్నెలలో నిలిచి చూడగా పైనకటేరీతిగా ౮ ఘడియలు వచ్చును. ఈరోజున రాత్రి ౮ ఘడియలకు చంద్రోదయము కనుక వాటిలో ౮ కూడగా ౧౬ ఘడియలైనది. కనుక సూర్యాస్తాది ౧౬ ఘడియలు రాత్రియైనదని చెప్పవలెను.

౧౮. ఇంకొక విధము- స్థూలము. అర్ధవృత్త యంత్రము.

శ్లో. వృత్తార్ధే ఫలకే లేఖ్యా స్సమ రేఖా ద్విషట్తతః
క్షితిజాత్ప్రభృత్యేవం విలిఖేద్ద్వాద శాంతకం
ఘనరేకాది షట్కాంతం ఘంటాషష్ట్యంశకాఃక్రమాత్.

తా॥ ఒక సమమైన కఱ్ఱపలకమీద నొక గుండ్రని వృత్తముగీచి అందు సరిగా సగముభాగము తెగకొట్టి తీసివేసి తక్కిన సగమునే గ్రహించి అసగమువృత్తమును సమముగ ౧౨ భాగములుగాఁ జేసి యా ౧౨ భాగములకును ౧౨ నిలువుగీతలు గీచి యందు ఒకతట్టుపై యంచుమీదనుండు రేఖమీద ౬ అంకెయును, దానికింది రేఖమీద ౭ అంకెయు యీలాగు ౧౨ వఱకును వేయగా ౧౨ అనే అంకె అబల్లనడుమ (ఓ) అనే గుఱుతుమీద నుండును. ఈగుఱుతు భూమిమీదనుండును. (అ) (ఇ) అనేగుఱుతులుగల యంచులు తూర్పుపడమర దిశలకుండును. ౧౨ అంకె ౧౨ గంటలున్ను, ౧ అంకె ఒంటిగంట యీలాగు తెలియవలెను. (ఉ) అనేగుఱుతుగల మధ్యగంధ్రములో వెదురుకణిక గ్రుచ్చి యీకణికె నీడ యేయంకెమీదికి వస్తే అన్నిగంటలు అయినవని చెప్పవలెను. ప్రతిగీతకును నడుమ ౮ గెసి గీతలుగీచియున్నవి. అవి పావుగంటలని తెలియవలెను. ఇది కొంచెము స్థూలమయినను చాలా ఉపయోగముగ నుండును. పైన ౧౭ వ నెంబరు ప్రకరణములో జెప్పబడినరీతినే వెన్నెలలోగూడ నుపయోగించును. ఈబల్లకు ఒక తట్టున యెండకాచును గనుక యేతట్టున యెండకాచునో అతట్టుకు యీగీతలు అంకెలు కణికనీడయును వచ్చునట్లు బల్లను వుంచవలెను.

ఇదియే అర్ధవృత్తయంత్రమని చెప్పబడినది.

శ్రీరస్తు.

శ్రీగజాననాయనమః.

శ్రీమదాంధ్రతాత్పర్యోదాహరణసహితే

# దైవజ్ఞకర్ణామృతే

---

## పూర్వభాగే మిశ్రఫలబిందౌ, గ్రహపరిచ్ఛేదే

## గ్రహసాధనప్రకరణం.

నెం ౨౦ :—ఇవ్విధంబున బహు ప్రకారంబులచే కాలసాధనవిషయముం జెప్పి జాతక, తాజక, ముహూర్త, ప్రశ్నాదులయందు తత్కాలరాశ్యాది గ్రహంబు లత్యంతోపయుక్తంబు లగుటంజేసి స్ఫుటగ్రహసాధనం బావశ్యకంబై యుండె. స్ఫుటగ్రహములను సిద్ధాంతశాస్త్ర ప్రకారము సాధించునెడ విశేషగణిత సాధ్యంబగుటచే బాలురకు విశేషక్లేశంబు గలుగునని తలంచి పంచాంగరీత్యా లఘూపాయముచేత స్థూల గ్రహసాధనముం జెప్పుచున్నాడు. రాశ్యాది గ్రహములనఁగా; రాశి, భాగ, లిప్త, అని యర్థము.

| | |
|---|---|
| రాశి ౧ కి=భాగలు ౩౦ | ౬౦ విలిప్తలు=౧ లిప్త |
| భాగ ౧ కి=లిప్తలు ౬౦ | ౬౦ లిప్తలు =౧ భాగ |
| లిప్త ౧ కి=విలిప్తలు ౬౦ | ౩౦ భాగలు =౧ రాశి |
| | ౧౨ రాసులు =౧ భగణము |

రాశిస్థానమందు ౧౨ కాఁగానే భగణము లోనికి ౧ ఎక్కును, గనుక రాశిస్థానమునందు ౧౨ కాఁగానే అక్కడ |౦| సున్ననుంచవలెను గాని ౧౨ ఉంచగూడదు. ఈలాగుననే గ్రహములు, భావములు, తత్సంధులు మొదలగువానియందు గ్రహింపవలెను.

### నెం ౨౧. అథ పంచాంగరీత్యాస్థూలమార్గేణ రాశ్యాదిగ్రహసాధనమాహ.

శ్లో. దస్రాద్యాత్భసంఘు పాదనిచయాః ఖైశ్శైర్హృతాద్రాశయః।
స్తచ్ఛేషాత్త్రిగుణా ౩౦ హతాత్ఖగ ౯ హృతాద్భాగాః ఖతర్కా ౬౦
హతాత్

శేషాన్నంద ౯ హృతా త్కలాస్స్య రథత న్నక్షత్ర యాతాత్ఖభే
భ ౮౦౦ ఘ్నాద్భుక్తముఖావసాన ఘటికా భక్తాఃకలాస్తద్యుతిః
రాశ్యాద్యానవఖేచరా రవిముఖాః పంచాంగ శుద్ధాఅమీ
జన్మ ప్రశ్నముహూర్త కాలజఖగైస్సర్వంఫలంసాధయేత్.

తా. ఏదినమున ఏవేళకు దాను, ఏగ్రహమును సాధింపదలచెనో ఆకాలమునకు ఆగ్రహము అశ్వని మొదలుగా ఎన్ని నక్షత్రములు గతమయ్యెనో అంతిసంఖ్య నుంచుకొని ఆసంఖ్యను ౪ చే గుణించి ౯ చే భాగింపగా వచ్చిన లబ్ధము రాసులు అగును. ఆ శేషమును ౩౦ చే గుణించి ౯ చే భాగింపగా వచ్చినలబ్ధము భాగలగును. ఆశేషమును ౬౦ చే గుణించి ౯ చే భాగింపగా వచ్చినలబ్ధము లిప్తలు అగును. ఈవచ్చిన రాశి, భాగ, లిప్తలను ఒకచోట వరుసగా వ్రాసికొనునది. దీనికి భాద్యమని పేరు.

పిమ్మట నాగ్రహమప్పుడు యేనక్షత్రమందుండునో ఆనక్షత్రమందు ఆగ్రహ మెప్పుడు ప్రవేశించెనో అది మొదలుకొని తిరుగా దాని పైనక్షత్రమందెపుడు ప్రవేశించునో ఆరెండింటిమధ్యను యెన్నిదినముల యెన్నిగడియల యెన్నివిగడియల మొత్త మగునో ఆమొత్తము ఆగ్రహమునకు భుక్త్యాద్యంత మాన మనబడును. దీనికి ప్రమాణ మని సంజ్ఞ వ్రాసికొనునది. ఆపిమ్మట ఆగ్రహ మానక్షత్రమందు ప్రవేశించినది మొదలు తన యిష్టకాలమునకు భుక్తమైన దినములు, శేష గడియలు యెన్నియగునో దానికి యిచ్ఛయని పేరు సంజ్ఞగా వ్రాసికొనునది. తర్వాత ఈయిచ్ఛయను దానిని ౮౦౦ చేత గుణించి ఆగ్రహమునకు వెనుక సాధించి వ్రాసియున్న భుక్త్యాద్యంత మానమను పేరుగల ప్రమాణముచేత భాగింపగావచ్చిన లబ్ధము లిప్తలగును. ఈలిప్తలను ౬౦ చే భాగింపగా లబ్ధము భాగలును, ఆశేషము లిప్తలును అగును. ఈభాగలిప్తలను వెనుక సాధించి వ్రాసియున్న భాద్యమను పేరుగల రాశ్యాదిలో గూడగానైనది, రాశ్యాది స్ఫుటగ్రహమగును. ఈప్రకారము తన యిష్టకాలమునకు రవ్యాది గ్రహములన్నిటిని సాధింపవలసినది. ఈరాశ్యాదిగ్రహములు జన్మకాల, వర్షప్రవేశ, ముహూర్త, ప్రశ్న కాలాదులయందు ముఖ్యముగా సాధించి వానివలన సర్వకార్యములును సాధింపవలెను. ఇది బహూపయోగము.

ఉదాహరణము :—శక ౧౮౧౪ నందననామసంవత్సర ఆశ్వయుజ శు ౧౫ గురువారమునాడు సూర్యాస్తమయాది ౩-౨ గడియవిగడియలకు గ్రహసాధనము చేయవలసి యున్నది.

ముందుగా రవిసాధనమును చెప్పుచున్నాను.

ఈదినమున రాత్రి ౩-౨ గడియలు అయ్యేవరకు పంచాంగములో రవి హస్తానక్షత్రమందున్నాడు గనుక యీరవి యీహస్తయందు ప్రవేశనిర్గమములు యెప్పుడో చూడవలెను. శ్రీ పిడపర్తివారి పంచాంగమురీత్యా యీశుద్ధ ౪ ఆదివారములోజున హస్తా ౧ ర్క్షః ౧౫-౫౫ అనియున్నది. తిరుగా యీబహుళ ౨ స్థానే ౩ స్థిరవారములోజున యీహస్తను విడిచి, చిత్రా ౧ ర్క్షః ౪౬-౩౩ అని వ్రాసియున్నది. కనుక అశ్వయుజ శు ౪ ఆదివారమునాడు ౧౫-౫౫ ఘడియల మొదలుకొని యీ బ ౨ స్థానే ౩ స్థిరవారమునాడు ౪౬-౩౩ ఘడియలవరకును యీరవి హస్తయందున్నాడని తెలియవచ్చెను. కనుక యీరెండు ప్రవేశకాలముల నడుమనుండు దినములు మొదలగునవి లెక్కించిచూడగా ౧౩ దినముల ౩౦ ఘడియల ౩౭ విఘడియలు అయినది. దీనికి ప్రమాణమని పేరు. ఈ శు ౪ ఆదివారములోజున యీహస్తాప్రవేశ ఘడియలు ౧౫-౫౫ మొదలు నేటిదినము అనగా శు ౧౫ గురువారములోజున రాత్రి ౩-౨ ఘడియలవరకు రవికి హస్తానక్షత్రములో దినములు ౧౧ ఘడియలు ౧౬ విఘడియలు ౪౩ భుక్తి అయినది. ఈభుక్తదినాదికమునకే యిచ్ఛయనిపేరు. ఈప్రమాణేచ్ఛలు రెంటిని ఒకచోట గుర్తుగా వ్రాసి యుంచుకొనవలెను. ఇప్పుడు ముందుగా భాద్యమునుదానిని సాధింపవలసియున్నది. ఎట్లంటె ;

ఇష్టకాలమునకు రవి హస్తయందున్నాడుగనుక యీహస్తకు వెనుకటి నక్షత్రము ఉత్తరఫల్గునిగదా అశ్వని మొదలు యీయుత్తరఫల్గుని ఆఖరువరకు లెక్కింపగా ౧౨ అయినది. ఇదియే రవియొక్క గతనక్షత్రసంఖ్యయని తెలియవలెను. ఈసంఖ్య ౧౨ టిని ౪ చే గుణించగా ౪౮ అయినది. దీనిని ౯ చే భాగింపగా లబ్ధము ౫ ఇవి రాసులు, శేషము ౩ దీనిని ౩౦ చే గుణింపగా ౯౦ అయినది. దీనిని మరల ౯ చే భాగింపగా ౧౦ అయినవి. ఇవియే భాగలు. కనుక ౫ రాసుల ౧౦ భాగలు వచ్చెను. దీనికే భాద్యమని పేరు. ఇది యటుండనిచ్చి వెనుక వ్రాసికొన్న యిచ్ఛనుదానిని ౮౦౦ చే గుణింపవలెను గనుక

దినము ౧కి=౬౦ ఘడియలు, ఘడియ ౧కి ౬౦ విఘడియలు.

(౧౦×౧౦×౮=౮౦౦ ఎనిమిదివందల నిట్లు భాగించి గుణింపవలెను.

ఇష్ట

ది. ఘ విఘ. ది. ఘ- విఘ.

౧౧- ౧౬- ౪౩ × ౮౦౦ = ౯౦౨౨- ౫౩ - ౨౦

| | | | |
|---|---|---|---|
| | | ౧౦ | గుణింపగా నయినది. |
| ౧౧౨- | ౪౭- | ౧౦ | దీనిని ప్రమాణముచే |
| | | ౧౦ | భాగింపవలెను గనుక |
| ౧౧౨౭- | ౫౧- | ౪౦ | |
| | | ౮ | |
| ౯౦౨౨- | ౫౩- | ౨౦ | ఇది గుణింపగానయినది. |

ఇదిభాజ్యము.

వెనుక వ్రాయబడియున్న ప్రమాణము అనేది :— ది ౧౩- ఘ ౩౦- విఘ ౩౮ ఇది ప్రమాణము.

భాజ్యమునున్ను, ప్రమాణమునున్ను వెనుక కాలపరిచ్ఛేదములో నెం ౧ ను గల యుదాహరణములో వలెనే సవర్ణించవలెను. ఇట్లు సవర్ణింపగా—౩౨౪౮౨౪౦౦ భాజ్యసవర్ణ విఘటికలును; ౪౮౬౩౮ ప్రమాణ సవర్ణ విఘటికలును వచ్చినవి.

భాజ్యసవర్ణమును ప్రమాణసవర్ణముచే భాగింపవలెను. గనుక

| ప్రమాణసవర్ణ విఘటికలు. | భాజ్యసవర్ణ విఘటికలు. | భాగింపగావచ్చిన లబ్ధము. |
|---|---|---|
| ౪౮౬౩౮ ) | ౩౨౪౮౨౪౦౦ | ( ౬౬౭ ఇవి లిప్తలు. |

౨౯౧౮౨౮

౩౨౯౯౬౦

౨౯౧౮౨౮

౩౮౧౩౨౦

౩౪౦౪౬౬

౪౦౮౫౪

ఈలిప్తలను గ్రహసాధన ప్రకరణములో ౨౦ నెంబరులో వ్రాసిన ప్రకారము చేయగానైన భాగాది ౧౧-౭ యీభాగాదిని వెనుక సాధించి వ్రాసిన భాద్యమనే రాశ్యాదియగు ౫-౧౦-౦ లో గూడగానైన రాశ్యాది ౫-౨౧-౭ ఇదియే ఇష్టకాలమునకు స్ఫుటరవియని చెప్పబడును. ఈలాగుననే కుజాది గ్రహములను కూడ స్ఫుటము చేయవలెను.

### చంద్రస్ఫుటోదాహరణము.

పైయుదాహరణ తిథినాటి యిష్టకాలమునకు చంద్రుడు రేవతీనక్షత్రమందున్నాడు గనుక వెనుకటి రవియుదాహరణములోవలెనే అశ్విన్యాది గతనక్షత్రిన ౨౬ దీనిని ౪ చే గుణించగా ౧౦౪ అయినది దీనిని ౯ చే భాగింపగా లబ్ధము ౧౧ ఇవి రాసులు. ఆశేషము ౫ దీనిని ౩౦ చే గుణింపగా ౧౫౦ ఆయినది. దీనిని ౯ చే భాగింపగా ౧౬ వచ్చినది. ఇవి భాగలు. ఆశేషము ౬ దీనిని ౬౦ ట గుణించగా ౩౬౦ దీనిని ౯ చే భాగింపగా ౪౦ వచ్చెను. ఇవిలిప్తలు. ఈప్రకారము వచ్చినరాశ్యాది ౧౧-౧౬-౪౦ ఇది భాద్యమని పేరుగలది యగు. ఇది యటుండనిచ్చి, ప్రమాణేచ్ఛల సాధనముం జెప్పుచున్నాడు. ఎట్లంటె; యీతొలిరోజు అనగా యీ మాఘ ౧౪ బుధవారము రోజున పూర్వాభాద్ర ౧-౩౮ ఘడియలవరకు నుండి పిమ్మట ౫౭-౩ ఘడియలదాక ఉత్తరాభాద్రానక్షత్రము ఉన్నది. ఈ రెండింటియొక్క మొత్తము ౫౮-౪౧ అయినది. ఈచతుర్దశినాటి సూర్యోదయము మొదలు యింతపర్యంతమున్న పూర్వనక్షత్రమేయున్నదని తెలియవలెను. కనుక చతుర్దశినాటి అహోరాత్రము ౬౦ టిలో అపూర్వనక్షత్రము ౫౮-౪౧ ని తీసివేయగా శేషము ౧-౧౯ ఇది చతుర్దశినాటి అహోరాత్రములో కలసిన రేవతీనక్షత్ర సంబంధమైన ఘటికాది నేటిరోజున అనగా ౧౫ గురువారమురోజున రేవతీనక్షత్రం ౫౫-౦ ఘడియలవరకున్నది. కనుక యిది వర్తమాన నక్షత్రఘటికాది యని చెప్పబడును. వెనుక వ్రాసిన పూర్వదినములో కలసియున్న రేవతీనక్షత్ర ఘటికాది ౧-౧౯ న్ని యీరోజునవున్న రేవతి ఘడియలు ౫౫-౦ నున్ను యీ రెండును కలుపగానైనది ౫౬-౧౯ ఇది రేవతీనక్షత్రముయొక్క భుక్తాద్యంతమని చెప్పబడును దీనికే ప్రమాణమని పేరు చతుర్దశినాడు కలసియున్న రేవతిగడియలు ౧-౧౯ న్ని నేటిదినము అనగా ౧౫ బుధవారము రోజున సూర్యోదయాది యిష్టకాలమువరకును అయిన రేవతీభుక్తఘటికాది ౩౨-౩౮ యీరెండు ఘటికలున్ను కూడగా నైనది ౩౩-౫౭. ఇది రేవతీనక్షత్రములో ఇష్టకాలమునకు అయిన భుక్తఘటికాది. ఇది యిచ్ఛయని చెప్పబడును ఈయిచ్ఛను దానిని ౮౦౦ చేత గుణింపగా ౨౭౧౬౦-౦ అయినది. దీనిని ప్రమాణమనే ౫౬-౧౯ చే భాగింపవలెను. కనుక యీ రెండింటిని సవర్ణించి భాగింపగావచ్చిన లబ్ధము ౪౮౨ లిప్తలు. ఈలిప్తలను ౬౦ చేత భాగింపగావచ్చిన లబ్ధము ౮ ఇవి భాగలు. ఆశేషము ౨ ఇవి లిప్తలు. ఈభాగలిప్తలు ౮-౨ టిని పూర్వము సాధించి వ్రాసియున్న చంద్రభాద్యము ౧౧-౧౬-౪౦ యీరాశ్యాదిలో గూడగా నైనరాశ్యాది ౧౧-౨౪-౪౨ ఇదియే స్ఫుటచంద్ర

రాశ్యాది యని చెప్పబడును. ఇక్కడికి రవ్యాది స్ఫుటగ్రహసాధనము పూర్ణమయినది.

## లగ్నసాధనప్రకరణము.

ఇఁక భావసాధనమును, తత్సంధిసాధనమును, భావగతగ్రహ
జ్ఞానోపాయమును జెప్పుచున్నాడు.
ఈభావసాధనమన్నిటియందు నత్యావశ్యకమైనది.
అథా లగ్నసాధన మాహ.

నెం ౨౨:—శ్లో॥ నాడ్యాదికంలగ్నగతంఖగుణ౩౦ ఘ్నంస్వమానహృత్
భాగాదిలబ్ధం సంసాధ్యం గతరాశి యుతం తనుః॥

తా॥ సూర్యుడు, అయనాంశలు అక్కరలేకయే బాలురకతిసులభముగ రాశ్యాది లగ్నమును సాధించు విధముం జెప్పుచున్నాడు. ఎట్లనగా; ముందుగా ఘటికాది లగ్నభుక్తిని తెచ్చుకోవలెను అదియెట్లంటె; తన యిష్టతిథినాడు తన యిష్టఘటికలు యెన్నియగునో అయిష్టఘటికలు పెట్టుకొని అందులో ఆరోజున పంచాంగములో ఆతిథి చివరన వ్రాసియుండు భుక్తియను ఘటికాదిని ఘడియ విఘడియలను కూడియుంచుకొని అందులో వెనుకటి కాలపరిచ్ఛేదమునందలి ౧౩ వ నెంబరు ఫారములో తన యిష్టతిథినాటికి నడచుచున్న రవి సంక్రమణమని యున్న వరుసలో యేగడియలోని ఘటికాది పోవగియుండునో దానిం దీసివేయగా మిగిలినది, అపోయిన లగ్నము నకు నైలగ్నమునందంత భుక్తియని యెరుంగవలయును. ఇదియే తత్కాలలగ్నభుక్తి ఘటికాదియని చెప్పబడును.

ఉదాహరణము :—వెనుకటి యుదాహరణములోని ఆశ్వయుజ శు ౧౧ గురువారమురోజున సూర్యోదయాది ఇష్టకాలఘడియ విఘడియలు ౩౨-౩౭ ఇందులో యారోజున పంచాంగము తిథి చివరున వ్రాయబడియున్న భుక్తియను ఘటికాది ౩-౩౪ ను కలిపి అయినవి ౩౬-౧౧ అదిశోధ్యసంఖ్యయని యొకచోట వ్రాసికొనునది. అపిమ్మట ఇష్టకాలమునకు రవిసంక్రమణము యేదో తెలిసి కాలపరిచ్ఛేదములో ౧౩ వ నెంబరు ఫారములో రవిసంక్రమణ పంక్తి వరుసగా ౧౨ గళ్ళను చూడవలెను. అట్లుచూడగా నేటికి రవి కన్యాసంక్రమణ గతుడైయున్నాడు గనుక ఆఫారములో పైనుండి క్రిందికి నిడువుగా వ్రాసియున్న ౧౨ సంక్రమణములలో కన్యాసంక్రమణమునకు జవాబుగా అడ్డపంక్తిని వ్రాసియున్న ౧౨ లగ్నాంత ముహూర్తములను చూచి

అందులో వెనుకటి శోధ్యసంఖ్యయగు ౩౬-౧౫ లో పోలగిన మొత్త మెద్దియో దానిం దీసివేయవలెను. కనుక శోధ్యసంఖ్య ౩౬-౧౫ ప్రకారములో కన్యాసంక్రమణ కలము లో పోలగినది మీనలగ్నాంత మొత్తము ఘటికాది ౩౪-౨౭ అయియున్నది. కనుక దీని శోధ్యసంఖ్యలో తీసివేయగా శేషము ౧-౪౮ ఇది తత్కాలమేషలగ్న ప్రమాణములో నైన భుక్తియని తెలిసేది.

ఇట్లు ఘటికాదిలగ్న భుక్తిని సాధించి దానివలన రాశ్యాదిలగ్నసాధనముం జె ప్పుచున్నాడు. ఎట్లంటె :—

వెనుకటి ౨౨ నెంబరు శ్లోకమునను ఇక్కడ టీక వ్రాయబడుచున్నది.

టీ॥ నాడ్యాదికం= ఘటికాదికమగు; లగ్నగతం= లగ్నభుక్తి; ఖగుణఘ్నం= ఖగుణ ౩౦ చేత; ఘ్నం= గుణింపబడినదై; స్వమానహృత్ - స్వమానః= తత్కాల ల గ్నముయొక్క ప్రమాణముచేత; హృత్= భాగింపబడినదై; భాగాది= భాగలు మొ దలుగాగల; లబ్ధం= లబ్ధమును; సంసాధ్య= సాధించి; గత రాశియుతం- గత= గతించి న; రాశి= రాసులసంఖ్యతోడ; యుతం= కూర్చబడినదై; తనుః= లగ్నమను పేరుగల తనుస్థానమగుచున్నది; దీనికేతనుభావమని పేరు.

తా॥ వెనుకటిరీతిగా సాధింపబడిన ఘటికాది లగ్నభుక్తిని ౩౦ చే గుణించి యాలగ్నప్రమాణముచే భాగింపగావచ్చిన లబ్ధము భాగలు ఆశేషమును ౬౦ చే గు ణించి ఆలగ్నమానముచేతనే భాగింపగా వచ్చినలబ్ధము లిప్తలగును. ఇట్లువచ్చిన భా గాదిలో ప్రథమమున రాశిస్థానమునందు తత్కాలలగ్నముయొక్క వెనుకటి లగ్నమువ రకు మేషాదిగా నెన్ని రాసులు గతించినవో ఆగతరాశి సంఖ్యను ఆరాశిస్థానమునందుంచ గా నది రాశ్యాది లగ్నమగునని తాత్పర్యము.

ఉదాహరణము :—వెనుక ప్రస్తారమువల్ల సాధించిన మేషలగ్నభుక్తి ఘటి కాది ౧-౪౮ దీనిని ౩౦ చే గుణింపగా ౫౪-౦ దీనిని విఘడియలుగా సవర్ణించగా ౩౨౪౦ అయినది. దీనిని వెనుకచెప్పిన ప్రకారము మేషలగ్నస్ఫుటప్రమాణ విఘడి యలు ౨౬౦ చే భాగింపగా వచ్చినలబ్ధము ౧౨ ఇవిభాగలు. ఆశేషము ౧౨ దీనిని ౬౦ చే గుణింపగా ౭౨౦ దీనిని వెనుకటి ౨౬౦ చేతనే భాగింపగా లబ్ధము ౨౭ ఇవి లిప్త లు. ఈప్రకారము భాగలిప్తలను తెచ్చి రాశిస్థానము లేకుండనున్నది గనుక (౦) సు న్న చేర్పగానైన రాశ్యాదిలగ్నము ౦-౧౨-౨౭ తత్కాల లగ్నము మేషమే యగుట చేత లగ్నసంఖ్య లేమింజేసి రాశిస్థానమందు శూన్యమే యుంచబడినది.

## భావసాధనప్రకరణము.

ఇట్లు రాశ్యాదిలగ్నమును సాధించి యిక ద్వాదశభావములను సాధింపదలచి ముందుగా దశమభావమును సాధించుచున్నాడు.

నెం ౨౩:— అథ దశమ భావ సాధన మాహ ॥

శ్లో॥ భాగాస్స్యు ర్నత నాడికారస ౬ హతా స్తద్దీన యుక్ప్రాక్పరే
సూర్యేఃఖం సరసం ౬ సుఖం కథిత తల్లగ్నంచషడ్భంమదః
వ్యస్తాబ్ధారి ౬ లవోథ భూచ్యుత ఇమాభూయోంగ పాతాలయోః
క్షేప్యాషట్తనుగస్సంధయ ఇమెషడ్భాన్వితాస్స్యుఃపరే॥మార్తాండే

టీ॥ నతనాడికాః= నతఘడియ విఘడియలు; రస హతాః- రస ౬= చేత; హతాః= గుణింపబడినవై; భాగాః= భాగలు; స్యుః= అగుచున్నవి. ఇక్కడ భాగాః అనుటచేత భాగలిప్తలని యుపలక్షణము; తత్= ఆభాగాదికముచేత; హీన= తీసివేయబడినట్టియు, యుక్= కూర్చబడినట్టియు, సూర్యః= రాశ్యాదిస్ఫుటసూర్యుడు; ప్రాక్= పూర్వకపాలమందును; పరే= పశ్చాత్కపాలమందును; ఖం= దశమభావమగుచున్నది; తత్= ఆదశమభావము; సరసం= ౬ రాసులతోగూర్చబడినదై; సుఖం= చతుర్థభావముగుచున్నది; కథితతల్లగ్నం- కథిత= చెప్పబడిన; తల్లగ్నం = ఆలగ్నము- షడ్భం= ౬రాసులతో గూర్చబడినదై; మదః= సప్తమభావమగుచున్నది- వ్యస్తాబ్ధారిలవః- వ్యస్త= సప్తమభావరహితమైన; అబ్ధ= దశమభావముయొక్క; అరిలవః= అరవపాలు స్సు; అథ= అటుతర్వాత; భూచ్యుతశ్చ- ఒకటిలోనుంచి తీసివేయబడినదియు; ఇమాః= ఈరెండును; అంగ పాతాలయోః- అంగ= లగ్నమునందును, పాతాలయోః= చతుర్థభావమునందును; భూయః= తిరిగి తిరిగి; క్షేప్యాః= కలుపబడినవై; తనుగః= లగ్నాదిగా; ససంధయః= సంధులతోగూడినట్టి; షట్= ౬ భావములును; ఇమె= ఈ ౬ భావములును; షడ్భాన్వితాః= ఆరురాసులతో గూర్చబడినవై; పరే= ఇతరభావములును; తత్సంధులును; స్యుః= అగుచున్నవి.

ఉదాహరణము:—ముందుగా దశమభావమును సాధింపవలెను. అందు కాధారము నతము గనుక నతమనగా నెట్టిదో చెప్పుచున్నాడు.

నెం ౨౪:—శ్లో॥ రాత్రేశ్శేషమితంయుతందినదళేనాహర్గతం శేషకం
విశ్లేష్యంఖలుపూర్వపశ్చిమనతంత్రింశచ్చ్యుతంచోన్నతం॥శ్రీకేశవః॥

శా॥ ఇష్టదినము నాటి దినమానమును సగము చేయగా నైనది దినార్ధమని చెప్పబడును. (దినమానము వెనుకటి దినగణపదకము వలన తెలియును గనుక అవిమాడవలెను.)

రాత్రియందు:—సూర్యాస్తమయాది రెండుయామముల వరకును రాత్రిగతఘడియలును, రెండుజాముల పైనుంచి రాత్రిశేషఘడియలును నాటి దినార్ధములో కలుపగా నది నతమగును.

పగటియందు:—ఇష్టకాలము యెయ్యేని సూర్యోదయాది రెండుజాములవరకును గతఘడియలును, పరమందు దినశేషకాలమును నాటిదినార్ధములో తీసివేయగా నదినతమగును. ఇట్లు నతమును సాధించి ఈనతఘడియలను ౬ చే గుణింపగా భాగలిప్తలగును. ఈభాగాదికమును ఇష్టకాలస్ఫుటసూర్యునిలో పూర్వకపాలమందు ఋణమున్ను, పశ్చిమకపాలమందు ధనమున్ను చేయగా దశమభావమగును

పూర్వకపాలమనగా—అర్ధరాత్రి ప్రభృతిపరదిన మధ్యాహ్నము వరకు.

పశ్చిమకపాలమనగా:—పగలు మధ్యాహ్నము మొదలు నాటి యర్ధరాత్రము పర్యంతము.

ధనమనగా కలుపుట. ఋణమనగా తీసివేయుట. ఈయుదాహరణములో అవగానందన సం॥ ఆశ్వయుజ శు ౧౫ గురువారమున సూర్యాస్తమయాది ఇష్టకాలఘడియలు 3|౨ ఇదిపూర్వరాత్రిలోనికాలముగనుక రాత్రిగతము 3|౨ నేటిదినమానము ౨౯|3౬ దీనిలో సగము ౧౪|౪౮ ఇది దినార్ధము. ఈదినార్ధములో వెనుకటి రాత్రిగతమును కలుపగా ౧౭|౫౦ అయినది. మధ్యాహ్నాది-అర్ధరాత్రము లోపలికాలము గనుక పశ్చిమకపాల నతమని యెరుగవలయును ఈపశ్చిమ నతము ౧౭|౫౦ దీనిని ౬ చే గుణింపగా ౧౦౭ భాగలైనది. ఈభాగలను 3౦ చే భాగింపగాలబ్ధము 3, ఆశేషము ౧౭ ఇవి భాగలు. ఈ రాశిభాగలను, ఈదినమున యిష్టకాలమునకు వెనుక సాధించి వ్రాసిన స్ఫుటరవిరాశ్యాది ౫|౨౧|౭ లో పశ్చిమకపాలము గనుక కూడగా నైనది ౯|౮|౭ ఈరాశ్యాదియే దశమభావమగును. ఈదశమ భావములో ౬ రాసులు కూడగానైన 3|౮|౭ ఇది చతుర్థభావము॥ ఇక తక్కిన ధనాదిభావములను సాధించవలెను.

ఎట్లనిన:—వెనుక సాధింపబడిన లగ్నరాశ్యాది ౦|౧౨|౨౭ దీనిలో ౬ రాసులు రాశిస్థానమందు కూడగా నైన సప్తమభావము ౬|౧౨||౨౭ దీనిని పైనవ్రాసిన దశమభావము ౯|౮|౭ లో తీసివేయగా శేషరాశ్యాది ౨|౨౫|౪౦ దీనియొక్క షష్ఠాంశము అనగా ౬ వ పాలు తేవలెను. గనుక ఆశేషరాశ్యాదిలో రాశిస్థానము ౨, దీనిని ౬ చే భాగింపగా లబ్ధము రాసులు ౦, ఆశేషము ౨- దీనిని 3౦ చే గుణించి క్రిందిభాగలు

౨౫ ను కూడగా నైన భాగలు ౮౫ దీనిని ౬ చే భాగింపగా వచ్చినలబ్ధము ౧౪ ఇవి భాగలు. ఆశేషము ౧ దీనిని ౬౦ చే గుణించి క్రిందిలిప్తలు ౪౦ ఇవి కూడగా నైన లిప్తలు ౧౦౦ దీనిని ౬ చే భాగింపగా వచ్చినవి ౧౬ ఇవి లిప్తలు. ఈవచ్చిన రాశ్యాది ౦|౧౪|౧౬ ఇది షష్ఠాంశమని యొకచోట వ్రాసికొనవలెను. ఇక ధనాది భావములు.

ఎట్లనగా:—వెనుక వ్రాయబడిన లగ్నరాశ్యాది ౦|౧౨|౨౭ ఇందులో పైనవ్రాసిన షష్ఠాంశమను రాశ్యాదిని ౦|౧౪|౧౬ కలుపగా నైనది ౦|౨౬|౪౩ ఇది లగ్నమునకు న్ను ధనభావమునకును నడుమ నుండు సంధి. దీనిలో మరల ఆషష్ఠాంశమును గూడగా నైనది ౧|౧౦|౫౯ ఇది ధనభావము. ఈధన భావములోని యాషష్ఠాంశమును కలుపగా నయినది ౧|౨౫|౧౫ ఇది ధనభ్రాతృభావముల మధ్యసంధి, ఈసంధిలోని యాషష్ఠాంశమును గలుపగా నైనది ౨|౯|౩౧ ఇది భ్రాతృభావము. దీనిలోని యాషష్ఠాంశమును గలుపఁగానైనది ౨|౨౩|౪౭ ఇది భ్రాతృ మాతృ భావముల మధ్యసంధి, చతుర్థభావము ముందే సాధింపబడినది, మాతృభావము ౩|౮|౭ లగ్నము మొదలుకొని యీమాతృభావము వరకును మాత్రమె యాషష్ఠాంశమును కలుపుచు రావలెను. పిమ్మట మాతృభావము మొదలు షష్ఠభావమువరకును మరియొక పద్ధతి కలదు

ఎట్లనగా:—వెనుకటి షష్ఠాంశము ౦|౧౪|౧౬ ను ౧ రాశిలోనుంచి తీసివేయగా శేషము ౦|౧౫|౪౪ ఇది శుద్ధరాశ్యాది యనబడును. ఈ శుద్ధరాశ్యాదిని మాతృ (చతుర్థ) భావములో గూడగా నైనది ౩|౨౩|౫౧ ఇది మాతృపుత్రభావముల మధ్యసంధి. దీనిలో శుద్ధరాశ్యాదిగూడగా నైనది ౪|౯|౩౫ ఇది పుత్ర (పంచమ) భావమగును. దీనిలో శుద్ధరాశ్యాది గూడగా నైనది ౪|౨౫|౧౯ ఇదిపుత్రశత్రుసంధియగును. దీనిలో శుద్ధరాశ్యాది గూడగా నైనది ౫|౧౧|౩ ఇది శత్రు (షష్ఠ)భావమగును ఇందులో శుద్ధరాశ్యాది గూడఁగానైనది ౫|౨౬|౪౭ ఇదిశత్రుకళత్రభావముల మధ్యసంధియగును. ఈ ప్రకారము లగ్నాదిషష్ఠభావాంతము ౬ భావములును, ౬ సంధులు నగును. పిమ్మటలగ్నాదివరుసగా ప్రతిభావములోనున్ను, ప్రతిసంధిలోనను రాశిస్థానమందు ౬ కూడగా వరుసగా సప్తమభావము మొదలు వ్యయ (ద్వాదశ) భావాంతము వరకు ౬ భావములును ౬ సంధులు నగును. ఈప్రకార మీయుదాహరణలో చేయగానయిన ద్వాదశ భావములనున్ను యీదిగువను నుదహరింపబడినది.

నెం ౨౫ :— తన్వాది ద్వాదశభావాన్ససంధయో రాశ్యాద్యాః.

| తనుభావః | సంధిః | ధనభావః | సంధిః | భ్రాతృభావః | సంధిః | మాతృభావః | సంధిః | పుత్రభావః | సంధిః | శత్రుభావః | సంధిః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౦ | ౧ | ౧ | ౨ | ౨ | ౩ | ౩ | ౪ | ౪ | ౫ | ౫ |
| ౧౨ | ౨౬ | ౧౦ | ౨౫ | ౯ | ౨౩ | ౮ | ౨౩ | ౯ | ౨౫ | ౧౧ | ౨౬ |
| ౨౭ | ౪౩ | ౫౭ | ౧౫ | ౩౧ | ౪౭ | ౭ | ౫౧ | ౩౫ | ౧౯ | ౩ | ౪౭ |

| కళత్రభావః | సంధిః | ఆయుర్భావః | సంధిః | భాగ్యభావః | సంధిః | రాజ్యభావః | సంధిః | లాభభావః | సంధిః | వ్యయభావః | సంధిః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౬ | ౭ | ౭ | ౮ | ౮ | ౯ | ౯ | ౧౦ | ౧౦ | ౧౧ | ౧౧ |
| ౧౨ | ౨౬ | ౧౦ | ౨౫ | ౯ | ౨౩ | ౮ | ౨౩ | ౯ | ౨౫ | ౧౧ | ౨౬ |
| ౨౭ | ౪౩ | ౫౯ | ౧౫ | ౩౧ | ౪౭ | ౭ | ౫౧ | ౩౫ | ౧౯ | ౩ | ౪౭ |

ఇట్లు ౧౨ భావములున్ను ౧౨ సంధులున్ను సాధించి వ్రాయబడెను. ఈభావసాధనము జాతక, మహూర్త, తాజక, ప్రశ్నలయందు మిక్కిలి యుపయోగించును. ఇది బాలబోధకొరకై యింత వివరముగా వ్రాయుటచే గ్రంథము విస్తారముగా గనపించునుగాని బోధించుకొన్న పిదప బహు సుగమముగా జేసికొనవగును. ఇది సర్వాదరణీయము.

తన్వాది ద్వాదశభావముల పేర్లు. ౧ తను- ౨ ధన- ౩ భ్రాతృ- ౪ మాతృ- ౫ పుత్ర- ౬ శత్రు- ౭ కళత్ర- ౮ ఆయు- ౯ భాగ్య- ౧౦ రాజ్య- ౧౧ లాభ- ౧౨ వ్యయ- ఇవి భావములు.

నెం ౨౬ :— అథగ్రహాణాం భావస్థితి జ్ఞానాయ పూర్వానీతస్ఫుటగ్రహాః అత్ర దర్శయతి॥ స్ఫుటగ్రహా రాశ్యాద్యాః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవిః | ౫-౨౧- ౭ | బుధః | ౫-౨౦- ౫ | శనిః | ౫-౧౩-౨౨ |
| చంద్రః | ౧౧-౨౪-౪౨ | గురుః | ౦- ౦-౧౮ | రాహుః | ౦-౧౬-౪౮ |
| కుజః | ౯-౨౫-౧౫ | శుక్రః | ౪- ౬-౨౫ | కేతుః | ౬-౧౬-౪౮ |

నెం ౨౭ :— అథ భావస్థగ్రహజ్ఞానార్థముపాయః.

శ్లో॥ ఖేటేసంధిద్వయాంతస్థే ఫలంతద్భావజం భవేత్
తదారోహం పూర్వసంధేరవరోహాంతథోత్తరే॥ శ్రీకేశవః॥

తా॥ రాశ్యాదిగ్రహము యేభావసంబంధమైన రెండుసంధులకు లోపడియుండునో ఆభావమందు ఆగ్రహమున్నట్లు తెలియవలెను. గ్రహము ఆభావముయొక్క పూర్వ

సంధిభాగల వరకు గ్రమించి భావముయొక్క భాగల కభిముఖముగ వెళ్లుచుండె నేని ఆగ్రహము భావారోహ గ్రహమనియు, భావభాగల వరకు గ్రమించి ఆభావము యొక్క యుత్తరసంధికి వెళ్లుచుండెనేని ఆగ్రహము భావావరోహ గ్రహమనియు చెప్పబడును.

ఉదాహరణము:—రాశ్యాదిరవి ౫।౨౧।౭ యీరవి నెం ౨౫ పటములో వ్రాసినభావములలో తృతీయభావముయొక్క రాశ్యాది ౫।౧౧।౩ ద్వితీయోత్తరసంధి ౫।౨౬।౪౭ గనుక భావముకంటె దాటి యుత్తరసంధికి వెళ్లుచున్నాడు. కాబట్టి రవి తృతీయ (వష్ట) భావముందుండి అవరోహ గ్రహమైయున్నాడు. కనుక యీరవిని భావచక్రములో లగ్నాదిగా ౬ వ గడిలో వేయవలెను; యీలాగుననే అందరు గ్రహములను కనిపెట్టి భావచక్రమును వ్రాసికొనవలయును ఒకవేళ నన్నదైన రాశిచక్రములో లగ్నాదిగా ఒకగడిలో పడ్డ గ్రహము భావచక్రములో వేరొకగడిలోకి పడినయెడల నప్పుడు గ్రహములకు దృగ్బలమున్ను, బలసాధనము మొదలుగు సమస్తకార్యములందును రాశిచక్రమే ప్రధానము. కేవలభావఫలము విషయమై మాత్రము భావచక్రము ప్రధానమని తెలియవలెను.

నెం ౨౭:—గ్రహముల స్థితియు, నుచ్చనీచమిత్రశత్రువులును.

| గ్రహములు | క్రూర సౌమ్య. | గ్రహముల ఆధిపత్య రాసులు. | వారి మూలత్రికోణ రాసులు. | వారి ఉచ్చరాసులు, పరమోచ్చభాగలు. | నీచరాసులును, పరమనీచభాగలును. | వారియొక్క మిత్రులు. |
|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ |
| రవిః | క్రూరః | సింహ | సింహ | మేషే ౧౦ | తుల ౧౦ | చం-కు-గు |
| చంద్రః | సౌమ్యః | కర్కాటక | వృష | వృషే ౩ | వృశ్చి ౩ | ర-బు |
| కుజః | క్రూరః | మేష, వృశ్చిక | మేష | మకరే ౨౮ | కర్కట ౨౮ | ర-చం-గు |
| బుధః | సౌమ్యః | కన్యా, మిథున | కన్యా | కన్యాయాం ౧౫ | మీన ౧౫ | ర-శు |
| గురుః | సౌమ్యః | ధను, మీన | ధను | కర్కటే ౫ | మకర ౫ | ర-చం-కు |
| శుక్రః | సౌమ్యః | తుల, వృషభ | తుల | మీనే ౨౭ | కన్యా ౨౭ | బు-శ |
| శనిః | క్రూరః | మకర, కుంభ | కుంభ | తులాయాం ౨౦ | మేష ౨౦ | బు-శు |
| రాహుః | క్రూరః | కన్యా | సింహ | వృషః | వృశ్చి | శు-శ |
| కేతుః | క్రూరః | వృశ్చిక | కుంభ | వృశ్చికః | వృష | శు-శ |

శ్లో. క్రూరా భాను తమశ్శని ధ్వజ కుజాశ్శుక్రార్య సౌమ్యేందవస్సౌ
మ్యాః ॥ ఇతి కాలామృతే ॥

---

శ్లో॥ సింహస్యాధిపతి స్సూర్యశ్చంద్రః కర్కటకేశ్వరః
మేషవృశ్చికయోరార్భౌమః కన్యామిధునయో ర్బుధః
ధనుర్మీనద్వయోర్మంత్రీ తులా వృషభయోః కవిః
మకరస్యచ కుంభస్యనాయకస్సూర్యనందనః ఇతి ఫలగ్రంథే ॥

---

శ్లో॥ రవేశ్చసింహో వృషభస్తథేందో ర్భౌమస్య మేషశ్శశిజస్యకన్యా
జీవస్య చాపో భృగుజస్యజౌలీ శనిర్ఘటశ్చాపిహి మూలకోణా ॥
ఇతి దర్పణే ॥

---

శ్లో॥ మేషోగౌ ర్మకరస్సతీ శశిగృహం మీనస్తులోచ్చాభిదా
దిగ్రామోమను యుగ్దినం శర మితం తారాః క్రమాద్వింశతిః
స్వస్వోచ్చాన్తగృహంస్వనీచభవనం సూర్యాదితః ॥ ఇతికాలామృతే॥

---

ఉచ్చకోణస్థపవ సీచ విభాగో వృక్షం.

---

సూత్రములు ॥ రవేరింద్వారజీవాభృగ్వార్కి । విధోరర్కజ్ఞే । కుజస్యా
ర్కేందుజీవాబుధః । జ్ఞస్యార్కభృగూచంద్రః। గురోరర్కేంద్వవని
జాజ్ఞశుక్రౌ । భృగో ర్జ్ఞార్కీరవీందూ । శనేర్జ్ఞభృగూరవీంద్వారాః॥
ఈసూత్రములలో మిత్రులు, శత్రులు మాత్రమే చెప్పబడెను. తక్కినవారు స
ములు. విభక్తి విరిగినచో ౨ భాగములగు.

---

## సమజాతి వర్ణ దాన ధాన్య జప ప్రమాణాదులను తెలిపెడి ఫారము.

| గ్రహములు | శత్రువులు | సములు | జాతులు | రంగులు | దానమిచ్చు ధాన్యములు. | రత్నములు | అనిష్టకాలమందు వారికి చేయు జపసంఖ్య. |
|---|---|---|---|---|---|---|---|
| | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ |
| రవి | శు-శ | బు | రాజా | రక్తశ్యామః | గోధూమ | పద్మరాగ | ౭౦౦౦ |
| చంద్ర | ౦ | శు-గు-కు-శ | వైశ్య | గౌరః | యవ | మౌక్తిక | ౧౧౦౦౦ |
| కుజ | బు | శు-శ | రాజా | రక్తగౌరః | ఆఢక | ప్రవాళ | ౧౦౦౦౦ |
| బుధ | చ | కు-గు-శ | వైశ్య | పీతగౌరః | ముద్గ | మరకత | ౯౦౦౦ |
| గురు | బు-శు | శ | విప్ర | హారిద్రః | చణక | గోమేధిక | ౧౯౦౦౦ |
| శుక్ర | ర-చ | కు-గు | విప్ర | శ్వేతః | రాజమాష | పుష్యరాగ | ౧౬౦౦౦ |
| శని | ర-చ-కు | గు | శూద్ర | నీలః | తిల | నీల | ౨౩౦౦౦ |
| రాహు | ర-చ-గు | బు-శు | చండాల | ధూమ్రః | మాష | అయః | ౧౮౦౦౦ |
| కేతు | ర-చ-గు | బు-శు | మ్లేచ్ఛ | చిత్రః | కుళుత్థ | అయః | ౭౦౦౦ |

| గ్రహనామాని | ప్రకారాంతరేణ క్రూరసౌమ్య విభాగః. | స్త్రీపురుష విభాగః | గ్రహాణాం కాలపురుషస్వరూప విభాగః. | జగతః రాజాద్యధికార విభాగః. | గ్రహాణాం వర్ణాధిపత్య విభాగః. | గ్రహాణాం అధిదేవతాః |
|---|---|---|---|---|---|---|
| రవిః | క్రూరః | పురుష | ఆత్మ | రాజా | తామ్ర | అగ్నిః |
| చంద్రః | అర్ధసౌమ్యః | స్త్రీ | మనః | రాజా | శ్వేత | జలః |
| కుజః | క్రూరః | పురుష | సత్వం | సేనాధిపః | అతిరక్త | స్కందః |
| బుధః | అర్ధసౌమ్యః | నపుంసక | వాక్ | యువరాజ | శుక్లవర్ణ | విష్ణుః |
| గురుః | సౌమ్యః | పురుష | జ్ఞానసుఖే | మంత్రీ | హారిద్రా | ఇంద్రః |
| శుక్రః | సౌమ్యః | స్త్రీ | మన్మధావ | మంత్రీ | చిత్రవర్ణ | శచీదేవి |
| శనిః | క్రూరః | నపుంసక | దుఃఖం | దాసః | కృష్ణవర్ణ | బ్రహ్మ |
| రాహుః | పాపక్రూరః | స్త్రీ | ,, | ,, | ,, | |
| కేతుః | పూర్ణక్రూర | నపుంసక | ,, | ,, | ,, | |

నెం ౨౯:—గ్రహసంజ్ఞాప్రకరణము.

| దిగాధిపత్య విభాగః | గ్రహాణాం పంచమహాభూతాధిపత్య విభాగః. | గ్రహాణాం సత్వరజస్తమోవిభాగః | గ్రహాణాం స్థాన, వస్త్రవిభాగః | గ్రహాణాం కాలః | గ్రహాణాం రస నిర్ణయః అవయవ సారంచ. |
|---|---|---|---|---|---|
| పూర్వదిక్ | ,, | సత్వ | దేవస్థానం<br>ముదుగుబట్ట | అయన | కటుక<br>అస్థి |
| వాయువ్య | ,, | సత్వ | జలస్థానం<br>క్రొత్తబట్ట | క్షణ, ము<br>హూర్త | లవణ<br>రక్తం |
| దక్షిణ | అగ్నిః | తమః | అగ్నిస్థానం<br>కాలినబట్ట | దిన | తిక్త |
| ఉత్తర | భూమిః | రజః | క్రీడాగృహ<br>తడిబట్ట | ఋతు | మజ్జా<br>మిశ్ర-త్వక్ |
| ఈశాన్య | ఆకాశః | సత్వ | భండారగృహ<br>వాడుకబట్ట | మాస | మధుర |
| ఆగ్నేయ | జలం | రజః | శయనగృహ<br>గట్టిబట్ట | పక్ష | వసా<br>ఆమ్ల- శుక్రః |
| పశ్చిమ | వాయుః | తమః | పెంటదిబ్బ<br>చిరిగినబట్ట | వత్సర | కషాయ<br>స్నాయు |
| నిరృతి | ... | ... | ... | ... | ... |
| వాయువ్య | ... | ... | ... | ... | ... |

నెం 30 :—అథ గ్రహస్వరూపమాహ.

రవిః—శ్లో॥ మధుపింగళదృక్చతురశ్రతనుఃపిత్తప్రకృతిస్సవితాల్పకచః॥

తా॥ సూర్యుఁడు; తేనెవలెపచ్చనికన్నులుగలవాఁడును, బల్లపరుపైనదేహమును పైత్యతత్వము, చిన్నజుట్టునుగలవాఁడని తాత్పర్యము.

చంద్రః—శ్లో॥ తనువృత్తతనుర్బహువాతకఫః ప్రాజ్ఞశ్చశశీమృదువాక్ శుభదృక్॥

తా॥ చంద్రుఁడు; కృశించినవర్తులదేహము, విశేష వాతశ్లేష్మములు మంచిబుద్ధి, మృదువయిన వాక్యము, చూడనింపైన దృష్టియును గలవాఁడు.

కుజః—శ్లో॥ క్రూరదృక్తరుణమూర్తిరుదారః పైత్తికస్సుచపలః కృశమధ్యః॥

తా॥ అంగారకుఁడు; తీవ్రమయినచూపు, నిత్యయౌవనముగల శరీరమును, ఔదార్యమును, పైత్యతత్వమును, చంచలమును, సన్నపాటి నడుమును గలవాఁడు.

బుధః—శ్లో॥ శ్లిష్టవాక్సతత హాస్యరుచిర్జ్ఞః పిత్తమారుతకఫః ప్రకృతిశ్చ॥

తా॥ బుధుఁడు; గద్గద వాక్యములును, ఎల్లప్పుడును పరిహాసమందు ఆసక్తియు ను, పైత్య, వాత, శ్లేష్మములను 3 తత్వముల సంఘాతమును గలవాఁడు

గురుః—శ్లో॥ బృహత్తనుః పింగళమూర్ధజేక్షణోబృహస్పతిః శ్రేష్ఠమతిః కఫాత్మకః॥

తా॥ గురుఁడు; గొప్పదేహమును, పచ్చని శిరోజములును, పచ్చనికన్నులను, యోగ్యమైన బుద్ధియును, శ్లేష్మతత్వమును గలవాఁడు.

శుక్రః—శ్లో॥ భృగుస్సుఖీకాంతవపుస్సులోచనః కఫానిలాత్మాఽసితవక్రమూర్ధజః॥

తా॥ శుక్రుఁడు; మంచి సుఖమును, సుందరమయిన దేహమును, సుందరమయిన కన్నులును, శ్లేష్మవాత ప్రకోపమును, నల్లనైనటువంటివిన్ని వంకరగలిగినట్టివిన్ని శిరోజములున్ను గలవాఁడు.

శనిః—శ్లో॥ మందోలసః కపిల దృక్కృశదీర్ఘగాత్రస్థూలద్విజః పరుషరోమకచో నిలాత్మా॥

తా॥ శనైశ్చరుఁడు; అలసటయును, భయముతోఁగూడిన చూపును, చిక్కినట్టియు పొడవయినట్టియు దేహమును, లావుగలదంతములును, మొద్దువంటి కేశములుగల జుట్టును, వాతప్రకృతియును గలవాఁడు.

| మాసములు. | మాసనామములు. | | ఈమాసములయొక్క శుద్ధ ౧౫ లయం దు గూడవలసిన నక్షత్రములు. |
|---|---|---|---|
| | పురుషులకు. | స్త్రీలకు. | |
| చైత్రం | కృష్ణః | భూమిః | చిత్రా |
| వైశాఖం | అనంతః | కళ్యాణీ | విశాఖా |
| జ్యేష్ఠం | అచ్యుతః | సత్యభామా | జ్యేష్ఠా |
| ఆషాఢం | చక్రీ | పుణ్యవతీ | పూర్వాషాఢా |
| శ్రావణం | వైకుంఠః | రూపిణీ | శ్రవణం |
| భాద్రపదం | జనార్దనః | ఇందుమతీ | పూర్వాభాద్ర |
| ఆశ్వయుజం | ఉపేంద్రః | చంద్రావతీ | అశ్వనీ |
| కార్తికం | యజ్ఞపురుషః | లక్ష్మీః | కృత్తికా |
| మార్గశిరం | వాసుదేవః | వాగ్దేవీ | మృగశిర |
| పౌషం | హరిః | పద్మావతీ | పుష్యమీ |
| మాఘం | గోవిందః | శ్రీదేవీ | మఘా |
| ఫాల్గునం | పుండరీకాక్షః | సావిత్రీ | ఫల్గునీ |

ఒకనక్షత్రము హెచ్చుతగ్గుగా గూడును.

సంజ్ఞాపరిష్కరణం॥ అశ్వన్యాదినక్షత్రాణాం దేవ, మనుష్య, రాక్షసగణభేదం, యోనిభేదంచ దర్శయతి.

| గణయోనిభేదః | గణాః. | యోనిః. |
|---|---|---|
| అశ్వని | దేవగణ | గుఱ్ఱము |
| భరణి | మనుష్యగణ | ఏనుగు |
| కృత్తిక | రాక్షసగణ | మేక |
| రోహిణి | మనుష్యగణ | పాము |
| మృగశిర | దేవగణ | పాము |
| ఆర్ద్ర | మనుష్యగణ | కుక్క |
| పునర్వసు | దేవగణ | పిల్లి |
| పుష్యమి | దేవగణ | మేక |
| ఆశ్రేష | రాక్షసగణ | పిల్లి |
| మఘ | రాక్షసగణ | ఎలుక |
| పుబ్బ | మనుష్యగణ | ఎలుక |
| ఉత్తర | మనుష్యగణ | గోవు |
| హస్త | దేవగణ | దున్నపోతు |
| చిత్ర | రాక్షసగణ | వ్యాఘ్రము |
| స్వాతి | దేవగణ | దున్నపోతు |
| విశాఖ | రాక్షసగణ | వ్యాఘ్రము |
| అనూరాధ | దేవగణ | లేడి |
| జ్యేష్ఠ | రాక్షసగణ | లేడి |
| మూల | రాక్షసగణ | కుక్క |
| పూర్వాషాఢ | మనుష్యగణ | కోతి |
| ఉత్తరాషాఢ | మనుష్యగణ | ముంగి |
| శ్రవణం | దేవగణ | కోతి |
| ధనిష్ఠ | రాక్షసగణ | సింహము |
| శతభిషం | రాక్షసగణ | గుఱ్ఱము |
| పూర్వాభాద్ర | మనుష్యగణ | సింహము |
| ఉత్తరాభాద్రి | మనుష్యగణ | గోవు |
| రేవతి | దేవగణ | ఏనుగు |
| అభిజిత్తు | ... | ముంగి |

నెం ౩౧ :—ప్రభవాది షష్టిసంవత్సరముల నామములును కాలపరిచ్ఛేదమున నెం ౯ ఘారమున జెప్పంబడియె. కావున నిక మాసఋతువుల నామములు చెప్పంబడును. సం॥ ౧ కి అయనములు ౨ అయనము ౧ కి మాసములు ౬ సూర్యునియొక్క కర్కటకాది ధనురంతమగు షడ్రాసిసంచారము ఉత్తరాయణమనియు ; మకరాది మిధునాంతమగు షడ్రాసిసంచారము దక్షిణాయనమనియు జెప్పంబడును.

| చాంద్రమానముల పేర్లు. | [illegible] | మాసాధిప విష్ణునామములు | మాససూర్యుల పేర్లు. | స్త్రీదేవనామములు. | ఋతువులు. |
|---|---|---|---|---|---|
| చైత్రము | మధుః | విష్ణు | వేదాంగ | రమా | |
| వైశాఖము | మాధవః | మధుసూదన | భాను | మోహినీ | వసంతరుతుః |
| జ్యేష్ఠము | శుక్రః | త్రివిక్రమ | ఇంద్ర | పద్మాక్షీ | |
| ఆషాఢము | శుచిః | వామన | రవి | కమలా | గ్రీష్మరుతుః |
| శ్రావణము | నభః | శ్రీధర | గభస్తి | కాంతిమతీ | |
| భాద్రపదము | నభస్యః | హృషీకేశ | యమ | అపరాజిత | వర్షరుతుః |
| అశ్వయుజము | ఇషః | పద్మనాభ | స్వర్ణరేతా | పద్మావతి | |
| కార్తికము | ఊర్జః | దామోదర | దివాకర | రాధా | శరదృతుః |
| మార్గశిరము | సహః | కేశవ | మిత్ర | విశాలాక్షీ | |
| పౌషము | సహస్యః | నారాయణ | విష్ణు | లక్ష్మీ | హేమంతరుతు |
| మాఘము | తపః | మాధవ | అరుణ | రుక్మిణీ | |
| ఫాల్గునము | తపస్యః | గోవింద | సూర్య | ధాత్రీ | శైశిరరుతుః |

నెం ౩౨:—నక్షత్రాదివిభాగ ప్రకరణం.

నక్షత్రములును- వానియధిపతులును—౧ అశ్వినికి-అశ్వినిదేవతలు ౨. భరణికి-యముడు, ౩ కృత్తికకు- అగ్ని. ౪ రోహిణికి- బ్రహ్మ ౫ మృగశిరకు- చంద్రుడు ౬ ఆర్ద్రకు- రుద్రుడు. ౭ పునర్వసుకు అదితి- ౮ పుష్యమికి- గురుడు- ౯ ఆశ్రేషకు- సర్పము. ౧౦ మఘకు- పితృదేవతలు- ౧౧ పుబ్బకు- భగుడు- ౧౨ ఉత్తరకు- అర్యముడు- ౧౩ హస్తకు- రవి. ౧౪ చిత్తకు. త్వష్ట- ౧౫ స్వాతికి- వాయువు- ౧౬ విశాఖకు- ఇంద్రాగ్నులు ౧౭ అనూరాధకు- మిత్రుడు. ౧౮ జ్యేష్ఠకు- ఇంద్రుడు. ౧౯ మూలకు- రాక్షసుడు. ౨౦ పూర్వాషాఢకు- జలము. ౨౧ ఉత్తరాషాఢకు-, విశ్వేదేవతులు. ౨౨ అభిజిత్తునకు-

బ్రహ్మ ౨౩. శ్రవణమునకు- విష్ణువు ౨౪ ధనిష్ఠకు- వసువులు. ౨౫ శతభిషమునకు- వరుణుడు. ౨౬ పూర్వాభాద్రకు- అజైకపాదుడు. ౨౭ ఉత్తరాభాద్రకు- అహిర్బుధ్న్యుడు. ౨౮ రేవతికి- పూషయను సూర్యుడు.

యోగములు- ౨౭ :—*విష్కంభము- ప్రీతి- ఆయుష్మాన్- సౌభాగ్య- శోభన *అతిగండ- సుకర్మ- ధృతి *శూల- *గండ- వృద్ధి- ధ్రువ- *వ్యాఘాత- హర్షణ- *వజ్రి- సిద్ధి- *వ్యతీపాత- వరియాన్- *పరిఘ- శివ- సిద్ధ- సాధ్య- శుభ- శుక్ల- బ్రహ్మ- ఐంద్రి- *వైధృతి.

తిథులును, తిథ్యధిపతులును; ౧ పాడ్యమికి-అగ్ని, ౨ విదియకు-బ్రహ్మ, ౩ తదియకు-పార్వతి, ౪ చవితికి-గణపతి, ౫ పంచమికి-సర్పములు, ౬ షష్ఠికి-కుమారస్వామి, ౭ సప్తమికి-రవి, ౮ అష్టమికి-శివుడు, ౯ నవమికి-వసువులు, ౧౦ దశమికి-దిగ్గజములు, ౧౧ ఏకాదశికి-ధర్ముడు, ౧౨ ద్వాదశికి-విష్ణువు, ౧౩ త్రయోదశికి-మన్మథుడు, ౧౪ చతుర్దశికి-కలి, ౧౫ పూర్ణిమకు-చంద్రుడు, ౧౬ అమావాస్యకు-పితృదేవతలు.

కరణములు:— ౧ బవ- ౨ బాలవ- ౩ కౌలవ- ౪ తైతుల- ౫ గరజి- ౬ వణజి- ౭ విష్టి (లేక) భద్ర, ౮ శకుని- ౯ చతుష్పాత్- ౧౦ నాగవ- ౧౧ కింస్తుఘ్నం- ఇందు బవ మొదలు విష్టివరకు నైన యేడును చరకరణములనియు; శకుని మొదలుకొని నాలుగును, స్థిరకరణములనియు జెప్పఁబడును- చరకరణములేడును ప్రతిమాసంబున శుక్లపక్షపాడ్యమియొక్క యుత్తరార్థము మొదలుకొని తిథియొక్కంటికి సమముగా రెండేసి కరణములు చొప్పున తిరిగి వచ్చుచుండును. తిథిముగియునప్పటికి రెండుకరణములును పూర్ణముగా ముగియును- శకుని మొదలగు స్థిరకరణములు నాల్గును బహుళచతుర్దశి యుత్తరార్థము మొదలుకొని శుద్ధపాడ్యమిపూర్వభాగాంతమువరకువచ్చుచుండును.

మేషాది రాసులును, తద్రూపములును:—౧ మేషము- మేక ౨ వృషభము- ఎద్దు- ౩ మిథునము-స్త్రీపురుషద్వయము- ౪ కర్కాటకము- పీత- ౫ సింహము- సింహము ౬ కన్య-పడుచు- ౭ తుల-త్రాసు- ౮ వృశ్చికము-తేలు- ౯ ధనుస్సు-విల్లు- ౧౦ మకరము మొసలి ౧౧ కుంభము- కడవ- ౧౨ మీనము- రెండు చేపలు.

వారములు:— ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, స్థిరవారము. ఆదిత్యాది ప్రతివారముయొక్క ప్రథమహోరకును, సూర్యుఁడు మొదలగువారు క్రమముగ నధిపతులగుటం బట్టి యాయా వారముల కాయా నామములు కలిగినవి. అనగా; యేవారమునాడు ఆవారాధిపతియొక్క హోర అసూర్యోదయముకు వచ్చును. హోర ౧ కి ౨½ గడియల చొ॥ ర, శు, బు, చ, శ, గు, కు హోరేశక్రమము.

---

*ఈమార్కుగలయోగములు తొమ్మిదియు దుష్టయోగములని యెఱుంగునది.

మాసలక్షణం:—శ్లో॥ దర్శావధింమాస ముశంతి చాంద్రం, సౌరంతథాభా
స్కరరాశిభోగాత్ । త్రింశద్దినం సావనసంజ్ఞమార్యా
నాక్షత్రమిందోర్భగణాశ్రయాచ్చ॥ జ్యోతిస్సారే॥

తా॥ దర్శ (అమావస్య) యొక్క అంతము మొదలు తిరుగా దర్శాంతము వరకును మధ్యనుండు కాలమొక చాంద్రమాసమనియు; ఒక రాశియందు సూర్యుడు సంచరించు కాలమొక సౌరమాసమనియు; ముప్పది ౩౦ సూర్యోదయములుగల కాలమొక సావన మాసమనియు; చంద్రుడు ౨౭ నక్షత్రములందు సంచరించు కాలము నాక్షత్రమాసమని యును చెప్పబడును. ఒక రాశియందు గురుడుండు కాలము బార్హస్పత్యమాసాబ్దమని చెప్పబడును.

వారపరత్వేన మాసఫలమాహ॥

శ్లో॥ పంచార్కవాసరేరోగాః, పంచభౌమే మహద్భయం
పంచార్కివారాద్దుర్భిక్షం, శేషవారాశ్శుభప్రదాః॥ జ్యో॥సా॥

తా॥ ఒక నెలలో ౫ ఆదివారములు వచ్చెనేని యా నెలలో రోగపీడలు గలిగి యుండును ౫ మంగళవారములు వచ్చెనేని గొప్ప భయముకలుగును. ౫ శనివారము లు వచ్చెనేని దుర్భిక్షముగ నుండును.

అథ అధిమాస నిర్ణయం, తత్సంభవజ్ఞానంచాహ.

శ్లో॥ ద్వాత్రింశద్భిర్గతైర్మాసై, ర్దినైష్షోడశభిస్తథా
ఘటికానాం చతుష్కేణ పతత్యేకోధిమాసకః॥ జ్యో॥ సా॥

తా॥ నెలలు ౩౨ దివసములు ౧౬ ఘడియలు ౪ అయినయెడల నొకయధికమాస ము పుట్టును ఇది మధ్యమ ప్రమాణముగాని స్ఫుటప్రమాణముగాదు స్ఫుటప్రమాణమువల్ల హెచ్చు తగ్గులు గలుగుచుండును. స్ఫుటప్రమాణము వల్ల అధిక మాసములు తిరుగుక్రమం బెట్లనిన;

శ్లో॥ దారు ౨౮ భోగ ౩౮ శిలా ౩౫ దారు ౨౮ భోగ ౩౮ భోగ ౩౮ శిలా ౩౫ స్తథా । స్పష్టాధిమాసాః క్రమశశ్చరేయురితి సమ్మతిః.

తా. స్ఫుటాధి మాసములు ఒకటితర్వాత నొకటి పైనజెప్పిన శ్లోకసంఖ్యాక్రి

ముము గా దిరుగుచుండును. అనగా అధిమాసను వచ్చినపిమ్మట 28 మాసములకు తిరు గా అధిమాసము వచ్చినప్పుడు దానితర్వాయిని ౩౪-౩౫-౨౮-౩౪-౩౪-౩౫ యాక్రి ముము గా దిరుగుచుండును.

ఉదా. శక ౧౭౭౯ అక్షయ సం॥ లో జ్యేష్ఠము అధికము గదా- పిమ్మట శుక్ల సం॥ వైశాఖము ౩౫ నెలలకు వచ్చెను. పిమ్మట ప్రజోత్పత్తి సం॥ భాద్రపదం ౨౮ నెలలకు వచ్చెను. పిమ్మట భావ సం॥ లో ఆషాఢము ౩౪ నెలలకు వచ్చెను. ఈలా గు క్రమము దెలియవలెను.

## ఫలానాసంవత్సరములో ఫలానామాస మధికము వచ్చునని తెలియుసాధనము.

శ్లో. శాకోఙ్కాశ్వ్యఖాగ్ని ౯౨౫ స్త్రీనస్స్వతిస్మృత్యా ౧౯ విభాజితః
తచ్ఛేషేత్రి ౩ శ ౧౧ ఖా (౦) ష్టా ౮ ష్టి ౧౬ శర ౫ నైత్రై ౨ మాః ధోర్మలః॥ శ్రీవిశ్వపతిః॥

తా. పూర్వము కాలపరిచ్ఛేదములో సాధింపబడిన ప్రకారము తనయిష్టసంవ త్సరమునకు శకముతెచ్చుకొని యందులో ౯౨౫ ను తీసివేసి యాశేషమును ౧౯ చే భాగింపగా వచ్చిన శేషమునుబట్టి యాసంవత్సరములో అమాసమధికమని తెలియవలెను. ఎట్లంటె; శేషము ౩ అయితె చైత్రమును ౧౧ అయితె వైశాఖమును [౦] అయితె జ్యేష్ఠమును ౮ అయితె ఆషాఢమును ౧౬ అయితె శ్రావణమును ౫ అయితె భాద్రపద మును ౨ అయితె ఆశ్వయుజమును అధికమాసములగును ఈశాస్త్రముచే నొకప్పుడు భే దముకలుగుటవలన స్ఫుటక్రమము చెప్పబడుచున్నది. ఈయధిమాన జ్ఞానోపాయమున కు షష్టి ఖండాంకము, షష్టిధ్రువాంకము అను రెండు ఉపకరణములను ముందుగా సా ధించి యుంచుకోవలయును.

షష్టిఖండాంకములు :—ప్రభవ మొదలు తారణవరకు [౦]-పార్థివ మొదలు మ న్మథవరకు ౧-దుర్ముఖి మొదలు విశ్వావసు వరకు ౨- పరాభవ మొదలు ఆనందవర కు ౩- రాక్షస మొదలు దుర్మతివరకు ౪-దుందుభి మొదలు అక్షయవరకు ౫.

షష్టిధ్రువాంకలక్షణము :—షష్టిధ్రువమనగా శకము ౧౭౭౯ మొదలు ౧౮౦౯ వరకును అయిన వర్తమానషష్టిలో ప్రభవాది అక్షయాంతమువరకునైన నఱువదిసంవత్సర ములలో (౮)యెనిమిదియున్ను గతషష్టిలో (౩) మూడున్ను భవిష్యత్ షష్టిలో (౧౩) ప దుమూడున్ను షష్టిధ్రువ మనబడును. గతషష్టిలలో ప్రతిషష్టికిని ౫ చొప్పన తీసివే

యుండు భవిష్యత్ వర్షములలో ప్రతివర్షమునకు ౫ చొప్పున చేర్చుకొనుచు నుండవలయును. గతమునందు, యిష్టవర్షములో ౫ చా॥ పోనియెడల ౩౦ దిని చేర్చుకొని మరితీసివేయు గా నైనది వర్షి ధ్రువమనబడును. భవిష్యత్ వర్షములలో ౫ చా॥ చేర్చుచుండగా ముప్పదికంటె మించనేని దానిని ౩౦ చే భాగింపగా మిగిలినశేషము వర్షిధ్రువ మన బడును.

శకే ౧౮౧౫ విజయనామ సంవత్సరే, అధిమాసోస్తివా ? నవా ?

అస్తిచే త్కోవామాస ఇతిశంకాయాం

కించి దుదాహ్రియతే॥

ఉదాహరణము. ఈవిజయసంవత్సరమునకు ౧ ఖండాంకము ౨ వర్షిధ్రువము సాధింప వలసియున్నది. ఈవిజయ సంవత్సరము, వర్షిఖండాంక వివరణములో జెప్పబడిన ప్రకారము పార్థివ మన్మథ సంవత్సరముల నడుమపడ్డదిగనుక యీసంవత్సరమునకు వర్షి ఖండాంకము ౧ అని తెలియవలెను. దీనికే గతపదకమని పేరు.

ఇకవర్షిధ్రువమనగా :—ఇప్పటి వర్తమానవర్షికి ధ్రువము ౮ ఇదియేవర్షి ధ్రువ మనబడును. ఈధ్రువములో ౦।౫౦ సగముగలుపగా సాధనవర్షధ్రువము ౮।౫౦ తొమ్మిదిన్నర. ఇదియే సాధనవర్షిధ్రువమనబడును. ఈగతపదకము, వర్షిధ్రువము అను రెండు సాధనములను బట్టి ఖాగ్నితష్టకశేషమనెడు సాధనమొకటి సాధింపవల సి యున్నది.

శ్లో. గతాబ్దేషు త్రిభాజ్యంచ శివ ౧౧ సంగుణశేషకం
వర్షిధ్రువం గతపదం మిళిత్వాఖాగ్నితష్టకం.

తా. తనయిష్టసంవత్సరమునకు ప్రభవాది లెక్కింపగా నెన్నియగునో యాసం ఖ్య నుంచుకొని అసంఖ్యలో నిశ్శేషముగా భాగింపదగినంత సంఖ్యనుతీసి త్రిభాజ్యమని యొకచోట వ్రాసియుంచి అత్రిభాజ్యసంఖ్యను తీసివేయగా మిగిలిన శేషమును ౧౧ చే గుణించి శివగుణశేషమని వ్రాసికొనునది. పిమ్మట అత్రిభాజ్యసంఖ్య, శివగుణశే షము, వర్షిధ్రువము, ఖండాంక మనెడు గతపదకము అను నీనాలుగుసంఖ్యలను మొ త్తముచేసి ఆమొత్తము ౩౦ కంటె నధికమయ్యేనేని అందులో ౩౦ తీసివేయగా శేష ము ఖాగ్నితష్టక మనబడును. దీనినిటులుండనిండు.

పైనచెప్పిన ఖాగ్నిశేషముతోడ, యీయధిమాస ధ్రువములలో యేధ్రువముగూ డి సాధనవర్షిధ్రువమును తీసివేయగా ౨ రెండు కంటె తక్కువగానుండునో ఆధ్రువ

సంబంధమానమే యధిమానమగును. ఇదినిశ్చయమైనది. సార్ధషష్టి ధ్రువమనగా షష్టిధ్రువములో ౦౹౦ సగము కలుపబడినది.

ఈ సంవత్సరమునం దధికమాసము వచ్చునా? రాదా? అను సంగతినిశ్చయించు సాధన మెట్లనిన:—పూర్వము వ్రాయబడియున్న కాలపరిచ్ఛేదమున నెం ౯ ఉ ఘారమున శుద్ధిధ్రువములు ౬౦ సంవత్సరములకును వ్రాయబడియున్నవి. వానిలో తన యిష్ట సంవత్సరమునకు జెప్పబడిన శుద్ధిధ్రువాంకము ౨౦ కంటె నధికమయ్యెనేని యా సంవత్సర మధికమాసము వచ్చునని చెప్పవలెను. శుద్ధిధ్రువము ౨౦ కంటె తక్కువయ్యెనేని యాసంవత్సరమం దధిమానము రాదని చెప్పవలెను.

అధిమాసధ్రువములు:—చైత్రమునకు ౮ వైశాఖమునకు ౧౦ జ్యేష్ఠమునకు ౧౨ ఆషాఢమునకు ౧౪- శ్రావణమునకు ౧౬- భాద్రపదమునకు ౧౮- ఆశ్వయుజమునకు ౨౦.

ఉదాహరణము. వెనుక యుదాహరించిన విజయ సంవత్సరమునకు గణితరీత్యా వెనుక నెం ౩౯-౪౦ రుల యుదాహరణములయందు వ్రాసియుంచిన ఖండాంకమనే గతపదము ౧-షష్టిధ్రువము ౮ సార్ధషష్టిధ్రువము ౮౹౦. ఇవిఇటులుండగా:—

ఇక భాగ్నితప్త శేషమున కుదాహరణము వ్రాయబడుచున్నది:—

ఈవిజయసం॥ మునకు ప్రభవాది గతాబ్దములు ౨౬- ఇందులో 3 టి చేత నిశ్శేషముగా భాగింపదగిన హెచ్చుసంఖ్య ౨౪ ఇది త్రిభాజ్యమనంబడును. పైగతాబ్దములు ౨౬ లో త్రిభాజ్యము ౨౪ ను తీసివేయగా శేషము ౨- ఇది ౧౧ చే గుణింపగానైనది ౨౨- ఇదిశివగుణశేషమనబడును. వెనుకటికాల పరిచ్ఛేదములో నెం ౯ ఘారము ప్రకారము ఈవిజయసంవత్సరమునకు వచ్చిన శుద్ధిధ్రువాంకము ౨౭- ఈశుద్ధి ధ్రువాంకము ౨౦ కంటె నధికమగుటచేత, ఈవిజయ సం॥ నందు అధిమాసము నిశ్చయముగ వచ్చునని చెప్పదగియున్నది.

ఇక నేమాన మధికముగ వచ్చుననిన:—పైనవ్రాసిన భాగ్నితప్తకశేషమున కుదాహరణము. శివగుణము ౨౨- షష్టధ్రువము ౮- ఖండాంకమను గతపదకము ౧- మొత్తము ౩౧- దీనిలో 30 దీసివేయగా నిల్చినశేషము ౨౧- ఇదియే భాగ్నితప్తక శేషమనబడును. ఈభాగ్నితప్తక శేషమున్ను ౨౦ కంటె నధికమయ్యెనేని యీసంవత్సరమే యధికమానము వచ్చునని చెప్పవలెను అప్రకారమే అధికము వచ్చినది. గనుక ఈవిజయ సంవత్సరములో నధికమానము వచ్చెనని చెప్పవలెను. ఇక నేమాన మధికమగునంటే:—

వెనుకటి ఖాన్లొ తప్తశేషము ౨౫- ఇందులో వెనుక అధిమాస ధ్రువములలో వ్రాసిన ప్రకారము ఆషాఢమునకు జెప్పబడిన ధ్రువము ౧౪ గు కూడగా నయినది ౩౯- దీనిలో ౩౦ తీసి వేయుగా శేషము ౯- ఇందులో సార్ధషష్టిధ్రువము ౬౪౦ తీసివేయగా సగమే యున్నది. శ్లో॥ మధ్యాద్వంయాత్రింశవ్యతే తత్రాధిమాసో విజ్ఞేయః॥ అనువచనము చేత ఆశేషము ౨ కంటె తక్కువైనది. గనుక ఆషాఢమాధిక మని చెప్పబడెను. ఎందుచేత నంటె:—ఆషాఢమాస ధ్రువము కలుపుట చేత ఆషాఢమే యధికమని చెప్పదగినది. అనగా అధిమాస ధ్రువములలో నేమాసము తాలూకు ధ్రువముకూడి చేయబడునో ఆమాసమే యధికమగును.

—అథ అధిక్షయ మాసయోర్నిరూపణం.—

ఇక అధికమాస క్షయమాసముల లక్షణములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ అసంక్రాంతిమాసోధిమాస స్ఫుటస్యా
ద్విసంక్రాంతి మాసః క్షయాఖ్యః కదాచిత్
క్షయః కార్తికాది త్రియే నాన్యథా స్యా
త్తదా వర్షమధ్యే ఽధిమాస ద్వయంచ॥ ఇతిసిద్ధాంతశిరోమణౌ.

తా॥ వెనుక నం ౩౫ రు శ్లోక ప్రకారమే చాంద్రమాస మధ్యంబు రవిసంక్రమణ ప్రవేశము లేకుండునో అదియే అధికమాస మనబడును. అట్లె యే చాంద్రమాస మధ్యమున రెండు సంక్రమణము లిమిడి యుండునో అమాసము క్షయ లేక లుప్తమాసమనబడును. మొదటిదియగు అధికమాసము చైత్రాది ఆశ్వయుజము వరకు నైన ౭ నెలలలోనే వచ్చును. కాని పైనెలలలో రాదు. శ్లో॥ చైత్రాద్యాశ్వయుజాంతేషు అధిమాసాః ప్రకీర్తితాః। క్షయో నాధిమాసస్యా న్మాఘోవై పరికీర్తితః॥ ఇతి నిర్ణయసింధౌ॥ అనుట వలన క్షయమాసము కార్తిక మార్గశిర పౌషములు అను నీ మూడు నెలలలోనే వచ్చును గాని మిగిలిన నెలలలో రాదు. ఈక్షయమాసము వచ్చు సంవత్సరములో రెండధిక మాసములు వచ్చును. ఆరెంటిలో నొక్కటి క్షయమాసమునకు బూర్వమునను రెండవది తత్సరముదునను వచ్చును. ఈలుప్తమాసము చిరకాలమునకొకసారివచ్చును. గాని తరుచుగ రాదు. మాఘము లుప్తముగాగాని అధికముగాగాని యెన్నడును రాదు.

—అథ తిథివిభాగః.—

శ్లో॥ నందా భద్రా జయా రిక్తా పూర్ణాచ తిథయః క్రమాత్॥

పర్వతిథయః— కృష్ణాష్టమీ చతుర్దశ్యౌ హ్యమావాస్యా చ పూర్ణిమా ।
సంక్రాంతిః పర్వతిథయ శ్శుభకార్యేషునిందితాః॥
పక్షచ్ఛిద్రాః—చతుర్దశీ చతుర్థీచ అష్టమీ నవమీతథా । షష్ఠీచ ద్వాదశీచైవ పక్షచ్ఛిద్రాహ్వయాస్మృతాః॥ క్రమాదేతాసుతిథిషు వర్జనీయాశ్చనాడికాః ।భూతా ౫ ష్ట ౮ మను ౧౪ తత్త్వాం ౨౫ ౪ ౯ దశ ౧౦ శేషాస్తు శోభనాః॥

అథ నిత్యనక్షత్రపరిజ్ఞానమ్

శ్లో॥ ద్వినిఘ్న మాసస్తిథియుగ్వ్యేఘూనో భశేషితస్స్యా దుపశేషసంఖ్యా॥

తా॥ తాను ఏతిథినాటి నక్షత్రము తెలిసికొనదలచునో ఆనెలకు గతించిన చైత్రాదిమాసములను పెట్టుకొని ఆసంఖ్యను రెట్టించి ఆనెలలోశుద్ధ ౧ మొదలు తనయిష్టతిథి నాటి కైనతిథులను కూడి అందులోనొకటితీసివేసి ౨౭ చే భాగింపగా నెంతమిగులునో ఆసంఖ్యను అశ్విని మొదలుగ లెక్కించిన నిత్యనక్షత్రము వచ్చును-

ఉదా॥ శకే ౧౮౧౪ నందనసంవత్సరఅశ్వయుజ శు ౧౫ గురువారమున పంచాంగములో రేవతీ నక్షత్రము ౪౫ ఘడియ లున్నది- ఈదినమున నిత్యనక్షత్రము తేవలెను గనుకయీ ఆశ్వయుజమునకు చైత్రాదిగతమాసములు ౬- దీనిని ౨చే గుణింపగా ౧౨- ఇందులో యీనెల తొలూకు తిథులు ౧౫ కూడగా ౨౭- ఇందులో ౧ తీసివేయగా ౨౬- ఇది ౨౭ చే భాగింపబడదు- శేషమే ౨౬ గనుక నేడు అశ్విన్యాది ౨౬ నక్షత్రములు గతమై ౨౭ వదియగు రేవతియే సరిగావచ్చినది-

అథ యోగ సాధన మాహ

శ్లో॥ వాక్పతే రర్కనక్షత్రం శ్రవణాచ్చాంద్రభంతథా ।
గణయేత్తద్యుతిం కుర్యా, ద్యోగస్స్యాద్వృక్ష ౨౭ శేషతః॥

తా॥ ఏదినముయోగము తనకు కావలసి యుండునో నాటికి సూర్యుడున్న నక్షత్రము, పుష్యమి మొదలుగ నెన్నవది యగునో అంతిసంఖ్య రవిసంఖ్య యనబడును- అది యటుండనిచ్చి పిదప ఆరోజు నిత్యనక్షత్రము శ్రవణము మొదలుగ నెన్నవదియగునో అంతసంఖ్యను చంద్రసంఖ్యయని వ్రాసికొననది- ఇటుల వ్రాసికొన్న రవి చంద్రసంఖ్యల రెంటినిగూడి ౨౭ చే భాగింపగా శేషమెంతయుండునో విష్కంభాది అన్నవయోగము ఆదినమున నగునని తాత్పర్యము.

ఉదా॥ శకే ౧౮౨౪ వంపనవం॥ ఆశ్వయుజ శు ౧౫ గురువారమునాడు యోగసాధనము చేయువలసి పంచాంగముచూడగా సూర్యుడు హస్తానక్షత్రమందున్నాడు; చంద్రుడు రేవతి యందున్నాడు- గనుక పుష్యమి మొదలుగ రవియున్న హస్త వరకు నెంచగా ౬ ఐనది. శ్రవణము మొదలుగ చంద్రుడున్న నిత్యనక్షత్రమగు రేవతి వరకు నెంచగా ౬ ఐనది- రవిచంద్రసంఖ్యలు రెండును కూడగా ౧౨ ఐనవి. ఇది ౨౭ చే భాగింపబడదు గనుక శేషము ౧౨ ఆయెను- గనుక విష్కంభనామయోగము మొదలు ౧౨ వది ధృవనామయోగము వచ్చినది- నేడు పంచాంగలో నున్నూ ధ్రువనామ యోగమే యున్నది, కాబట్టి యోగము సరిగానే వచ్చినది-

—•◆ అథకరణసాధనంచాహ. ◆•—

శ్లో॥ గతాస్తు తిథయో ద్విఘ్నా స్సప్తభక్తావశేషకం
పూర్వార్ధేకరణం తత్స్యాత్తత్త్వైకం త్వపరేదళే
కృష్ణభూతదినాంత్యార్ధే శకునిర్దర్శఖండయో:
చతుష్పాన్నాగవం చైవకింస్తుఘ్నం ప్రతిపద్దళే॥
ద్వితీయపాదేప్రతిపద్బవాది కరణం మతం॥

తా॥ శుక్లప్రతిపత్తు మొదలుకొనిగయినతిథులను రెండింట గుణించి యేడింటభాగింపగా మిగిలినశేషము ఎంతయుండునో అన్నవ చరకరణము తన యిష్టతిథి పూర్వార్థమున వచ్చును దానితర్వాతి కరణము దానియుత్తరార్థమున వచ్చును. బహుళచతుర్దశి యుత్తరార్థమున శకునియు, అమావాస్య పూర్వోత్తరార్థములయందు చతుష్పాన్నాగవంబులును, శుక్లప్రతిపత్పూర్వార్థమునందు కింస్తుఘ్నంబును, సర్వదా వచ్చుచుండును. ప్రతిపద్ద్వితీయార్థము మొదలుకొని బవాది చరకరణము లేడును తిరుగుచుండును.



శ్రీరస్తు.

శ్రీమదాంధ్రతాత్పర్యోదాహరణసహితే

# దైవజ్ఞకర్ణామృతే

పూర్వభాగే మిశ్రఫలబిందౌ

గోచరపరిచ్ఛేదే అవకహడచక్రప్రకరణమ్.

సకలశాస్త్రములలో జ్యోతిషము ప్రత్యక్షశాస్త్రము. ఈశాస్త్రమంతయును నక్షత్రము లాధారములై యున్నవి. జాతకముహూర్తగోచరాదులందు నక్షత్రాధారము వల్లనే ఫలపరిజ్ఞానము గలుగుచున్నది. జన్మనక్షత్రమువల్ల రాశిజ్ఞానము, రాశివలన గ్రహస్థితి అందువలన శుభాశుభజ్ఞానమును గలుగుచున్నదిగదా. ఇట్టి జన్మనక్షత్రములేనివారికి నామనక్షత్రమావశ్యకము- నామనక్షత్రవివేకముకొరకై యీశ్వరుని యానతివల్ల అవకహడచక్రము పుట్టినది. దానివలన సకలనక్షత్రములును ప్రస్తరింపఁబడినవి. రుద్రయామిళమునందు దీని విషయమై నందికేశుండు పార్వతీరమణుని యుపదేశముచే నందువిషయమై విస్తరించినదానివలన గోచరప్రకరణమును లోకమునందు వ్యాపింపఁజేసినట్లు పెద్దలుచెప్పుచున్నారు, కావున నయ్యది యిందు వివరింపబడియె.

—అవకహడచక్రోత్పత్తి.—

శ్లో॥ ప్రదోషకాలే శశిశేఖరస్యనాట్యోత్సవే తత్పదభూషణస్య
శిలాతలస్యాపిచ యోగజాని చత్వారిసూత్రాణిశివాజ్ఞయైవ.

తా॥ పూర్వము శివుఁడొకనాఁడు నాట్యము చేయుచుండగా ఆదేవదేవుని కాలియందె యొకటిజారి ఆశిలాతలమునంబడితూలి నాలుగావృత్తు లెగిరిక్రిందబడుటం జేసినాలుగావృత్తులకును నాలుగుసూత్రములు శ్రీశివుని సంకల్పమువలనం బుట్టెను. ఆనాలుగుసూత్రములు నందికేశ్వరుం డాలించి వానియర్థావబోధకొరకీశ్వరుని చెంతకేగి నమస్కరించి ఓస్వామీ! ఇపుడు దేవరవారి పాదమంజీరభవంబగు సూత్రచతుష్టయంబున కర్థంబేమని యడుగ నమ్మహేశుం డనుగ్రహించి నందికేశున కిట్లు చెప్పందొడంగెను.

సూత్రములు:—— ౧ అవకహడ- ౨ మటపరత- ౩ నయభజఖ- ౪ గసదచల. ఈనాలుగు శివసూత్రములవలన అభిజిత్సహితంబుగ ౨౮ నక్షత్రములును ౧౧౨ పాదములును ప్రస్తరింపబడెను.

## అవకహాడ చక్రోద్ధారము

శ్లో॥ ఏకైకమక్షరం త్యక్త్వా తస్మిన్ పంచస్వరాన్ క్రమాత్॥
అఈఊఏఓ ఇతిచ యోజయేద్ద్వైవ విత్సుధీః॥
చత్వారాణాం భస్య పాదానాం చతురశ్చ పునఃపునః॥
ప్రక్షిప్తవర్ణాః॥ శ్లో॥ ఘజఛారౌద్రభేవింద్యాత్ షణఠాహస్తభేపిచ
ధ భ ఢా పూర్వాషాఢాయాం శ ఝ థా భాద్ర ఉత్తరే॥ ఇతి॥

తా॥ వెనుకటి అవకహాడాది సూత్రములలో సూ॥ ౧కి అక్షరములు ౫ చొ॥ సూత్రములు ౪ కి అయిన అక్షరములు ౨౦ కి అక్షరము ౧కి అ. ఈ- ఊ- ఏ- ఓ- అను అయిదు అచ్చులను చేర్చుచురాగా ౨౦ అక్షరములకు ఇరవై ఐదులు నూరు వర్ణములయ్యె. అందు మొదటినుండియు ౪ గేసివర్ణముల కొక్కొక నక్షత్రము చొ॥ కృత్తిక మొదలుగా పంచిపెట్టుచురాగా నక్షత్రములేర్పడును- నక్షత్రము ౧కి పాదములు నాలుగు గనుక నక్షత్రము ౧కి వర్ణములును నాలుగేర్పడియె. అనగా ౧వ అక్షరమునకు ప్రథమపాదము, ౨వ అక్షరమునకు ద్వితీయపాదము- మూడవఅక్షరమునకు తృతీయపాదము ౪ వ అక్షరమునకు చతుర్థపాదము- అని తెలియవలెను. నక్షత్రములకు కృత్తికయె మొదలుగనుక కృత్తికాదిగా గ్రహించినాడు.- కృత్తికయె నక్షత్రములకాదియని శ్రుతిస్మృతులు పలుకుచున్నవి-

రాసులలో మొదటిదగు మేషమునకు అశ్వినీనక్షత్రమాదియగుటంజేసి అశ్వన్యాదిగవ్యవహరించుచున్నారు. కాని కృత్తిక మొదటిదైనటుల ననేకహేతువులున్నవి. మరియుపంచశలాక, సప్తశలాక, సర్వతోభద్ర మొదలగు చక్రములయందును కృత్తికాదిగానె చెప్పబడియున్నది. గనుక నిచట కృత్తిక మొదలుగ బుచ్చుకొనబడియె. సూత్రములు ౪కి వర్ణములు ౨౦- ఆ ౨౦కి ప్రత్యేకముగా ఐదేసిఅచ్చులను జేర్చుటవలన ౧౦౦ వర్ణము లైనవి గదా. అశ్వన్యాది నక్షత్రములు ౨౮ కి నక్షత్రము ౧కి నాలుగేసి పాదములచొ॥ అయిన పాదములు ౧౧౨- పైసూత్రాక్షరకల్పన వల్ల ౧౦౦ వర్ణములే యగును- అందుకు ౧౨ వర్ణములు తక్కువవచ్చినవి- కాబట్టి ఘ-ఙ-ఛ- ప్రభృతివర్ణములు ౧౨టిని ప్రక్షిప్తములుగా దెచ్చి మధ్యమధ్య చేర్చినారు- అవి యెట్లంటే:—

ఘ- ఙ- ఛ- ఈ౩టిని ఆర్ద్ర ౨, ౩, ౪ పాదముల యందును,
ష- ణ- ఠ- ఈమూటిని హస్త ౨, ౩, ౪ పా॥ యందును,

ధ- ఫ- ఢ- ఈ3టిని పూర్వాషాఢ ౨, ౩, ౪ పాదములయందును,
థ- ఝ-ఞ- ఈ3టిని ఉత్తరాషాఢ ౨, ౩, ౪ పాదములయందును, చేర్పబడినవి-
ఈలాగున ౧౨ వర్ణములను మూడుచోట్ల చేర్చికొని ప్రస్తారము పూర్ణముగ నగును.

# అవకహడచక్రము.

## అవకహడాదిసూత్రములు.

| ౧ సూత్రము. | | | | | ౨ సూత్రము. | | | | | ౩ సూత్రము. | | | | | ౪ సూత్రము. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | వ | క | హ | డ | మ | ట | ప | ర | త | న | య | బ | జ | ఖ | గ | స | ద | చ | ల |
| ఆ | వా | కా | హా | డా | మా | టా | పా | రా | తా | నా | యా | బా | జా | ఖా | గా | సా | దా | చా | లా |
| ఈ | వీ | కీ | హీ | డీ | మీ | టీ | పీ | రీ | తీ | నీ | యీ | బీ | జీ | ఖీ | గీ | సీ | దీ | చీ | లీ |
| ఊ | వూ | కూ | హూ | డూ | మూ | టూ | పూ | రూ | తూ | నూ | యూ | బూ | జూ | ఖూ | గూ | సూ | దూ | చూ | లూ |
| ఏ | వే | కే | హే | డే | మే | టే | పే | రే | తే | నే | యే | బే | జే | ఖే | గే | సే | దే | చే | లే |
| ఓ | వో | కో | హో | డో | మో | టో | పో | రో | తో | నో | యో | బో | జో | ఖో | గో | సో | దో | చో | లో |

ఇది అవకహడ మొదలగు నాలుగు సూత్రముల మీదను చేయబడిన పంచస్వర కల్పనయని యెఱుంగునది.

ఈవర్ణములవలన నక్షత్రముల యేర్పరచవలెను గనుక యీచక్రమందలి మొదట చెప్పబడిన (అ) అనుదానిక్రింద అ. ఇ. ఉ. ఏ. ఓ. అని ౫ అచ్చులు వ్రాయఁబడి యున్నవిగదా. అందులో మొదటివగు అ. ఇ. ఉ. ఏ. యీ ౪ గును జేరికృత్తికా నక్షత్రమయినది. యీ ౪ గున్ను కృత్తికకు పోగా యిక మొదటిచాలులో ఓ. అనే యొక్కటి మాత్రము మిగిలిపోయెను. ఆమిగిలిన ఓఅనుదానిని రోహిణీ నక్షత్రముయొక్క ప్రథమచరణమునందు వుంచితిమి. పిమ్మటచక్రములో రెండవచాలులోనున్న (వ) అనే దాని క్రిందను నిలువుపంక్తిగా నున్న వా- వి- వు- వే- వో। అనే ౫ టిలో వనుక రోహిణియొక్క తర్వాయిపాదములు ౩ కిన్ని మూటిని తీసికొని రోహిణియందుంచగా ఓ- వా- వి- వు- రోహిణీయని యేర్పడెను; ఇక వకారకల్పనలోనూ వా- వి- వు- అనే ౩ న్ను రోహిణికి వెళ్లిపోగా వే- వో- అనే రెండును మిగిలినవి. యీ రెండును మృగశిరకు దీసికోగా మృగశిరా ౧- ౨ పాదములు యేర్పడెను. ఇట్లు యేర్పడగా వే- వో- అని యైనది. ఇక ౩ వ యక్షరమగు (క) కారము యొక్కకల్పనయగు కా- కి- కు- కే- కో- యీయైదింటిలో మొదటివగు కా- కి- అనే రెండును దీసి మృగశిరతర్వాయి పాదములగు ౩-౪ ములయం దుంచగా వే- వో- కా- కి- మృగశిర. అని యేర్పడును. ఇక కవర్ణకల్పనలోనూ బాకీ వర్ణములగు కు- కే- కో అనేవానిలో మొదటిదగు కు అను దాని ఆర్ద్రా ౧ పాదమందుంచి వెనుక చెప్పిన ప్రకారం " ఘ- ఙ- ఛ- రౌద్ర క్షేవిద్యాత్ " అనే ప్రక్షిప్తవర్ణములు ౩ టిని ఆర్ద్రా ౨- ౩- ౪-పాదములందుంచగా కు- ఘ- ఙ- ఛ ఆర్ద్రా అని యేర్పడెను. యీ ప్రకారము ప్రతినక్షత్రమునమునకు ను ౪ గేసి అక్షరముల చొ॥ తీసుకొని ప్రస్తరించుచు ఆర్ద్రా, హస్త, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర యీనక్షత్రముల విన్యాసమందుమాత్రము ఘ- ఙ- ఛ- మొదలగు ప్రక్షిప్త వర్ణములం జేర్చుచు రాగా అశ్విన్యాది అభిజిత్సహితముగ ౨౮ నక్షత్రములును ౧౧౨ పాదములును ఏర్పడును. పిమ్మట నామనక్షత్రములను సులభముగా దెలిసికొనవచ్చును.

ఇక నామనక్షత్రవివేకమునకు ఉదాహరణము.

కూర్మన్న అనే పృచ్ఛకుడు వచ్చి గోచారఫల మడిగెను. ఈతని నామాద్యక్షరము- కూ- గనుక పైనచెప్పినప్రకారము కు- ఘ- ఙ- ఛ- ఆర్ద్రా- అని యేర్పడుటచేత ఆర్ద్రానామనక్షత్రము అని చెప్పతగియున్నది. మరియు, నాలుగక్షరములలో మొదటిది యగుటచేత ఆర్ద్రా ౧ చరణమని చెప్పవలయును. యీచక్రోద్ధారము కృత్తికాదిగా చెప్పబడినను లోకవ్యవహారార్థము అశ్విన్యాదిగా నిచట వ్రాయఁబడినది.

# నక్షత్రరాశ్యంశవిభాగః

## అవకహడచక్ర విన్యాసము.

ఈక్రింద జూపించిన ౧, ౨, ౩, ౪, అంకెలు గల చోట్లు నక్షత్రముల పాదములు- వాని ప్రక్కనున్న అశ్విన్యాదులు వాని కగు నక్షత్రములు:-

| ౧ | ౨ | ౩ | ౪ | | ౧ | ౨ | ౩ | ౪ | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | లా | అశ్విని | రూ | రే | రో | తా | స్వాతి |
| లీ | లూ | లే | లో | భరణి | తీ | తూ | తే | తో | విశాఖ |
| అ | ఇ | ఉ | ఏ | కృత్తికా | నా | నీ | నూ | నే | అనూరాధ |
| ఓ | వా | వీ | వూ | రోహిణి | నో | యా | యీ | యూ | జ్యేష్ఠ |
| వే | వో | కా | కీ | మృగశిర | యే | యో | భా | భీ | మూలా |
| కూ | ఘ | ఙ | ఛ | ఆర్ద్ర | భూ | ధ | ఫ | ఢ | పూషాఢ |
| కే | కో | హా | హీ | పునర్వసుః | భే | భో | జా | జీ | ఉ॥షాఢ |
| హూ | హే | హో | డా | పుష్యమి | జూ | జే | జో | ఖా | అభిజిత్ |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష | ఖీ | ఖూ | ఖే | ఖో | శ్రవణం |
| మా | మీ | మూ | మే | మఘ | గా | గీ | గూ | గే | ధనిష్ఠ |
| మో | టా | టీ | టూ | పుబ్బ | గో | సా | సీ | సూ | శతభిషం |
| టే | టో | పా | పీ | ఉత్తరా | సే | సో | దా | దీ | పూర్వాభాద్ర |
| పూ | ష | ణ | ఠ | హస్త | దూ | శం | ఝ | థ | ఉ॥ భాద్ర |
| పే | పో | రా | రీ | చిత్త | దే | దో | చా | చీ | రేవతి. |

## నక్షత్రములకు రాశ్యంశ విభాగము.

అభిజిత్తను నక్షత్రము ౨౮ నక్షత్రములలో నంతర్లాపిగానుండి ఉత్తరాషాఢా శ్రవణములకు నడుమనున్నది. గనుక యీవిషయమై ౨౭ నక్షత్రములగానే గ్రంథకర్త అంగీకరించినారు. ప్రతినక్షత్రమునకును ౪ గేసి పాదముల చొప్పున ౨౭ నక్షత్రములకుఅయ్యె మొత్తము ౧౦౮ పాదములకును ౧౨ రాసులు పర్యాయముగనుక ౧౦౮ పాదములను ౧౨ రాసులమీద పంచిపెట్టగా రాశి ౧ కి ౯ పాదములువచ్చినవి. అనగా ౯ పాదములకొక రాశియని తాత్పర్యము. ఈప్రకారముపంచగా అశ్వనీయొక్క ౪ పాదములును, భరణియొక్క ౪ పాదములును, కృత్తికయొక్క మొదటిపాదమును కలసి ౯ పాదములుగనుకనే 'అశ్విని, భరణి, కృత్తికా పాదం మేషం' అని పెద్దలు చెప్పుచున్నారు. ఈలాగునసే కృత్తికయొక్క శేషపాదములు ౩ న్ను రోహిణియొక్క ౪ పాదములును, మృగశిరయొక్క ౧-౨ పాదములు ౨ ను కలసి అయిన ౯ పాదములకును వృషభరాశిగనుకనే 'కృత్తికాత్రయం రోహిణీ మృగశిరార్ధం వృషభం'

అని చెప్పమన్నారు. యీప్రకారము క్రమముగా ౯ పాదములకు ఒక్కొక్క రాశి చొ॥ ౧౨ రాసులును గ్రహించునది యీలాగేర్పడినవానిని బాలబోధకొరకు వ్రాయబడు చున్నవి.

౧ అశ్వని భరణి కృత్తికా పాదం మేషం.
౨ కృత్తికాత్రియా రోహిణి మృగశిరార్ధం వృషభం.
౩ మృగశిరార్ధం ఆర్ద్రపునర్వసోస్త్రయా మిధునం.
౪ పునర్వసోః పాదం పుష్యమ్యా శ్రిషాంతం కర్కటం.
౫ మఘ పుబ్బ ఉత్తరాపాదం సింహం.
౬ ఉత్తరాత్రియా హస్తచిత్రార్ధం కన్యా.
౭ చిత్రార్ధం స్వాతి విశాఖాత్రియస్తులా.
౮ విశాఖాపాదమనూరాధా జ్యేష్ఠాంతం వృశ్చికం.
౯ మూల పూర్వాషాఢోత్తరాషాఢా పాదంధనుః.
౧౦ ఉత్తరాషాఢాత్రియ శ్రవణ ధనిష్ఠార్ధం మకరం.
౧౧ ధనిష్ఠార్ధం శతభిష పూర్వభాద్రాత్రయాః కుంభం.
౧౨ పూర్వాభాద్రాపాదం ఉత్తరాభాద్రా రేవత్యంతం మీనం.

ఈలాగు నక్షత్రములమీద రాసుల నేర్పరచెను. గనుక తన యిష్టనక్షత్రముగాని జన్మనక్షత్రముగాని, నామనక్షత్రముగాని యేదో, యేపాదమో, దానికి పైనవ్రాసిన ప్రకారము ఏరాశియగునో అదియే అతనికి జన్మరాశి యనబడును. యీలాగుననే గ్రహస్థితి రాసులు తెలుసుకొనవలెను.

ఉదా. పైయుదహరణములో కూర్చున్న అనువానికి ఆర్ద్రనామ నక్షత్రము యున్నది. ఆయార్ద్ర పైవ్రాసిన రాశి విభాగములో మిధునరాశిలో బడెను గనుక జన్మరాశినిగాని నామరాశినిగాని మిధునమని చెప్పబడును. యీలాగుననే ఆర్ద్రాజన్మ నక్షత్రము వారికినిగూడ చెప్పవలెను. ఇక నక్షత్రపాదములవలన జాతక మహాదశాంతర్దశల్లఘ్నుండు నవాంశములను సులభముగా నేర్పరచువిధి చెప్పబడుచున్నది.

శ్లో॥ అశ్వన్యాదిగతక్షాణి, చతుర్భిర్గుణయేత్తతః
రవి ౧౨ తష్టంతుయచ్ఛేషం తన్మేషాదేర్నవాంశకం.

తా. తనయిష్టనక్షత్రమువరకు అశ్వని మొదలుగా గణించిన నక్షత్రములసంఖ్య ౪ చే గుణించి అందులో తనయిష్ట నక్షత్రములో యున్న నపాదమో అంతసంఖ్యనుకూడి ౧౨ చే భాగింపగా మిగిలిన శేషము మేషాదియగునో మేషాదిఅన్నవాని పేరుగల నవాంశమగును.

ఉదా. పుష్యమీ ౩ చరణమందు దేవదత్తుడు జననమాయెను. అప్పుడు చంద్రుడు పుష్యమీనక్షత్ర ౩ పాదమందున్నాడుగనుక చంద్రుడు, ఏనవాంశమందున్నాడని చూడగా; యీపుష్యమి వరకు అశ్వని మొదలుకొని అయిన గతనక్షత్రసంఖ్య ౭ దీనిని ౪ చే గుణింపగా ౨౮ ఇందులో వర్తమాన పుష్యమీ నక్షత్రముయొక్క ౩ పాదములున్నా కూడగా ౩౧ ఇది అశ్వని ప్రథమపాదము మొదలు జన్మకాల పుష్యమీ ౩ పాదాంత్యమువరకు అయిన పాదముల మొత్తము సంఖ్య ఆయెను. గనుక యీ సంఖ్య ౩౧ ని ౧౨ చే భాగింపగా ౭ యేడు మిగిలినది. గనుక మేషము మొదలుకొని లెక్కింపగా యేడవది తుల అయినది గనుక యీ పుష్యమీ ౩ వ పాదమునను తులానవాంశ అయెను గనుక చంద్రుడు తులానవాంశయందున్నాడని వ్రాసికొనవలయును.

ఈప్రకారమే జన్మనామ నక్షత్రములనుగాని ఆయానక్షత్రములందున్న రవ్యాదిగ్రహములనుగాని నవాంశనిర్ణయము జేసికొనవలయును.

ఈనవాంశనిర్ణయమునకు ఇంకొకవిధము జెప్పుచున్నాడు. ఎట్లనగా; అశ్వని మొదలు పుష్యమివరకు గత నక్షత్రములు ౭ ఇది ౩ చే భాగింపగా శేషము ౧ ఇది ౪ చే గుణింపగా ౪ అయినది. ఇందులో పుష్యమియొక్క ఇష్టపాదములు ౩ కూడగా ౭ అయెను గనుక వెనుకటివలెనే మేషాది ౭ వది తులానవాంశమని యెరుగవలయు.

షరా. నవాంశాది విభాగములను దెలియుటకై యీ జ్యోతిశ్శాస్త్రము చక్రపరిచ్ఛేదమున జూచుకొనవలయును.



## బహువిధగోచర ప్రకరణం.

ఎవరియొక్క జన్మనామనక్షత్రముల కేరాశి యగునో ఆరాశియే వారిజన్మరాశి లేక నామరాశి యనబడును. అట్టిజన్మ, లేక నామరాశి మొదలు ౧౨ స్థానములలోనే స్థానమం దేగ్రహముండునో ఆస్థానమునందా గ్రహమునకు నీదిగువున వ్రాయబడిన శ్లోకముల ప్రకారమాయాఫలములం దెలిసికొనవలయును.

### గోచారవిషయమై ప్రత్యేకఫలములు.

రవేః॥ శ్లో. స్థానభ్రష్టం- భయం- సంపత్- స్సానభంగం- మహద్భయం
శత్రుక్షయం- వ్యథాం- రోగం- దుఃఖం- సిద్ధిం- ధనా ధనే
క్రమేణజన్మరాశ్యాది కురుతే పద్మబాంధవః॥ ౧॥

చంద్రస్య॥ శ్లో॥ అన్నవృద్ధిం- ధనక్షీణం- ద్రవ్యలాభం-మహద్భుజం
కార్యనాశంచ- విత్తంచ- ధనలాభంచ- మారణం॥
నృపవైరం- సుఖం- లాభం- ధనహానిం- నిశాకరః ॥౨॥

కుజస్య॥ శ్లో॥ ఖేదం- దౌర్భాగ్య- సౌభాగ్యే- రిపుపీడాం- రిపోర్భయం
అర్థసిద్ధి- మనర్థంచ- శస్త్రపీడాం-ధనక్షయం
అశోకంచ- ధనం- క్రూరం- క్రమేణకురుతేకుజః. ౩

బుధస్య॥ శ్లో॥ బంధనం- హేమ లాభంచ- శత్రుపీడాం- రిపుక్షయం
దారిద్ర్యం- భూషణం- లాభం- మనస్సిద్ధిం- ధనక్షయం
ప్రమోదం- మోద- సంహారౌ- క్రమేణ కురుతేబుధః. ౪

గురోః॥ శ్లో॥ దేశత్యాగం విత్తలాభ- మనర్థం- ధననాశనం
సంపదం- క్లేశ- మారోగ్యం- ధనహానిం- ధనాగమం
పీడనం- లాభ- నష్టేచ- క్రమేణకురుతేగురుః. ౫

శుక్రస్య॥ శ్లో॥ ఆరోగ్యం- భూషణం- లాభం- రతించ-ప్రియదర్శనం
మానహానిం- మహాపీడాం- భూలాభం- ధాన్యకుట్టణం
సంతోషంచైవ విత్తంచ- ప్రమోదం- కురుతేకవిః ౬

శని ః॥ శ్లో॥ విపత్తి- హాని- సంపత్తిః- కుక్షిరోగం- సుత క్షయం
లక్ష్మీకరమహాదైన్యం మరణం దేహాశోషణం
బంధనం- లాభ- నష్టేచ- క్రమేణ కురుతేశనిః. ౭

రాహోః కేతోశ్చ శ్లో॥ భయంచ-కలహం-భాగ్యం-మానహానిధనక్షయం
సౌఖ్యం- శత్రుభయం- చౌర్యం శత్రువృద్ధిం- ధనక్షయం
శత్రునాశం ఋణంచైవ- కుర్యాదేవం తమోధ్వజౌ. ౮

ఈగోచారశ్లోకములకు అర్థతాత్పర్యము లేమింజేసియు, ప్రతిపదమునకును గీతలు గీచి పదవిభాగముందెలియజేసి యుండుటంబట్టియు వేరటీకా తాత్పర్యములు వ్రాయబడవయ్యె. ఏకాదశస్థానమందు రవ్యాదులందరును మంచివారేగనుక పయిశ్లోకములం దందరికిని శుభఫలమే వ్రాయబడెను పయినజెప్పిన శ్లోకములలో గ్రహములకు కొన్ని స్థానములందు శుభఫలమును కొన్నిటియందశుభఫలమును జెప్పబడెను. అయిన నొకప్పుడు గ్రహములకు మంచి స్థానమందు దుష్టఫలమును, దుష్టస్థానమందు మంచిఫలమును జ

యగును అట్టివ్యత్యయము వేధావశముచేత జరుగునుగాబట్టి జ్యోతిష్కుడు చక్కగా శ్రీ ఫలంగని పెట్టి మరిచెప్పవలెను. వేధాపరిశీలనజేయక గోచారఫలముంజెప్పవా దివహాస్య ముం బొందుదురు గావునవేధాపరిజ్ఞానం బత్యావశ్యకంబు.



వేధలు రెండువిధములు. రాశివేధలు, నక్షత్రవేధలుఅని, అందుముందుగా రాశి వేధాప్రకరణము చెప్పబడుచున్నది.

రవేః:—శ్లో. లాభ ౧౧వి క్రమ ౩ ఖ ౧౦ శత్రు ౬ షు సిత, శ్శోభ నోనిగదితో దివాకరః

ఖేచరైస్సుత ౫ తపో ౯ జలాం ౪ త్య ౧౨ గైర్వ్యాక్కభీర్యది స విధ్యతే తథా. ౧

చంద్రస్య :—శ్లో. ద్యూన ౭ జన్మ ౧ రిపు ౬ లాభ ౧౧ ఖ ౧౦ త్రి ౩ గ, శ్చంద్రమాశ్శుభఫలప్రదస్తదా। వ్యా ౧ త్మజాం ౫ త్య ౧౨ మృతి ౮ బంధు ౪ ధర్మ ౯ గై, ర్విధ్యతే నవిభుదైర్యదిగ్రహైః ౨

ఈరవిచందుౖల రెండు శ్లోకములకును తాత్పర్య మిక్కడనే వ్రాయబడు చున్నది.

తా. రవికి జన్మరాశి మొదలుకొని సూర్యుడు తన శుభస్థానములగు ౧౧-౩-౧౦ ౬ టనున్నప్పుడు క్రమాలంకారముగా ౫-౯-౪-౧౨ జన్మరాశి మొద లీస్థానములం దు ఏగ్రహములును లేకుండిరేని శుభుడగును ఒక్కశనిమాత్రమున్నను దోషములేదు-అ నగా ౧౧-౩-౧౦-౬ టరవిశుభుడని చెప్పబడియున్నది-సదరు ౪ స్థానములకును వరుస గా ౫-౯-౪-౧౨- స్థానములు వేధాస్థానములు గనుక వేధాస్థానమందు ఎవ్వరు నుండ గూడదు. అనగా ౧౧ కు ౫ న్ను, ౩ టికి ౯ న్ని, ౧౦ టికి ౪ న్ను ౬ టికి ౧౨ న్ను వరుసగా వేధా స్థానములు గనుక వోడుగానున్న రెంటిలో ఒకదానికొకటి వేధాస్థానము లు-అనగా ౧౧ టని ౫ న్నూ, ౫ ను ౧౧ ను పరస్పరము వేధించును- గనుక రవి ౧౧ ట వుంటే శుభుడు కావలసియుండగా ౫ ట మరియొక గ్రహ ముండు నేని యాశుభత్వము చెడిపోయి వేధాస్థానముగు ౫ యొక్క ఫలమేజరగును. ఒకవేళ యారవి వేధాస్థాన ముగు ౫ ట వున్న యెడల ౧౧ ట మరియేగ్రహమైన నుండెనేని యాదైయిదింట పాపత్వము పోయి ఏకాదశస్థాన శుభత్వమే గలుగును- ఈలాగననే అన్ని గ్రహములకును, అన్ని స్థానములకును తెలియదగినది "విద్ధోవ్యస్తఫలం కరోతి

భిచరః" అని చెప్పుటచేత గ్రహము సుస్థానమందు గాని, దుస్థానమందు గాని యుండి, వేధంప బడినట్లయిన నా గ్రహము స్వకీయఫలము నివ్వఁజాలదు. ప్రతిగ్రహమునకు ను ఒక అడ్డగీత గీచి యాగీతపైనిన్ని గీతక్రిందనున్ను అంకెలు వేయబడును-ఆగీతపైనుండు ప్ర తి అంకెయును తనక్రిందనున్న గీతక్రిందనుండు అంకెను వేధించును. ఈలాగు న పై క్రిందిని స్థానాదిస్థానినిన్ని వేధించును. రవిశనులకును చంద్రబుధులకును మాత్రము ప రస్పరము వేధాలోపము లేదు.

రవేః $\frac{౧౧-\ ౩-\ ౧౦-\ ౬}{౫-\ ౯-\ ౪-\ ౧౨}$ పరస్పర వేధాంకములు.

ఇక చంద్రునికిని యితరులకును నీలాగునే తెలియవలెను. ఈ చంద్రుని వేధాశ్లోకము పైన రవిశ్లోకమువద్దనే వ్రాయబడెను.

చంద్ర వేధాంకాః $\frac{౭-\ ౧-\ ౬-\ ౧౧-\ ౧౦-\ ౩}{౨-\ ౫-\ ౧౨-\ ౮-\ ౪-\ ౯}$

కుజస్య శనేశ్చ ॥ శ్లో ॥ విక్రమా ౩ య ౧౧ రిపు ౬ గశ్శుభః కుజ స్యా త్రధాంత్య ౧౨ సుత ౫ ధర్మ ౯ గైః । చేన్నవిద్ధ ఇనసూనుతప్య సాకింతు ఘర్మఘృణినా నవిధ్యతే ॥

కుజవేధాంకాః $\frac{౩-\ ౧౧-\ ౬-}{౧౨-\ ౫-\ ౯-}$ శనివేధాంకాః $\frac{౩-\ ౧౧-\ ౬}{౧౨-\ ౫-\ ౯}$

బుధస్య ॥ శ్లో ॥ స్వాం ౨ బు ౪ శత్రు ౬ మృతి ౮ ఖా ౧౦ య ౧౧ గశ్శుభోజ్ఞ స్తథా నఖలువిధ్యతేతిథా । ఆత్మజ ౫ త్రి ౩ తప ౯ అ ధ్య ౧ నైధన ౮ ప్రాంత్య ౧౨ గైర్విధుభిర్నభశ్చరైః ॥

బుధ వేధాంకాః $\frac{౨-\ ౪-\ ౬-\ ౮-\ ౧౦-\ ౧౧}{౫-\ ౩-\ ౯-\ ౧-\ ౮-\ ౧౨}$

గురోః ॥ శ్లో ॥ స్వా ౨ య ౧౧ ధర్మ ౯ తనయ ౫ ద్యూన ౭ స్థితో నాకనాయకపురోహితశ్శుభః । రిప్ఫ ౧౨ రంధ్ర ౯ ఖ ౧౦ జల ౪ త్రి ౩ గైర్యథావిధ్యతే ఖగచారిభిర్నహి ॥

గురువేధాంకాః $\frac{౨-\ ౧౧-\ ౯-\ ౫-\ ౭}{౧౨-\ ౯-\ ౧౦-\ ౪-\ ౩}$

శుక్రస్య ॥ శ్లో ॥ అసుతా ౧- ౨- ౩- ౪- ౫- ష్టమ ౮ తపో ౯ వ్య యా ౧౨ య ౧౧ గోభార్గవో నిగదితశ్శుభప్రదః। నైధనా ౮ స్త ౭

తను ౧ కర్మ ౧౦ ధర్మ ౯ ధీ ౫ లాభ ౧౧ వైరి ౬ సహజ ౩ేష్వ ఖేచరైః ॥

శనియొక్క శ్లోకము ఇచ్చాని యుద్ధనే వ్రాయబడెను. సర్వగ్రహములకు గీచిన అడ్డు గీత పైన వ్రాయబడిన అంకెలున్న యా మంచిస్థానము లనియు, క్రింద వ్రాయబడిన అంకెలున్న యా దుష్టస్థానములనియును, పూర్వము చెప్పబడిన ప్రత్యేకగోచారఫల శ్లోకములవల్లనే తెలియబడుచున్నవి గదా.

ఉదా॥ వృశ్చికరాశిజాతకునికి పంచమమగు మీనమందు గురువున్నాడు. ఈపంచమము గురునికి మంచిదని గురుని రేఖ పైనున్న యంకెలవల్లనే తెలియును. ఈ ౫ అంకెకు సరిగా గీతక్రింద ౪ అంకెయున్నది. ౫ టికి వేధాస్థానము ౪ టి యగుచు అనగా కుంభమందు శనియున్నాడు. ఈశనివల్ల గురువు వేధింపబడి వేధాస్థానమగు ౪టి ఫలమునే గురుడిచ్చును. ఒకవేళ ౪ ట గురుడుండి ౫ నున్న యేగ్రహముచేతనైన వేధింపబడనేని యా ౪ ట చేయవలసిన దోషముపోయి సుస్థానమగు ౫ ట ఫలమే యిచ్చును. అనగా వ్యత్యయము.

## ప్రకారాంతరరాశివేధానిర్ణయము.

—సూత్రములు—

రవేః॥ ౧ కృతశరాంకార్కేషుసమందా నోచేద్భానోః॥

భానోః=సూర్యుడున్న రాశి మొదలు - కృత= ౪ శర=౫ అంక=౯ అర్కేషు= ౧౨ యాస్థానములందు- సమంద=శనితో గూడిన- అఖిలాః = సమస్తగ్రహము లున్న- నోచేత్=లేకుండనేని సూర్యుడుశుభుడగును.

అనగా సూర్యుడున్న రాశి మొదలుకొని పైనవ్రాసిన యేస్థానమందైనను శనితో గూడిన యేగ్రహములున్న లేకుండిన రవిశుభుడగును. శనియుక్తగ్రహము లుండగూడదు కాని శనితోగూడని గ్రహము లున్నను కేవల శనియున్నను దోషము లేదని తాత్పర్యము.

చం॥ ౨॥ కరశరాంకాబ్ధ్యవ్యార్కేషు పాపానోచేద్విధోః

విధోః=చంద్రుడున్న రాశి మొదలు కర=౨ శర=౫ అంక=౯ అబ్ధి=[illegible] అర్కేషు=౧౨ యాస్థానములందు పాపాః=పాపులగు రవి కుజ శని రాహు కేతువులు, నోచేత్=లేకుండినేని చంద్రుడుశుభుడగును. అనగా చంద్రుడున్న రాశి మొదలుకొని పైస్థ

రవ్యాద్యఖిలాః=రాహుకేతువులున్న స్థలము మొదలు, దశ=౧౦ శర=౫ అంగ=౬ అర్క=౧౨ స్థలములందు, సార్కిణః=కుజశనులతో గూడిన, అఖిలాః=అందరుగ్రహములున్న, శోభనాః=శుభుండిరేని, రాహుకేతులు శుభులగుదురు. అనగా; రాహుకేతువులున్న స్థలము మొదలుకొని యాస్థలములందు కుజశని యుక్తులయిన యేగ్రహములు స్థితులుండినను, రాహుకేతువులు శుభులగుదురు. కుజశని యుక్తులయిన యేగ్రహములు వుండకూడదు గాని, కేవల కుజశనులుండినను, కుజశనులతో గూడని యేగ్రహములున్నను దోషము లేదని తాత్పర్యము.

ఈవిధులను గట్టిగా గనిపెట్టి మరి గోచారము జెప్పవలెను గనుక వేధావిజ్ఞాన మావశ్యకంబై యున్నది

## —రవ్యాదులకు సువర్ణాదిమూర్తిలక్షణము.—

గ్రహములు తమతమ చారమందు సుస్థలమందుండియు ఒకప్పుడు దుష్టఫలమునిచ్చును. దుస్థానమందుండియు నొకప్పుడు మంచి ఫలము నిచ్చును. అట్టి వ్యత్యయము సువర్ణాదిమూర్తి భేదమువల్లగలుగును గనుక ముఖ్యముగా మూర్తిలక్షణము దెలియదగినది.

శ్లో. జన్మర్క్షరసారుద్ర సువర్ణమూర్తిః, ద్విపంచనందా రజతాఖ్యమూర్తిః
త్రిసప్తదిక్ష్వేవహి తామ్రమూర్తిర్గజార్కవేదేషుచలోహమూర్తిః.

టీక: జన్మ=౧ రసా=౬ రుద్ర=౧౧ ఈస్థలములందు సువర్ణమూర్తి, ద్వి=౨ పంచ=౫ నందా=౯ యీస్థానములందు రజతమూర్తి, త్రి=౩ సప్త=౭ దిక్ష్వేవ=౧౦ ఈస్థానములందు తామ్రమూర్తి. గజ=౮ అర్క=౧౨ వేదేషు=౪ ఈస్థానములందు లోహమూర్తి.

తా॥ గోచారము చూచునప్పుడు యేగ్రహముయొక్క శుభాశుభములను పరిశీలింపదలచెనో ఆగ్రహమప్పు డేరాశియందుండునో ఆరాశియం దాగ్రహ మేదినమున నేవేళను ప్రవేశించెనో ఆవేళకు నిత్య నక్షత్ర మేదియగునో ఆనక్షత్రమున కప్పటి కేరాశి యగునో ఆరాశి నిత్యరాశి యనబడును. ఈనిత్యరాశిని గుర్తుగా నుంచుకొనవది. పిమ్మట దీనింబట్టి యాగ్రహ మేమూర్తియై ప్రవేశించినాడో తెలియవలెను.

ఎట్లనిన ; గ్రహము రాశి ప్రవేశ మగునప్పటి నిత్యరాశి తన జన్మరాశి మొదలుకొని లెక్కింపగా నెంతవదియగునో ఆసంఖ్య ౧-౬-౧౧ అయ్యేనేని ఆగ్రహము రాశి యందున్నంతవరకు సువర్ణమూర్తి యని ౨-౫-౯ అయ్యేనేని రజతమూర్తి యని, ౩-౭-౧౦ అయిన తామ్రమూర్తి యనియు, ౮-౧౨-౪ అయ్యేనేని లోహమూర్తి యనియు చెప్పబడును.

[illegible] జన్మనక్షత్రము మొదలుకొని యా క్రమ [illegible] విధమైన రాజ్యాది నవగ్రహముల యందును, ముఖము మొదలగు అవ యవములందు [illegible] నక్షత్రములుండును. 'ఆ నక్షత్రములు' ఆయా అవయవము లయందుండి ఆయా జాతకునకు ఆయా శుభాశుభ ఫలముల నిచ్చుచుండును. కావున నవ గ్రహములకు ఏనక్షత్రములు ఏయవయవముల యందుండునో తెలిసికొని తత్ఫలముల తెలుపగవలయును.

ప్రతిగ్రహమునకును వక్త్రాద్యవయవముల యందు జన్మనక్షత్రము మొదలుకొని క్రిందవ్రాసిన రీతిగా నక్షత్రముల నన్నింటిని వ్రాయవలెను. ఇష్టకాలమునకు యిష్టగ్రహము ఏనక్షత్రమందుండెనో ఆనక్షత్రము ఏయవయవమునందు బడెనో ఆయవయవమునకు చెప్పబడిన ఫలమును తెలిసికొనవలెను.

౧. సూర్యాంగ ఫలములు :—జన్మనక్షత్రము మొదలు ముఖమందు ౧ నక్షత్రము నాశముచేయును. పిదపశిరమునందు ౪ ఐశ్వర్యము, వక్షమునందు ౪ జయము కుడిచేతియందు ౪ ధన ప్రాప్తి, పాదములయందు ౬ నిర్ధనము, ఎడమచేతియందు ౪ దేహపీడ, నేత్రములందు ౨ లాభము, గుహ్యప్రదేశమున ౨ మృత్యువును గలుగజేయును.

౨. చంద్రాంగఫలములు :—జన్మనక్షత్రము మొదలు వక్త్రమున ౨ అతిభయము, శిరమున ౪ క్షేమము, పృష్ఠమున ౨ శత్రుభయము, నేత్రముల ౨ భేదము హృదయమున ౫ ఆత్మసుఖము, వామహస్తమున ౩ విరోధము, పాదముల ౬ విదేశగమనము, దక్షిణహస్తమున ౩ ధనలాభమును గలిగించును.

౩. కుజాంగఫలములు :—జన్మనక్షత్రము మొదలు వక్త్రమున ౨ మరణము, పాదముల ౬ విరోధము, ఉదరమున ౩ జయము, వామహస్తమున ౪ మృత్యువు, శిరమున ౨ లాభము, ముఖమున ౪ అతిభయము, దక్షిణహస్తమున ౪ క్షేమము, నేత్రముల ౨ విదేశగమనమును సంభవింపజేయును.

౪. బుధాంగఫలములు :—జన్మనక్షత్రము మొదలు వక్త్రమున ౨ శ్రీలాభము మూర్ధమున ౩ అర్థలాభము, నేత్రముల ౨ బహుధనము గుదమున ౪ బంధనము వామ హస్తమున ౧ బంధనము, హృదయమున ౫ రాజ్యము, పాదముల ౬ ప్రవాసము, దక్షిణహస్తమున ౪ సౌఖ్యమును గలుగజేయును.

౫. గుర్వంగఫలములు :—జన్మనక్షత్రము మొదలు శిరమున ౪ రాజ్యము, దక్షిణహస్తమున ౨ సంపత్తు, కంఠమున ౧ ఐశ్వర్యము, వక్షమున ౫ సంతోషము పాదముల ౬ దేహపీడ, వామహస్తమున ౪ మరణము, నేత్రముల ౫ రాజసన్మానము, సుఖమును గలిగించును.

[illegible] శనికాలాంగ ఫలములు :— జన్మనక్షత్రము మొదలు ముఖమున ౩ [illegible] ౩ [illegible] ౪ [illegible] ౫ [illegible] ౨ [illegible] ౩ [illegible] గలిగించును.

౬. కేత్వంగ ఫలములు :— జన్మనక్షత్రము మొదలు ముఖమున ౧ మరణము, లలాటమున ౩ రాజ్యలాభము, గుహ్యమున ౨ వ్యాధి, నేత్రముల ౨ సంతోషము, హృదయమున ౫ సంపత్తు, వామహస్తమున ౪ భయము, పాదముల ౬ ప్రవాసము, దక్షిణ హస్తమున ౪ ధనప్రాప్తియుం గలుగజేయును.

౮. రాహుకేత్వంగ ఫలములు :— జన్మనక్షత్రము మొదలు శిరమున ౩ పట్టాభిషేకము, ముఖమున ౧ మరణము, వక్షమున ౧ భయము, లలాటము ౪ సర్వజన పూజ్యము, ఉదరమున ౪ ధనలాభమును, సుఖమును, నాభియందు ౨ ధనవృద్ధి, గుహ్యమున ౨ ధననష్టము, పృష్ఠమున ౪ రోగాధికము, పాదముల ౬ ఆరోగ్యమును గలుగజేయును.

ఉదా॥ దేవదత్తుడను వాడొకండు గలడు. వాని జన్మనక్షత్రము అనూరాధ- ఆప్పుడు రవి చిత్రయందున్నాడు- అనూరాధ మొదలు చిత్రవరకు లెక్కింపగ ౨౫ నక్షత్రములైనవి. ఇవి రవిచక్రములో [illegible] క్షేత్రమందు పడినది. దానికి ఫలము లాభము అని వ్రాసియున్నది. కనుక యీరవి చిత్రయందున్నంతవరకు లాభకరుడని చెప్పవలెను.

## బలప్రకరణం-తారాబలం

శ్లో॥ జన్మ నక్షత్ర మారభ్య నిత్య నక్షత్ర గణ్యతే
నవభిర్హరతే భాగం శేషం తారాబలంవిదుః.(ఈతారలక్రమముగా)

శ్లో॥ జన్మసంప, ద్విప, త్క్షేమ, ప్రత్య, క్సాధన, నైధనం
మిత్రం, పరమ, మిత్రంచ, నవతారాః ప్రకీర్తితాః ॥

తా॥ జన్మనక్షత్రము లేక నామనక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రము వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను ౯ చే భాగింపగా మిగిలిన సంఖ్యయెంతయుండునో ఆశేషము ౧ అయిన జన్మతార- ౨ అయిన, సంపత్తార- ౩ అయితే విపత్తార- ౪ అయితే క్షేమతార- ౫ అయ్యెనేని ప్రత్యక్తార- ౬ అయ్యెనేని సాధనతార- ౭ అయినచో నైధన

[illegible] మిత్రతారలు [illegible] పరమమిత్రతార [illegible] శేషము (౦)
అయినచో పరమమిత్రతార [illegible]

—అథ పక్ష బలం—

శుక్లపక్షం ;—శ్లో॥ చంద్రదర్శనతారాది జన్మనక్షత్రగణ్యతే
నవభిస్తు రతే శేషం తత్ఫలం సముదీరయేత్ ॥ ఫలం॥
ఏకం ద్వ్యఘ్నం పునశ్చైకం ద్విరేకం యుగ్మసంఖ్యయా
పంథాలాభో వ్యథావస్త్రం దాహంచ విపులం ధనం॥

తా॥ శుక్లపక్షములో విదియఘడియలు ప్రవేశించువేళకు యే నిత్యనక్షత్రమగునో ఆనక్షత్రము మొదలు జన్మనక్షత్రపర్యంతము లెక్కించగా నైన సంఖ్యను ౯ చేత భాగింపగా మిగిలిన సంఖ్య నుంచుకొని యీ ౯ టిలో యీఖండము లప్రకారము ౬ ఖండములకును ౬ ఫలములున్నూ చెప్పవలెను

ఎట్లంటే; ౯ భాగింపగా మిగిలిన శేషము ౧-౨-౧-౨-౧-౨- ఈ ౬ ఖండములకును వరుసగా పంథ. లాభం, వ్యథ, వస్త్రం, దాహం, అధికధనప్రాప్తి అని చెప్పవలెను.

కృష్ణపక్షం:—శ్లో॥ కృష్ణ ప్రతిపద క్షాది జన్మనక్షత్ర గణ్యతే
త్రిభిర్విభక్త శేషేణ క్షేమం లాభం ప్రయాణకృత్.

తా॥ బహుళప్రతిపత్తు ఘడియలు యెప్పుడు ప్రవేశించునో ఆకాలమునకు నిత్యనక్షత్రము యేదియగునో ఆనక్షత్రము మొదలుకొని జన్మనక్షత్రమువరకును లెక్కించగా నైన సంఖ్యను 3 చేత భాగింపగా ౧ మిగిలిన క్షేమము- ౨ మిగిలిన లాభము-3 అనగా (౦) మిగిలిన ప్రయాణము అని కృష్ణపక్షఫలమును చెప్పవలయును.

—అథ సంక్రాంతి బలం—

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య సంక్రమర్క్ష ప్రగణ్యతే
మునిభి ర్గుణితం కృత్వావసుభి ర్భా జయేత్తతః ॥ఫలం॥
రోగోలాభసధాధ్యానం బంధనం ధన మేవచ
ఐశ్వర్య మర్థలాభశ్చ నృపపీడా యథాక్రమం॥

తా॥ ప్రతినెలలో సంక్రమణ ప్రవేశకాలమునకు యేనిత్య నక్షత్రమగునో ఆ నక్షత్రము సంక్రాంతి నక్షత్రమనబడును. జన్మనక్షత్రము మొదలుకొని సంక్రాంతి

[illegible] వరకు [illegible] [illegible] [illegible] [illegible] [illegible]
ము ౧ మొదలు ౮ వరకును ౮ ఫలములు [illegible] [illegible] —

| | |
|---|---|
| ౧ రోగము. | ౫ ధనము. |
| ౨ లాభము. | ౬ ఐశ్వర్యము. |
| ౩ ప్రయాణము. | ౭ అర్థలాభము. |
| ౪ బంధనము. | ౮ నృపపీడా. |

అథ జన్మనక్షత్ర యుక్త వార ఫలం

శ్లో॥ పంథానం రవివాసరే హిమకరే సంభోగమేణీదృశాం
భీతిం భూమిదినే శ్రియం బుధదినే జీవే జయారోగతా
ఐశ్వర్యం భృగువాసరేచ కథితం మందే మహారోగతాం
జన్మర్క్షం రవివాసరాది సహితం శంసంతి గార్గ్యాదయః॥

తా॥ ప్రతినెలలోను తన జన్మనామ నక్షత్రములు యేవారముతో గూడునో ఆ వారమునకు జెప్పబడిన ఫలము ఆనెలలో జెప్పవలయును. ఎట్లనగా;-ఆదివారముతో గూడకేని పంథా- సోమవారముతో గూడనేని స్త్రీసంభోగం- మంగళవారముతో గూడనేని భయము బుధవారముతో గూడిన సంపత్ గురువారముతో గూడిన జయము. ధనలాభము శుక్రవారముతో గూడనేని ఐశ్వర్యము శనివారముతో గూడనేని గొప్పరోగం ఈలాగు ప్రతినెలలోను చూచి ఫలము జెప్పవలెను.

రాశీనాం స్వరూప జ్ఞానం

శ్లో॥ మత్స్యౌ ఘటీ నృమిథునం సగదం సవీణం
చాపీ నరోశ్వ జఘనో మకరో మృగాస్యః
తౌలీ ససస్య దహనాప్లవగాచ కన్యా
శేషాస్స్వనామసదృశా స్స్వచరాశ్చ సర్వే॥

ఇది బృహజ్జాతకమందు జెప్పబడినది.

టీ॥ మత్స్యౌ=మీనరాశి రెండుచేపలు గలది. ఘటీ=కుంభము కలశమును ధరించునతడు- నృమిథునం=మిథునము, స్త్రీపురుషద్వంద్వము గలది. సగదం=గదతోను న్ను, సవీణం=వీణతోనున్ను గూడినది- చాపీ=ధనూరాశి ధనువును ధరించునట్టి, అశ్వజఘనః = గుఱ్ఱముయొక్క అధోభాగముగల యట్టియు- నరః=మనుష్యుడు గలది, మకరః=మకరరాశి- మృగాస్యః=మృగ=మొసలివంటి- ఆస్యః= ముఖము గలది- తౌలీ=

తులా=తాసుకుధరించునట్టి వరుడు గలది- కన్యా=కన్యారాశి- ససస్యదహా సా=సస్యమున్ను, అగ్నిహోత్రమున్ను చేబూని- ప్లవగాచ=ఒక తెప్పమీద యెక్కినట్టి స్త్రీగలది- శేషాః=మిగిలినరాసులు- స్వనామసదృశాః=తమ పేరుతో సమానమైన విషయములు, స్వచరాశ్చ తమతమకు దగిన నివాసస్థానములున్ను అని యెరుగునది.

అనగా, మేషవృషభములు, గోశాలలందును- మిథునము- పడకటిండ్లయందును- కర్కాట, మీన, మకరములు, జలమందును. తుల అంగడివీధిలోను, వృశ్చికము పెంటలందును యీలాగు తెలియవలెను.

—చంద్రబలం.—

శ్లో॥ జన్మత్రికోరాశి మారభ్య నిత్య రాశ్యంతే గణ్యతే
తత్సంఖ్యయా ఫలంబ్రూయాద్రాశీనాం ద్వాదశావధి
జన్మ ౧ వం ౩ ఋతు ౬ స్సప్త ౭ దశైకాదశ ౧౧ గశ్శుభః
చతుర రష్టౌ ౮ వ్యయే ౧౨ కృష్ణే,శుక్లేద్వి ౨ నవ ౯ పంచమే ౫
యథామాతా సుతంరక్షే త్తథారక్షతి చంద్రమాః.

తా॥ తన జన్మరాశి మొదలుకొని యిష్ట కాలమునకు చంద్రుడున్న రాశివరకు లెక్కించి చూడగా నెంతసంఖ్య యగునో ఆసంఖ్యను బట్టి యీదిగువున వ్రాసిన ప్రకారము చంద్రుని శుభత్వ పాపత్వములను తెలియవలెను.

ఎట్లంటే:—వెనుక లెక్కించిన సంఖ్య ౧-౩-౬-౭-౧౦-౧౧ ఈ సంఖ్యలలో నొకటయిన యెడల చంద్రుడు సర్వదా మంచివాడనియు, చంద్రబలము గలదనియు చెప్పవలెను. తక్కిన సంఖ్యలును గూడ నొకప్పుడు శుక్లకృష్ణ పక్షభేదముచేత మంచి వగును. ఎట్లన, చంద్రుడు కృష్ణపక్షములో ౪-౮-౧౨ టనున్న, శుక్లపక్షములో ౨-౯-౫ టనున్ను మంచివాడగును ఈచంద్రబల మత్యావశ్యక మైనది ఈచంద్రబలము బాగావుంటె తల్లి తనబిడ్డలను వలె చంద్రుడు రక్షించును. గనుక సకల కార్యములందును తారాచంద్ర బలములు ముఖ్యముగ జూచుకొనవలసినది.

—తారాచంద్రబలముల ముఖ్యాముఖ్యములు—

శ్లో॥ శుక్లేపక్షే రాత్రినాథో బలీయాన్
నప్రాధాన్యంతార కాయాశ్చతత్ర
శక్త్యా యుక్తేవిద్యమానే పతౌచే
న్నస్వాతంత్ర్యం యోషితః క్వాపిదృష్టం.

తా॥ శుక్లపక్షమందు చంద్రుడు వృద్ధికళలు గలిగి బలవంతుడై యుండును గనుక చంద్రతేజము వలన నక్షత్రము తేజోహీనమై యుండుటంజేసి చంద్రుడె బలిష్టుడగును. కృష్ణపక్షము లోనున్న చంద్రుడు స్థాన బలవంతుడయ్యె నేని నక్షత్రమును బలముగలదే యగును గనుక సమర్థుడగు పెనిమిటి యుండగా భార్యకు స్వాతంత్ర్యమెట్లుండదో అలాగునే సర్వదా చంద్రబలము వల్లనే నక్షత్రమును బలము గలది యగును కావున తారాచంద్ర బలములు ముఖ్యముగం జూడదగినవి.

శ్లో॥ నృణాం సూర్యబలం ముఖ్యం నారీణాంతు గురోర్బలం
చంద్రస్య తూభయోర్ముఖ్యం తయోస్తారా బలంసదా॥

—అథ మాస ఫలమాహ.—

శ్లో॥ యదాది శుక్లప్రతిపద్య ఋక్షం తదాది కృత్వానవభాగశేషం
పంథాసుభోజ్యం తనుపాప శౌర్యం విద్యాచవస్త్రంవిపులంచశోకం
అనంత పుణ్యంచ మహాఫలంచ మాసెచమాసేచ విచారణీయం.

తా॥ ప్రతిమాసమందును శుక్ల ప్రతిపత్తు ఘడియ లెప్పుడు ప్రవేశించునో ఆప్రవేశ కాలానకు నిత్యనక్షత్ర మేది యగునో అనక్షత్రమే ఆనెలకు మాసాది నక్షత్ర మనబడును. ఆమాసాది నక్షత్రము మొదలుకొని జన్మనక్షత్రము వరకును ఎంచగా నైన సంఖ్యను ౯ చే భాగింపగా శేషము ౧ అయిన యెడల పంథ అనగా ప్రయాణము ౨ అయితే సుభోజ్యము. 3 అయిన తనుతాపము. ౪ అయ్యెనేని శౌర్యము. ౫ ఆయినచో విద్యాలాభము ౬ అయ్యెనేని వస్త్రలాభము. ౭ అగుచో విస్తారమగు దుఃఖము ౮ వచ్చిన యెడల అనంతపుణ్యము. ౯ మిగిలినేని మహాఫలము. శేషము (౦) వచ్చెనేని ౯ దవ ఫలమే యని యెరుగవలయును.

ఉదా॥ శకె ౧౮౧౪ నందన సం॥ కార్తిక బ 30 శనివారము ౫౮-౧౯ విశాఖ ౧౯-౧౨ అమావాస్య ఘడియలు ౨౮-౧౯ పర్యంతము నున్నవి. అప్పటికి నిత్యనక్షత్రము విశాఖ పిదప శుద్ధప్రతిపత్తు ప్రవేశించు నప్పటికి అనూరాధ వచ్చినది. గనుక యీయనూరాధయే మాసాది నక్షత్రమని యూహించుకొనవలయును.

చతుర్థఃఫలపరిచ్ఛేదః.



శ్రీరస్తు.

# దైవజ్ఞకర్ణామృతే

పూర్వభాగే మిశ్రఫలబిందౌ

## గోచరపరిచ్ఛేదే, సర్వతోభద్రప్రకరణం.

సర్వతోభద్రమనునది, గోచారప్రకరణములలో బహుశ్రేష్ఠమయినదియు, ప్రత్యక్షమయినదియు, ఈప్రపంచమందలి సమస్తపదార్థముల వృద్ధిక్షయములను తత్కాలమందే ప్రత్యక్షానుభవముగ జెప్పదగినదియును నగును. సర్వతోభద్రచక్రింబను మహాప్రామాణిక గ్రంథమును శ్రీపార్వతీదేవికి శ్రీమహాదేవుండుపదేశించెను. అట్టి గ్రంథమిచ్చట వ్రాయబడుచున్నది.

—సర్వతోభద్రచక్రోద్ధారము.—

శ్లో. కదాచిత్పార్వతీనాథం పార్వతీభక్తవత్సలా
సత్వాలోకోపకారాయ పప్రచ్ఛవినయాన్వితా
దేవదేవజగన్నాథ భక్తాభీష్టప్రదాయక
కాలత్రయఫలజ్ఞానం సంక్షేపేణశుభాశుభే
శక్యతే తత్కథం జ్ఞాతుం నృణామత్యంత లాఘవాత్
తచ్ఛ్రుత్వా దేవదేవేశః ప్రోవాచ పరమద్భుతం
సర్వతో భద్రచక్రాఖ్యం శృణు దేవివరాననే
ఇదానీం సంప్రవక్ష్యామి చక్రం త్రైలోక్య దీపకం
విఖ్యాతం సర్వతో భద్రం సద్యః ప్రత్యయకారకం
ఇదంచక్రం ద్విధాప్రోక్తంఖండంచా ఖండ సంజ్ఞకం
చతుష్షష్ట్యాత్మకం ఖండమేకాశీతి మఖండకం
చరాచరాత్మకం యైతజ్జగదస్మిన్ ప్రతిష్ఠితం
సమ్యగ్జ్ఞాత్వా ఫలం బ్రూయాన్నిశ్శంకం దైవవిత్సదా.

తా॥ పూర్వమందు శ్రీపార్వతీదేవి లోకహితము కొఱకు శ్రీపరమేశ్వరుని జూచి యోస్వామీ దేనివలన ప్రత్యక్షముగాను లఘూపాయము చేతను కాలత్రయ శుభా

శుభాశుభములను దెలియ వచ్చునని యనుగా భక్తవత్సలుండగు సర్వలోకేశ్వరుం డిట్లాన తిచ్చెను, సర్వతో భద్రమను చక్రమొక్కటి కలదు. అది ఖండమని, యఖండమని యును రెండువిధములు. అందు ౮౧ గళ్లుగలది ఖండమనియు, ౯౧ గళ్లుగలది యఖం డమనియు జెప్పబడినది. దీనియందే పంచభూతాత్మకం బగు సకల ప్రపంచము నిమి డి యున్నది. గనుక సమస్త శుభాశుభములను దీనివలననె దైవజ్ఞుడు చక్కగా బరిశీ లించి నిశ్శంకముగా దృష్టాంత పూర్వకముగా చెప్పవచ్చును

—చక్రలేఖన ప్రకారము.—

శ్లో॥ ఊర్ధ్వగా దశలేఖాశ్చ తిర్యగ్రేఖా స్తథాదశ
ఏకాశీతిపదం చక్రం జాయతే నాత్రసంశయః॥

తా॥ నిడుపుగా ౧౦ రేఖలును అడ్డముగ ౧౦ రేఖలును గీచి నట్టయిన ౮౧ గడిగల చక్రమగును.

శ్లో॥ అకారాది స్వరాః కోష్ఠే ఈశాన్యాది లిఖేత్క్రమాత్
సృష్టిమార్గేణ దాతవ్యం షోడశం చతురశ్రకం॥

టీక॥ ఈచక్రమునందు ఈశాన్య దిక్కు మొదలుకొని ప్రదక్షిణ పూర్వకము గా విదిక్కుల గళ్లయందు ౧౬ అకారాది స్వరములను వ్రాయవలయును.

శ్లో॥ సప్తసప్తాగ్ని భాదీని పూర్వాశాది లిఖేత్తతః
సప్తసప్త క్రమేణైవ అష్టావింశతి సంఖ్యయా॥

టీక॥ తూర్పుదిక్కు మొదటిగడి మొదలుకొని దిక్కు ౧ కి యేడు నక్షత్రము ల చొప్పున కృత్తికాదిగా అభిజిత్సహితంబుగ ౨౮ నక్షత్రములను లిఖించుమనది.

శ్లో॥ న్యస్యావకహడాదీని పూర్వాశాదిలిఖేత్తతః
అవకహడాదిశిప్రాచ్యాం మటపరతాశ్చదక్షిణే
నయబజకాశ్చవారుణ్యాం గసదచలాస్తథోత్తరే॥

టీక॥ ప్రాగాదిగా ౪ దిక్కులందును అవకహడాది వర్ణములను పైనున్న నక్షత్ర పఙ్క్తి క్రింది పఙ్క్తియందు వ్రాసేది.

శ్లో॥ త్రయస్త్రయో వృషాద్యాస్తు పూర్వాదిక్రమశస్తథా
రాశయోద్వాదశైవంతు మేషాంతాస్సృష్టిమార్గతః॥

టీ॥ పూర్వాది క్రమముగా వృషభాది రాసులను దిక్కు ౧ కి ౩ చొ॥ అవకహ డాద్యక్షరముల క్రిందిపంక్తిని వ్రాసేది.

శ్లో॥ శేషేష్వథోష్టకేష్వేవం నందాదితిథిపంచకం
వారాణాంసప్తకం లేఖ్యం రాశీశగ్రహమార్గతః॥

టీక॥ మిగిలిన ౫ గళ్లలోను నందా, భద్రా, జయా, రిక్తా, పూర్ణా అను ౫ తిథిని వ్రాసేది- ఇవియే తిథులు, ఈతిథి గళ్లయందే యాగుపున సువారంభించిన రీతిని యాధిపత్యక్రమముగా వారములు ౭ నిన్ని వ్రాయునది- అధిపత్యక్రమమెట్లనగా:—

శ్లో॥ నందాయాం రవిభౌమౌచ భద్రాయాం చంద్రచంద్రజౌ
జయాయాం గురువారశ్చరిక్తాయాం భృగువాసరః
పూర్ణాయాం స్థిరవారశ్చ హ్యూహారాశాస్త్రవిశారదైః॥

తా॥ నందకు రవి కుజులను, భద్రకు చంద్ర బుధులను, జయకు గురుని, రిక్తకు శుక్రుడును, పూర్ణకు శనియును, తిథ్యధిపతు లగుదురు.

శ్రీసర్వతోభద్రచక్రవిన్యాస.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ | కృ | రో | మృ | ఆ | పు | పు | ఆ | ఆ |
| భ | ఉ | అ | వ | క | హ | డ | ఊ | మ |
| అ | ల | ఌ | వృ | మి | క | ౡ | మా | పు |
| రే | చ | మే | ఓ | నంద రకు | ఔ | సిం | ట | ఉ |
| ఊ | ద | మీ | రిక్తా శు | పూర్ణా శ | భద్ర చ బు | క | ప | హ |
| పూ | స | కుం | అః | జయ గు | అం | తు | ర | చి |
| శ | గ | ఐ | మ | ధ | వృ | ఏ | త | స్వా |
| ధ | బూ | ఖ | జ | బ | య | న | బు | వి |
| ఈ | శ్ర | అ | ఉ | పూ | మూ | జ్యే | అ | ఇ |

ఈ చక్రములో నందాది తిథి పంచకమని వ్రాయబడియున్నది- నందాది తిథులు యెట్లనగా:—

౧-౬-౧౧ ఇవి నంద తిథులు ; ౨-౭-౧౨ ఇవి భద్రతిథులు ; ౩-౮-౧౩ ఇవి జయతిథులు ; ౪-౯-౧౪ ఇవి రిక్తతిథులు ; ౫-౧౦-౧౫ ఇవి పూర్ణతిథులు.

శ్లో॥ శుభగ్రహాస్సితక్షీణజ్యా: పాపామందారభాస్కరాః
బుధపాపయుతః పాపఃక్షీణచంద్రస్తథైవచ
సూర్యాదికాన్ గ్రహాన్ సర్వాన్ న్యసేత్తదాశ్రి బుధో॥
వర్షాణిమాసాఃపక్షాశ్చక్షణతాత్కాలికగ్రహాః.

తా॥ గోచారము జాతకమునందు యేగ్రహాలు ఏనక్షత్ర యేరాసుల నందుంటే ఆ యాగ్రహాలను ఆయానక్షత్రరాసులయందు వ్రాసేది - వర్ష, మాస, పక్ష, క్షణ, తాత్కాలిక గ్రహాలనెడు ౫ విధముల గ్రహములు వేధించుక్రమము తెలుసుకొనది.

——ఉపగ్రహాలక్షణము.——

శ్లో॥ సూర్యాదిపంచమంరుక్షం విజ్ఞేయం విద్యుతో న్ముఖం
సప్తమంభూమికం పంచఅష్టమంశూలముచ్యతే
దశమం శనివిజ్ఞేయం నిఘాతస్తుచతుర్దశ
దండఃపంచదశశ్చైవ కేతురష్టాదశస్మృతః
ఏకోనవింశతిశ్చోల్కా ద్వావింశంకంపముచ్యతే
వజ్రింత్రివింశతిశ్చైవసన్నిపాతమనంతరం
పరివేషంతతః పశ్చాద్ద్వాదశైతే ఉపగ్రహాః॥

టీక॥ ఉపగ్రహాలక్షణముం జెప్పుచున్నాడు. సూర్యుడున్న నక్షత్రము మొదలు ౫ వ నక్షత్రము విద్యున్ముఖమనే పేరు గలది- అనగా ; సూర్యుడు యేనక్షత్రమందుం డునో ఆనక్షత్రమునకు ౫ వది యేనక్షత్రమగునో దానియందు విద్యున్ముఖమను ఉపగ్ర హముండునని తాత్పర్యము. ఈప్రాకనే సూర్యుడున్న నక్షత్రమునకు ౭వనక్షత్రమందు భూకంపమనే యుపగ్రహముండును ౮ వ నక్షత్రమందు శూల- ౧౦ వ దానియందు శని- ౧౪ వది నిర్ఘాతము- ౧౫ వది దండము- ౧౮ వది కేతువు- ౧౯ వది ఉల్కా- ౨౨ వది కంపము. ౨౩ వది వజ్రము- ౨౪ వది సన్నిపాతము- ౨౫ వది పరివేషము- ఈప్రకారము ఈ ౧౨ ఉపగ్రహములను ఏయుపగ్రహమే నక్షత్రమందున్నదో ఆయా

నక్షత్రము లందాయా ఉపగ్రహములను గుర్తు చేయుగా- ఈ ౧౨ ఉపగ్రహములలో నే దైన తన జన్మ నామనక్షత్రములయందు పడినయెడ అపడిన యుపగ్రహాదిద్దియో దాని నియొకచోట ఫలాసా యుపగ్రహము జన్మనామనక్షత్రములయందు పడినదని వ్రాసి యుంచుకొనునది.

ఉదా॥ నందనసంవత్సర ఆశ్వయుజ శు ౧౫ గురువారము రోజున మూల జన్మనక్షత్రముగలవాడును, ఇదియే నామనక్షత్రముగ గలవాడును, అయిన బాపయ్యయను ప్రశ్నకుంచు వచ్చి గోచార మిదుగ నాతనికి ౧౨ ఉపగ్రహములను పరిశీలింపదలచి చూడగా; ఈదినమున సూర్యుడు హస్తానక్షత్రమందున్నాడు- గనుక యీహస్త మొదలు కొని లెక్కింపగా ౫ వ దైన అనూరాధయందు విద్యున్ముఖము పడినది ౭ వ దగు మూలయందు భూకంపమను ఉపగ్రహ మున్నది- ఈతనికి యీమూలయే జన్మనక్షత్రముగను గ యీజన్మనక్షత్రమందు, రవి యీహస్తయందుండు నంతవరకు భూకంపమను నుపగ్రహమున్నదని వ్రాసికొనవలయును. జన్మనక్షత్రయుపగ్రహమే ప్రధానముగుటచేత తక్కినయుపగ్రహములతో ప్రయోజనము లేదు- గనుక వ్రాయలేదు- ఈయుపగ్రహఫలములు ముందు వ్రాయబడును.

—ఉపగ్రహఫలము.—

శ్లో॥ విద్యున్ముఖేచపతనం భూకంపం కంపనంభవేత్
శూలేతురక్తపాతస్స్యాచ్ఛనౌ గర్వవినాశనం
నిర్ఘాతే విషసంప్రాప్తిర్దండే మృత్యుభయప్రదః
కేతౌతువిషసంప్రాప్తిరుల్కా పాతోభయప్రదః
కంపేశీతజ్వర ప్రాప్తిర్వజ్రేశస్త్రభయప్రదః
సన్నిపాతెజ్వరం ఘోరపరివేషేగ్నివిగ్రహః
ఉపగ్రహఫలాన్యేవంజానీయాద్గోచరేసదా॥

తా॥ ఈశ్లోకములు స్పష్టార్థములు గనుక టీక వ్రాయలేదు.

ఉదా॥ వెనుకటియుదాహరణములో జన్మనక్షత్రమునందు భూకంపమను నుపగ్రహమున్నది. గనుక " భూకంపం కంపనం భవేత్ " అని ఫలములోచెప్పబడుటచేత నున్న ఈభూకంపము జన్మనక్షత్రనామనక్షత్రము లందుండునంతవరకును ఈతనికి హృదయమునందత్యంతము కంపముగా నుండును. అనగా మనస్సునకు ఒహుభీతిగాను, చంచలముగా నుండును.

### —లత్తాలక్షణ

శ్లో॥ ఋక్షం ద్వాదశముష్ణరశ్మిరవనీ సూనుస్తృతీయం గురు
షష్ఠంచాష్టమ మర్కజస్తుపురతో హంతిస్ఫుటం లత్తయా
పశ్చాత్సప్తమమిందు జన్మనవమం రాహుస్సితః పంచమం
ద్వావింశంపరిపూర్ణమూర్తిరుడుప స్సంతాడయన్నేత రే॥

తా॥ సూర్యుడున్న నక్షత్రమునకు ముందు ౧౨ వ నక్షత్రము రవిలత్తా- కుజునకు ముందు ౩ వది కుజలత్తా- గురునకుముందు ౬ వదిగురులత్త- శనికి ముందు ౮ వదిశనిలత్తా- బుధునకు వెనుక ౭ వ నక్షత్రము బుధలత్తా- రాహువుకు వెనుక ౯ వది రాహులత్తా- శుక్రునకు వెనుక ౫ వది శుక్రలత్తా- చంద్రునకు వెనుక ౨౨ వది చంద్రలత్తా- ఈప్రకారము లత్తలు గ్రహించి తన జన్మనామనక్షత్రములందు ఏగ్రహము యొక్క లత్త గూడియుండునో ఆగ్రహలత్తను గుర్తుగా వ్రాసియుంచుకొని వక్ష్యమాణప్రకారము ఫలము నెరుంగవలయును.

### —లత్తాఫలము.—

శ్లో॥ రవిలత్తార్థహానిస్స్యాత్కుజరాహుశనైశ్చరాః
మరణంజీవలత్తాయాం బంధునాశో భవేద్ధ్రువం
శుక్రేణకార్యవిభ్రంశ మనర్థంచంద్రసూనునా
చంద్రేణ స్యాన్మహత్తాపం లత్తాహతఫలంస్మృతం॥

తా॥ వెనుకటిప్రకారము జన్మనామనక్షత్రములందు పడిన కేవలలత్తలయొక్క ఫలములం జెప్పుచున్నాడు.

జన్మనామనక్షత్రములు కుజ- శని- రాహువులయొక్క లత్తలు రవిలత్తతో గూడెనేని ధనహానియనియును, తక్కిన మూడులత్తలతో గూడెనేని నిశ్చయముగ మరణంబు గలుగుననియును, గురులత్తతో గూడునేని బంధునాశమనియు, శుక్రలత్తతో గూడెనేని కార్యహానియనియును బుధలత్తతో గూడెనేని దారిద్ర్యం బనియు చంద్రలత్తతో గూడెనేని గొప్పతాపము గలుగుననియును జెప్పబడెను.

### —లత్తాయుతగ్రహఫలము.—

శ్లో॥ రవియుక్తశనిలత్తాయాం వాతరోగాదిపీడనం
పితృక్షయకరంచైవ చతుర్విధఫలంభవేత్

శథ్యాఫలం రాహుకేత్వోశ్చంద్రయోగే వినాశనం॥

తా॥ శనిలత్తతో రవిగూడినేని వాయుసంబంధమైన రోగము వల్ల బాధ కలుగును- శిశ్నమూర్ఛాము మొదలగు నష్టములు కలుగును. యీప్రకారమే రాహుకేతువులకును జరుగును. యీచెప్పిన గ్రహములు లత్తలతో గూడి జన్మనక్షత్రమందు బడెనేని పైనజెప్పిన నష్టములు కలుగునని చెప్పబడును. మరియు.

శ్లో॥ రవియుక్కుజలత్తాయాం గృహం దగ్ధం హృతంధనం
రవియుగ్బుధలత్తాయాం బంధుహానిర్న సంశయః
రవియుగ్గురులత్తాయాం వాతరోగాదిపీడనం
రవియుగ్భృగులత్తాయాం బంధుద్వేషం మనోరుజం
వక్ష్యామి రవిలత్తాయాం స్థితంచంద్రాదితత్ఫలం॥

తా॥ జన్మనామనక్షత్రములు కుజలత్తయై రవితో గూడినేని వాని గృహము అగ్నిదగ్ధమై ధనక్షయమగును- అట్టిరీతినే బుధలత్తయందు రవిగూడినేని బంధుహానికమగును- ఈరీతినే ఆదియు దెలియదగును.

—సర్వలత్తాసుగ్రహయుతసమష్టిఫలం.—

శ్లో॥ లత్తః ప్రకోపః ప్రాయేణ ప్రాణాని కురుతే శనిః
భూపుత్రశ్చోరబాధాచ తనుహేమాదినాశనం
బుద్ధేర్విహీనమాప్నోతి చంద్రపుత్రఫలంత్విదం
కరోతి నృపభీతించ పశుహానిర్గురుస్మృతః
స్వస్త్రీవియోగమాప్నోతివస్త్రహానిశ్చ భార్గవః
హేమరత్నమహిష్యాదిదాసీదాసహరోర్కజః
సర్వహానిప్రదో రాహుః కేతుశ్చాపిభయంభవేత్॥ స్పష్టోర్థః॥

—పక్షిగ్రహవేధలు.—

శ్లో॥ ఆద్యత్రిపంచరవిషోడశ శైలచంద్ర
షణ్ణేత్రయోగకరశైలకరాః ప్రయుక్తాః
భాన్వర్కభృగుక్షితిసుతోపిచ కేతురాహు
స్త్రీపశ్చనీంకుబుధపక్షిగ్రహాభవంతి॥

తా॥ రవియున్న నక్షత్రము వద్దనుంచి లెక్కింపవలెను. రవియున్న నక్షత్రమే రవివేధయనబడును. రవినక్షత్రమునకు ౩ వ నక్షత్రము శుక్రవేధ- ౫ వది కుజవేధ- ౧౨ వది కేతువేధ- ౧౬ వది రాహువేధ ౧౭ వది గురువేధ- ౧౯ వది శనివేధ- ౨౫ వది చంద్రవేధ- ౨౭ బుధవేధ- ఇవిపక్షగ్రహముల వేధలనబడును- ఈపక్షగ్రహవేధలు జన్మనామనక్షత్రముఁగూడితే ఆయా వేధలని యెరుగవలయు.

—నిత్యగ్రహవేధలు.—

శ్లో॥ ఆద్యాత్మ్యజాద్రి దశవిశ్వమనుస్తథాచ
ఏకోనవింశతి త్రిసప్తచపంచవింశం
చంద్రార్క-భానుబుధ రాహుసురేజ్యకావ్య
కేతుశ్చమందఇతి నిత్యగ్రహాభవంతి॥

తా॥ చంద్రుడున్న నక్షత్రము చంద్రవేధ- చంద్రనక్షత్రమునకు ౫ వనక్షత్రము రవివేధ- ౭ వది కుజవేధ- ౧౦ వది బుధవేధ- ౧౩ వది రాహువేధ- ౧౪ వది గురువేధ- ౧౯ వది శుక్రవేధా- ౨౧ వకేతువేధ- ౨౫ వది శనివేధ- ఇవిచంద్రుడున్న నక్షత్రము వద్దనుంచి లెక్కింపదగినవి. అనగా ఈవేధలు నిత్యనక్షత్రమును బట్టి లెక్కింపవలసినది. ఈవేధలలో నేదయిన జన్మనక్షత్రమయ్యేనని ఆవేధాఫలమును మాత్రమే చెప్పదగును.

—గ్రహావస్థాఫలవిశేషము.—

శ్లో॥ వక్రాతివక్రాబాలశ్చ వృద్ధశ్చాస్తంగతస్తథా
నీచోచ్చస్వర్క్ష మిత్రర్క్ష సమక్షేత్రగతోపివా
శత్రుభస్థోజితశ్చైవ తత్రతత్రఫలంత్విదం
వామదక్షిణవేధాశ్చసర్వంగ్రహవశాద్భవేత్॥

తా॥ గ్రహములకు- వక్రగతి, అతివక్రగతి గలిగినను, బాలత్వము, వృద్ధత్వము గలవాడును, అస్తమయమును బొందినవాడును, నీచయందును, ఉచ్చయందును, స్వక్షేత్రమందున్నవాడును, మిత్రక్షేత్రగతుఁడును, సమక్షేత్రమందున్నవాడును, శత్రుక్షేత్రమందున్నవాడును, యుద్ధమందు ఓడిపోయినవాడును, వారివారిస్థితినిబట్టిన్ని, వామవేధ, దక్షిణవేధ, సమ్ముఖవేధల వల్లనున్ను శుభాశుభములు బాగుగ విమర్శించి తత్తదనుగుణముగ జెప్పవలెను.

ఇందులో జెప్పబడిన వక్ర, అతివక్ర అనునవి ముందు వివరించుచున్నాడు-బాలత్వ, వృద్ధత్వములు ముందు ముహూర్త బిందువులో వ్రాయబడియున్నవి. నీచ, ఉచ్చ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, సమక్షేత్ర శత్రుక్షేత్రములు వెనుక నెం ౫౦ గల ప్రకరణములోనే వ్రాయబడియున్నవి. యుద్ధమందు పరాజయ ప్రకరణము ఈగ్రంథముయొక్క యుత్తరభాగంబగు రెండవసంపుటములో గణితబిందువులో జెప్పబడినది. వీటి నన్నిటిని గనిపెట్టి గ్రహ బలాను గుణముగ ఫలముం జెప్పవలయును.

## —గ్రహగతిభేదములు.—

శ్లో॥ వక్రానువక్రాకుటిలా మందామందతరాసమా
తథాశీఘ్రాతి శీఘ్రాఖ్యాగ్రహాణామష్టథాగతిః॥

తా॥ ప్రతిగ్రహమునకును తమతమ చారమందు వక్రము, అనువక్రము, కుటిలము, మందము, అతిమందము, సమము, శీఘ్రము, అతిశీఘ్రము, అని ౮ విధములగతులు గలిగియుండును- ఈగతిభేదములు సిద్ధాంతాధీనములయినను కొంచెము వివరించుచున్నాడు.

శ్లో॥ వక్రగామీసదారాహు శ్శీఘ్రగా చంద్రభాస్కరా
కూరవక్రామహాకూరా స్సౌమ్యవక్రాస్సుశోభనాః॥

తా॥ రాహువు ఎల్లప్పుడును వక్రగతి గలవారు- రవిచంద్రులు ఎల్లప్పుడును శీఘ్రగతి గలవారు- ఇక కుజాది ౫ గురు మాత్రము పైన జెప్పిన ౮ గతులు గలవారు-

## —కుజాదులవిశేషగతులు.—

శ్లో॥ సూర్యముక్తాఉదీయంతే శీఘ్రగామీద్వితీయగే
సమాతృతీయగే భానోమందాభానోచతుష్కగే॥
వక్రాస్స్యుఃపంచమేషష్ఠేత్వతివక్రాస్తసప్తమే
నవమేదశమేభానో జాయతేకుటిలాగతిః॥
ఏకాదశేద్వాదశేచ భజంతేశీఘ్రతాంపునః॥

తా॥ సూర్యుడు యేగ్రహముతో గూడినను ఆగ్రహమున కస్తమయము అనబడును. చంద్రుడు గూడితే సమాగమము, కుజాది ౫ గురును ఒకరితో నొకరుగూడితే యుద్ధమనబడును. గ్రహమునకు సూర్యుడుండిట వుంటే శీఘ్రగతి ౩ట, సమగతి ౪ మందగతి ౫-౬ట వక్రగతి ౭-౮ట అతివక్రము ౯-౧౦ ట కుటిలము ౧౧-౧౨ ట శీఘ్రగతి ఈ

ల్లాగు, మూర్యచార వశంబున గ్రహగతులం దెలిసి ఆయాగతుల ననుసరించి ఫలములం జెప్పవలయును.

శ్లో॥ వక్రానువక్రా కుటిల్యేవ వక్రభావాః ప్రకీర్తితాః

తా॥ వక్రము, అనువక్రము కుటిలము ఈ 3 ను వక్రములోనే అంతర్భూతమయినవి. గనుక వక్రఫలమునే చెప్పవలెను.

## —దృష్టి వేధములు.—

శ్లో॥ యస్మిన్నృక్షే స్థితః ఖేటః తత్ర వేధాత్రయం భవేత్
గ్రహదృష్టిప్రధానేన వామదక్షిణసమ్ముఖం॥
వక్రగే దక్షిణా దృష్టిర్వామదృష్టిశ్చ శీఘ్రగే
మందగామినా తథామధ్యే దృష్టిర్భానుమాదిపంచకే॥

తా॥ కుజాది గ్రహములు ఏనక్షత్రమందున్నను వామవేధ, దక్షిణవేధ, సమ్ముఖవేధయని 3 తెగలుగా వేధింతురు. రవిచంద్రులు మాత్రము వామదృష్టిగానే వేధింతురు. వామదక్షిణసమ్ముఖ వేధలనగా వక్ర, అనువక్ర, కుటిల గమనాదుగతులుల గ్రహములు దక్షిణదృష్టిచే వేధింతురు. మంద, మందతర, సమగతులుగలవారు తనకభిముఖముగా చూచి వేధింతురు. దీనికే సముఖవేధయని పేరు. శీఘ్ర, అతిశీఘ్రములుగలవారు వామపార్శ్వములుగా చూచి వేధింతురు. రాహుకేతువులెల్లప్పుడును దక్షిణదృష్టిచేతనే వేధింతురు. కుటిలగతికే వికలగతియను పేరుగలదు. కనుక వ్రాయబడిన సర్వతోభద్రచక్రములో గ్రహమున్న నక్షత్రమువద్దనుంచి దృష్టి వామదక్షిణసమ్ముఖములుగా 3 విధములుగా జూచెది. వామదృష్టి యనగా యెడమ పార్శ్వమును వేధించుట. దక్షిణదృష్టియనగా కుడిపార్శ్వమును వేధించుట. సముఖదృష్టి యనగా తనకభిముఖముగా జూచుట యని యర్థము. వీని యుదాహరణము లన్నియు ముందు వ్రాయబడుచున్నవి.

## —గ్రహములకు విశేష వేధలు.—

శ్లో॥ అనువక్రగతేజీవేదండవేధ ఇతిస్మృతః
మందాతిమందయోశ్చైవ పార్శ్వవేధం సమాచరేత్॥
వికలాయాం సమత్వేచ చతుష్కోణేషునిర్దిశేత్
అతిశీఘ్రయోశ్చైవ తద్వఘావేధితోభవేత్

ఏవంగురుఫలంజ్ఞేయం విపరీతంతుభార్గవే॥ స్పష్టార్థః॥

—బుధవేధావిశేషము.—

శ్లో॥ వక్రానువక్రయోస్సౌమ్యః పార్శ్వవేధం సమాచరేత్
సమత్వేశీఘ్రగేచైవ దండవేధో భవేత్తదా
మందాతిమందయోశ్చైవ వేధో భవతిదక్షిణే
ఏవంసౌమ్యస్యవిజ్ఞేయం శుభాశుభవినిర్ణయం॥

తా॥ రవికి ౨-౧౧-౧౨ ట బుధుడున్నప్పుడు దక్షిణవేధ గా నెరుగుడి. వక్రానువక్రుడైనప్పుడు వామ వేధయనబడును.

—కుజవేధాక్రమము.—

శ్లో॥ భూసుతస్యవిశేషస్తు జ్ఞాత్వాతత్రైవబుద్ధిమాన్
దశమైకాదశేభౌమే దండవేధో భవేత్తతః॥
అనువక్ర ఇతిఖ్యాతో జాయతేకుటిలాగతిః
ద్వాదశ్యాంతు త్రయోదశ్యాం చతుర్దశ్యాం విశేషతః॥
సూర్యాదిగణ్యతారాయాంవక్రో భవతిభూమిజః
వక్రస్థేభూసుతేసూర్యే దక్షిణంపార్శ్వవేధతః॥
అష్టాదశేసప్తదశే స్థానమేకోనవింశతిః
మహావక్ర ఇతిఖ్యాతస్తస్య వేధో భవేత్తతః
ప్రథమేచ చతుర్థాంతు వింశత్యాంచ తతఃపరః
జాతిసంజ్ఞా ఇతి ప్రోక్తామంద దక్షిణవేధతః
రవేర్ద్వావింశతిః పంచషష్ఠే సప్తమసంజ్ఞికే
అతిశీఘ్రగతిర్జ్ఞేయావామ వేధో భవేత్తతః
నవమేచ చతుర్వింశ త్సప్తవింశతి భేదతః
కుజే శీఘ్రగతి ర్జ్ఞేయా వామవేధో భవేత్తదా
ద్వితీయే షోడశేచైవ పంచదశ్యావిశేషతః
మందసంజ్ఞా కుజే ప్రోక్తాఽర్ఘ వేధా భవేత్తథా
తృతీయమేకవింశంచ పంచవింశత్తథోత్తరే

వికలాయాం సమత్వేచ చతుష్కోణంచ వేధతః
అష్టమేచత్రయో వింశేషడ్వింశేచ వికర్ణతః
ఏవంఫలాఫలం జ్ఞాత్వా యోజయే త్కాల విత్తమః॥
ఏవం సూర్యాత్మజాద్జ్ఞేయం శుభాశుభ వినిర్ణయం॥

సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని ౧౦-౧౧ వ నక్షత్రములందు అంగారకుడుండు నపుడు అదిదండవేధ యనబడును. ఇది అనువక్రకుటిలగతులు. ౧౨-౧౩ ౧౪ వ నక్షత్రములందు కుజుడున్నపుడు వక్రిదు, దక్షిణవేధ ౧౭-౧౮-౧౯ ట అతివక్రము. వామవేధ ౧-౪-౨౦ ట జాతిసంజ్ఞ. మందగతి దక్షిణవేధ ౨౨-౫-౬-౭ అతి శీఘ్రగతి. వామవేధ ౯-౨౪-౨౭ ట శీఘ్రగతి. వామవేధ ౨-౧౬-౧౭ ట మందగతి కర్ణవేధ ౩-౨౧-౨౫. వికలసమగతి. నాలుగుకోణములను వేధించును. ౮-౨౩-౨౬ ట వికర్ణవేధ. ఈరీతినే ౨౮ నక్షత్రములకును, శనికి వేధలు చూచునది.

శ్లో. విపరీతం తథారాహోః ఫలం తత్రవిశేషతః.

తా. రాహువునకు వ్యత్యయముగా జూచునది. అనగా దక్షిణవేధయే గాని మరియే వేధలును లేవు.

శ్లో. కోణస్థ ఋక్షయోర్మధ్యే అంత్యాదిపాదగే గ్రహే
అకారాది చతుష్కంచ పూర్ణవేధా ప్రజాయతే.

తా. కోణమందున్న రెండు నక్షత్రములయొక్క అంత్య, ఆది పాదములందు గ్రహములుండిరేని అకారాది నాలుగక్షరములకును పూర్ణవేధ.

శ్లో. భమోక్షేషు రేహాని స్వరేవ్యాధిర్భయంతిథౌ
రాశివేధే మహావిఘ్నం పంచవేధేనజీవతి.

తా. చక్రమందు గ్రహములు వేధించునప్పుడు నక్షత్ర, అక్షర, స్వర, తిథి, రాశి అను వీనిని ఒకవేళ వేధించును. అన్నిటికిని ప్రత్యేకఫలములు కలవు. అదియెట్లనిన; నక్షత్రవేధవలన భ్రమగలుగును, అక్షరమును వేధించెనేని హానిగలుగును. స్వరమును వేధించెనేని రోగముగలుగును. తిథినివేధించెనేని భయముగలుగును రాశిని వేధించెనేని యత్నకార్యాదులకు గొప్పవిఘ్నము గలుగును. ఈనక్షత్ర, అక్షర, స్వర, తిథి, రాశి అనునవి తనజన్మకాల సంబంధములని యర్థము. అనగా; జన్మనక్షత్రము, తననామాద్యక్షరము, ఆనామాద్యక్షరము వైనయుదుస్వరము, జన్మతిథి, జన్మరాశి

న్ని యని యెరిగేది. ఈ ౫ టిలో నొక్కదానిని పాపగ్రహము భేధించినని దాని ఫలము వేర్వేరుగా పైనవ్రాయబడెను. ఒకవేళ క్రూరగ్రహము చేత ౫టిలో ౪ లేక ౫ టి ని పాపునివేధలు గల్గినని "చతుర్విద్ధాన జీవతి, పంచవిద్ధోనజీవతి" యని చెప్పటవల్ల నట్టిమనుజుండు జీవింపడని తెలియువలయును.

—షడ్జన్మనక్షత్రవివేక .—

శ్లో॥ జన్మభం జన్మనక్షత్రందశమం కర్మసంజ్ఞికం
సాంఘాతిక మితిప్రోక్తం ఋక్షంషోడశసంఖ్యయా
ఏకోనవింశదాధానంత్రయోవింశద్వైనాశనం
అష్టాదశంచనక్షత్రంసాముదాయిక సంజ్ఞకం
జాతిర్దేశోభిషేకస్తుచతుర్థాను స్త్రయోదశం
పంచవింశంమానసంచ సప్తమంనైధనం స్మృతం॥

తా. తనజనన నక్షత్రము జన్మర్క్షమనియు, తనజన్మనక్షత్రము మొదలుకొని ౧౦ వది కర్మనక్షత్రమనియు, ౧౬ వది సాంఘాతికమనియు, ౧౯ వది ఆధానమనియు, ౨౩ వది వైనాశికమనియు, ౧౮ వది సాముదాయికమనియు, ౪ వది జాతియనియు, ౧౫ వది దేశమనియు, ౧౩ వది అభిషేకమనియు, ౨౫ వది మానసమనియు, ౭ వది నైధనమనియును జెప్పబడును. ఇందుషడ్జన్మనక్షత్రవివేకము ౬ నక్షత్రములు గాక మరికొన్ని విశేషనక్షత్రములు గూడ జెప్పబడినవి. వీనియొక్క ఫలములను ముందు జెప్పుచున్నాడు.

శ్లో॥ కృత్తికార్ద్రాత్రిధా శ్రేషా ఉత్తరావాయుమైంద
తథైవచోత్తరాషాఢా శతతారాచ రేవతీ
జాతిసంజ్ఞా ఇతిప్రోక్తాః ఉపర్యుపరితారకాః
దేశాభిషేక సంజ్ఞశ్చకర్తవ్యమితిచోచ్యతే॥

—వేధాఫలం.—

శ్లో॥ జన్మర్క్షేచ భవేన్మృత్యుః కర్మణాక్లేశ సంభవః
ఆధానక్షేప్రవాసశ్చవైనాశేబంధువిగ్రహః
సాముదాయే త్వనిష్టంచ హానిస్సాంఘాతికేతథా
నైధనేరుణ బాధాస్యాత్కదాచిన్మరణం భవేత్

జాతిభేదకులనాశస్స్యాద్దేశభేదవంశ నాశనం
అభిషేకేభవేన్మృత్యుస్తాడనం పావధూమృతిః
మానసేచ మనోవ్యాధిః కలహం కార్యనాశనం ॥ ఇతి॥
ఏకవేధిభయం యుద్ధే యుగ్మవేధే ధనక్షయః
త్రివిధేన మతిర్భంగో మరణం స్యాచ్చతుర్గ్రహైః
కదాచిత్పంచవేధేన దేహైరపివినాశనం
యథాదుష్టఫలాః క్రూరాస్తథాసౌమ్యాశ్శుభప్రదాః
క్రూరయుక్తస్తథావక్రాస్సౌమ్యాః క్రూరఫలప్రదాః॥
అర్కవేధే మనస్తాపం ద్రవ్యహానిశ్చ భూసుతే
రోగపీడాకరస్సౌరీ రాహుర్విఘ్నప్రదాయకః
బంధనం కేతువేధాస్స్యాద్ధానిర్మరణమేవచ
చంద్రేమిశ్రఫలం పుంసాం రతిలాభంచ భార్గవే
బుధవేధే మహాప్రాజ్ఞో జీవస్సర్వఫలప్రదః
తిథిరాశ్యంశనక్షత్రం విద్ధం క్రూరగ్రహేణయత్
సర్వేషు శుభకార్యేషు వర్జయేత్తత్ప్రయత్నతః
ననందతి వివాహేచ యాత్రాయాం ననివర్తతే
నరోగాన్ముచ్యతే రోగీ వేధవేళాకృతోద్యమః
రోగకాలే యదా వేధాస్సంభవేత్క్రూరఖేచరైః
వక్రగత్యాభవేన్మృత్యుశ్శీఘ్రవేధోతిరోగకృత్
వేధస్థానే రణే భంగో దుర్గే గండః ప్రజాయతే
కథాప్రవేశనం తత్ర మోఘఘాతశ్చ తత్ర వై॥

తా॥ తనజన్మనక్షత్రతిథిరాశ్యంశ అక్షరస్వర వారాదులను పాపగ్రహములు వేధించినందుకు ఫలము పైనే చెప్పబడెను. మరియే నక్షత్రాదులను పాపగ్రహములు వేధించినను ఆవేధింపబడిన నక్షత్రాదులయందు సకలశుభకార్యములను వర్జింపవలయును. ఏకార్యములను చేయరాదు. ఒకవేళ చేయునెడ వివాహము చేసినను దంపతులు ఆనందింపరు. ప్రయాణము వెళ్ళినవారు తిరిగిరారు. రోగారంభమయితే ఆరోగము విడువదు గనుక పాపగ్రహముచే వేధింపబడు నక్షత్రరాశ్యాదులందు ఏదిన్ని ఆరంభింపవలదని తాత్పర్యము.

[illegible] తారకము నుండి [illegible] ప్రథమపాద మునున్న ౨వ పాదమున్నది [illegible] ౩వ పాదమునందుండి ౪వ పాదమును వేధించును. [illegible] వేధచేత వేధించును. అనగా కృత్తికయందుండు గ్రహము భరణియొక్క [illegible] అకారమునున్న పైన చెప్పిన పాదవేధవలన పూర్ణముగా వేధించును. ఈలాగుననే అన్నియును దెలియదగును. జన్మనక్షత్రాదులను వేధించుటవలన ప్రత్యేకఫలములన్నియును వెనుకనే చెప్పబడెను.

—గ్రహముల ప్రత్యేక వేధాఫలవిశేషములు.—

శ్లో॥ రవేః॥ రవౌ జ్వరాగ్నిపీడాశ్చ వాతపైత్యాది విభ్రమః
అర్కవేధేమనస్తాపం రాజమంత్రివిరోధకృత్
శిరశ్శూలం ప్రవాసంచ కార్యనాశం ధనక్షయం
పితృమాతృవిరోధంచ బహుదుఃఖం పశుక్షయం
చంద్రేమిశ్రఫలం పుంసాం యుద్ధేతత్రమృతింవినా॥

తా॥ ఈఫలములు క్షీణచంద్రునితో గూడినరవి వేధించెనేని తప్పక కేవల రవి మాత్రమే వేధించెనేని కొన్నిఫలములు మాత్రమే జరుగును.

—క్షీణచంద్రవేధాఫలము.—

క్షీణచంద్రస్య॥ శ్లో॥ కార్యహానిర్మనస్తాపం దేహక్షోభాదిరోగకృత్
ప్రవాసంబంధనం చైవ క్షీణచంద్రస్యవేధత॥ ॥స్పష్టార్థః॥

—పూర్ణచంద్రవేధ.—

శ్లో॥ భూషణం వస్త్రమానందో కంఠయానశయ్యాసనాదికం
సర్వవ్యాధివినాశంచ పూర్ణచంద్రస్యవేధత॥

—కుజవేధ.—

శ్లో॥ భౌమవేధేఽతి దాహశ్చద్రవ్యనాశంకులక్షయం
ధాన్యభూషణనాశశ్చ శత్రూణాం క్షోభనాశకృత్
దూరయాత్రాదిశౌర్యత్వం ద్రవ్యహానిశ్చరక్తకృత్
క్షేత్రస్య పరినంవాదో వియోగం కలహప్రదం
కార్యహానిర్మనస్తాపః కుక్షిశూల ప్రదోభవేత్॥

—రవి కుజ శనుల వేధాఫలము.—

శ్లో॥ రవిభౌమార్కి వేధేస్తు ఉన్మాదం ఖాతగాయధా
ప్రమేహాశీతరోగాశ్చ జ్వరమూత్రభగంధరాః
శీతంచరక్తపిత్తాఖ్యం శాకినీ డాకినీభయాః॥

—బుధ వేధాఫలము.—

శ్లో॥ బుధేస్త్రీవేదవిద్యాప్తి రాజవిగ్రహ శాంతయః
వివాహం రాజ్ఞసన్మానం కృషివాణిజ్యసేవనం
బంధనవ్యాధి మోక్షౌశ్చ తేజోబలయశాంసిచ
అస్తగేకూరయుక్తేచే ద్విపరీత మిదంఫలం॥

—గురు వేధాఫలము.—

శ్లో॥ గురౌనర్వార్థసిద్ధిస్స్యాద్రాజవిగ్రహశాంతికే
వివాహం కృషివాణిజ్య సేవనం బంధుపూజనం
కూరగ్రహయుతే జీవేమరణం వ్యాధిపీడనం
రాజభీ భంతథా కార్యనాశంచైహాపవాదకః॥
మనఃక్లేశం ప్రవాసంచపుత్రస్త్రీరోగబంధనం
శరీరస్యసుఖాః సర్వాన్నాశయుః సర్వసంపదః॥

తా॥ గురుడు నిసర్గాది షడ్బలయుక్తుడై పాపులతో కూడినను శుభఫలమునే యిచ్చును. బలహీనుడై శుభులతో గూడెనేని మిశ్రఫలము నిచ్చును. బలహీనుడై పాపులతో గూడెనేని మిక్కిలి దుష్టఫలము నిచ్చును. బలవంతుడై శుభులతో గూడెనేని యత్యంత శుభుడగును ఈలాగుననే శుభులగు చంద్ర, బుధ, గురు, శుక్రులు వలుగురికిని గూడ నాలోచింపవలయును. స్థానాదిషడ్బల సాధనము యుత్తరభాగములో జెప్పఁబడును.

—శుక్ర వేధాఫలము.—

శ్లో॥ శుక్రేణ జ్ఞానయోగాశ్చ రాజవిగ్రహశాంతయః
స్త్రీసంయోగం ధనప్రాప్తిర్వివాహంసౌఖ్యమేవచ
పుత్రపౌత్రాశ్చమిత్రాణాం ధనధాన్యసుఖానిచ

భూలాభం రత్నలాభంచ వాహనాంబర భూషణం,
జలధాన్యాని వస్త్రాని శుక్రవేధే ప్రసిధ్యతే॥
భార్గవసూరి యుక్తేతు ధనధాన్య వశుక్షయః
కలహం స్త్రీభిరేవస్యాత్ప్రవాసైర్వా న సంశయః॥

—శనివేధాఫలము.—

శ్లో॥ శనౌ వ్యాధ్యాది భూభ్రంశో బంధుపుత్ర సుహృద్వ్యయః
చాతుర్థిక శాది రోగశ్చ ప్రవాసే బంధనం తథా॥
స్థానహానిశ్చ మహా వ్యాధిర్నీచస్త్రీ ప్రశుసేవనం
అభిచారో గ్రికర్మాణి మరణం పరచక్రతః॥
తస్కరాయుద్ధ యాత్రాయాం శరీరక్షయ కృద్భవేత్
రోగపీడాకరస్సౌరిః శనివేధే ప్రసిధ్యతి॥

—రాహు కేతు వేధాఫలములు.—

శ్లో॥ రాహౌ హృద్రోగకృన్మూర్ఛా చాతుర్థిక పిశాచకాః
సర్వకార్యేషు సర్వేషు రాహుర్విఘ్నప్రదాయకః
శూద్రస్త్రీ విధవాసక్తో బ్రహ్మద్వేషీ చ జాయతే
శనివత్కుజవచ్చైవం రాహుకేత్వోశ్శుభాశుభే॥

తా॥ ఈలాగున రాహు కేతు వేధల ఫలములు తెలియవలయును. పాపులగు కుజ శనులు వక్రించి వేధించినయెడల నతిక్రూరఫలము నిచ్చును. శుభులు వక్రించి వేధించిరేని శుభఫలము నిత్తురు.

—నక్షత్రములకు ప్రత్యేకగ్రహదృష్టులు.—

శ్లో॥ అతః పరం ప్రవక్ష్యామి గ్రహదృష్టివశాత్ఫలం
గ్రహదృష్టివశాత్సర్వం రాశిమేకం ప్రకల్పయేత్॥

తా॥ గ్రహములు రాసులను జూచునట్లే నక్షత్రములను గూడ చూతురు. అట్టి నక్షత్రములపైని గ్రహదృష్టులకు ఫలముం జెప్పుచున్నాడు.

రవిచంద్రదృష్టి:—శ్లో॥ మనుం పంచదశం ౧౪-౧౫ నక్షత్రాద్వీక్ష్యతే ద్యుమణిస్సదా। తద్వచ్చంద్రోపి పూర్ణశ్చేచ్ఛుభో పాతేను భోన్యథా॥

తా. సూర్యచంద్రులిద్దరు ౧౪-౧౫ స్థానములు రెండిని గూడ జూచు చుందురు. పూర్ణశశి శుభుడును; అపూర్ణశశి అశుభుడు నగుదురు.

శనిదృష్టిః—శ్లో॥ సౌరిస్థితర్క్షమారభ్య త్రిపంచ త్రిపంచకం
ఏకోనవింశతిశ్చైవ వీక్ష్యతే మందనాయకః॥

తా॥ శని తానున్న నక్షత్రము మొదలుకొని ౩-౧౫-౧౯ వ నక్షత్రములను జూచును.

కుజదృష్టిః—శ్లో॥ భూమిపుత్రస్థితర్క్షాదినష్టాష్టతిథిసంజ్ఞకం
వీక్ష్యతే భూమిపుత్రస్తు స్వస్థానంచ త్రితారకం॥

తా॥ కుజుడు తానున్న నక్షత్రాదిగ ౬-౮-౧౫-౧-౩ వ నక్షత్రములను జూచును.

గురుదృష్టిః—శ్లో॥ దేవమంత్రిస్థితర్క్షాదిత్రిపంచదశమం తథా
ఏకోనవింశతిశ్చైవ వీక్ష్యతే దేవపూజితః॥

తా॥ గురుడు తానున్న నక్షత్రాదిగ ౩-౫-౧౦-౧౯ నక్షత్రము లం జూచును.

బుధశుక్రదృష్టిః—శ్లో॥ బుధశుక్రస్థితర్క్షాదిస్వస్థానంచ త్రిపంచకం॥

తా॥ బుధశుక్రులు తామున్న నక్షత్రాదిగ ౧-౧౫- వ నక్షత్రములను జూచును.

—గ్రహదృష్టినక్షత్రఫలం.—

రవివీక్షణఫలము.

శ్లో॥ యస్యర్క్షస్య దృశో భానుస్తస్య భంగో భవేద్ధ్రువం॥

తా॥ ఎవరియొక్క జన్మ లేక నామనక్షత్రములను రవి చూచెనేని వారికి భంగము గలుగును. చంద్రాదులను గూడ జెప్పుచున్నారు.

శ్లో॥ క్షీణచంద్రస్య దృష్టౌ వాతస్య భంగో భవేద్ధ్రువం
అంగారకదృశో యస్య తస్య భంగో భవేద్ధ్రువం
బుధదృష్టిగతో యత్ర తస్య లాభో భవేద్ధ్రువం
గురుదృష్టిగతో యత్ర తస్య లాభం శుభం వదేత్
కవిదృష్టిర్యస్య తారా రాజయలాభో భవేద్ధ్రువం
సౌరినామదృశో యస్య తస్య భంగో మృతిప్రదః॥

తా॥ [illegible]గున జన్మనామనక్షత్రములను రొకరు చూతురో వారికి చెప్పబడ్డ శుభాశుభములను చెప్పనది.

—నక్షత్రములకు ద్వ్యాదిగ్రహదృగ్యోగఫలము.—

శ్లో॥ రవిచంద్రదృశౌయస్యతస్యమృత్యుర్నసంశయః
రవిభౌమదృశౌయస్యమృత్యురేవన సంశయః
రవిసౌమ్యదృశస్తారాతస్యభంగః పలాయనం
రవేర్గురోర్దృశస్తారాజయ లాభసుఖావహం
రవిశుక్రదృశౌ యత్రతస్యమృత్యుర్నసంశయః
రవిసౌరిదృశోయస్యతస్యమృత్యుర్నసంశయః॥
చంద్రభౌమౌ యస్యతారా దృశోమృత్యుర్నసంశయః
శశిసౌమ్యదృశోయత్రతస్యలాభోభవేద్ధ్రువం
గురుచంద్రదృశోయస్యజయలాభోభవేద్ధ్రువం
చంద్రశుక్రదృశౌయస్యలాభంచ జయసంభవం
శశిసౌరి దృశోయస్యతస్యమృత్యుర్నసంశయః
భౌమసౌమ్యదృశోయస్య తస్యభంగోల్పదస్మృతః
గురుభౌమదృశస్తారాయుద్ధేభంగోనవిద్యతే
కుజసౌరిదృశోయస్యతస్యమృత్యుర్నసంశయః
భృగుభౌమదృశోజన్మతారాసర్వార్థసిద్ధిదా
గురుసౌమ్యదృశస్తారా తస్యలాభోభవేద్ధ్రువం
భృగుసౌమ్యదృశోయస్యతస్యలాభం జయంసుఖం
బుధసౌరిదృశోయస్యతస్యభంగోమృతింవినా
గురుశుక్రదృశాంయస్యజన్మనామర్క్షయోరపి
తస్యతేఖ్యాతిమతిమాన్ విజ్ఞేయం లాభమేవచ
గురుసౌరిదృశోయస్య తస్యభంగశ్చజాయతే
శుక్రసౌరిదృశౌయస్యప్రాణఘాతంచజాయతే॥
క్రూరగ్రహాచతుష్కంచ యస్యజన్మదృశస్తథా
తస్యభంగమవాప్నోతి మరణంచ ప్రజాయతే
శశిసౌమ్యజ్యశుక్రాణాం యస్యజన్మదృశౌభవేత్

తస్యలాభం యుతయాసాఖ్యం సంస్తూతి స్వస్త్యాలో ఋతౌ
వక్రాదిదృష్టిః—వక్రగా శ్చాశుభాదృష్టిః క్రూరదృష్టిస్తథాంతథా
శుభదృష్టిః శీఘ్రగత్యా అత్యంతఫలదాయినీ
అస్తగే నీచగేవాపి శుభదృష్టిశ్చ నిష్ఫలా
క్రూరయుక్తశుభాదృష్టిరర్థహానిశ్చ విందతి
క్రూరశీఘ్రగతాదృష్టిరత్రధ్యమంచ ఫలంభవేత్
అస్తంగతగ్రహైర్దృష్ట్యాంనిష్ఫలంచ భవేద్ధ్రువం
యస్యరాశ్యధిపశ్చైవ సూర్యయుక్తో మహాద్భయం
శుక్లపక్షే శుభఖగే అగ్రదృష్టిఫలంభవేత్
కృష్ణపక్షే శుభాఃఖేటాః పృష్ఠదృష్టిస్సదాభవేత్
కృష్ణపక్షే క్రూరఖేటాః అగ్రదృష్టిస్తథాభవేత్
శుక్లపక్షే క్రూరఖేటాః పృదష్టిశ్చజాయతే॥
పూర్వాహ్ణాతి శుభాస్స్వగ్రే అపరాహ్ణేచ పృష్ఠతః
పూర్వారాత్రౌ శుభాశ్చాగ్రే ఉపరాత్రౌచ పృష్ఠతః॥

తా॥ ఈరీతిని బహుప్రకారములుగా చెప్పబడు చేష్టలయినను ఎవరి జన్మరా శి నక్షత్రములపై యెటువంటి దృష్టి పడునో యేవిధమయిన గ్రహముయొక్క దృష్టి పడునో అట్టిస్థితి ననుసరించి గట్టిగా పరిశీలించి వారి కాఫలమును చెప్పవలయును. మరియు వక్రగతిగల శుభ గ్రహ దృష్టియు, సమగతిగల క్రూరగ్రహదృష్టియు శీఘ్రగతిగల శుభగ్రహదృష్టియు నత్యంత శుభఫలము నే యిచ్చును. అస్తంగతుడును నీచగతుడునగువాడు శుభుడైనను వానిదృష్టి నిష్ఫలమట. పాపగ్రహ యుక్తుడగు శుభగ్రహము యొక్క దృష్టి ధనహాని గలుగజేయును. శీఘ్రగతిగల క్రూరుని దృష్టి సమఫలమిచ్చును అస్తంగతునిదృష్టి నిష్ఫలమునిచ్చును ఎవరియొక్క జన్మ రాశ్యాధిపతి రవితోగూడునో వారికి గొప్పభయం బుప్పతిల్లును. శుక్లపక్షమున శుభులును, కృష్ణపక్షమున క్రూరులును, పగలు పూర్వాహ్ణమున శుభులును అపరాహ్ణమున పాపులును పూర్వరాత్రియందు శుభులును, ఉత్తర రాత్రియందు పాపులును ముందుకు అనగా పురోభాగమును జూతురు. వీరద్వ్యత్యయ కాలమునందు వారు వారు వెనుకకు అనగా పృష్ఠభాగమును జూతురు. పృష్ఠ దృష్టికంటె పురోదృష్టి శుభకరము.

—నవతారావిభాగము.—

శ్లో॥ జన్మసంపద్విపత్క్షేమప్రత్యక్సాధననైధనం

మిత్రంపరమమైత్రించనవతారాః ప్రకీర్తితాః॥
జన్మతారావిపత్తారా ప్రత్యక్ష్నైధనతారకే
పాపగ్రహసమాయోగేమృత్యుర్భవతిచంద్రమాః॥
శుభగ్రహసమాయోగే శుక్లపక్షేమృతింవినా॥

తా॥ జన్మ, విపత్- ప్రత్యక్, నైధన, ఈతారలయందు పాపగ్రహములుండి లేని మరణ ప్రదు లగుదురు, క్షీణచంద్రుడున్నను అట్లే యగును. వారితోడ శుభులు గూడినను, శుక్లపక్ష చంద్రుండైనను చావును మాత్రము చేయరు.

శ్లో॥ సంపత్తారాక్షేమతారాసాధనం మిత్రమైత్రిభం
శుభగ్రహసమాయోగే తస్యలాభోభవేద్ధ్రువం॥

తా॥ ఈతారలతో శుభులు గూడిలేని విశేషలాభము గల్గును.

శ్లో॥ యస్యజన్మత్రయేవేధే మృత్యుస్స్యాత్క్రూరఖేచరైః
శుభవేధేజయంలాభం తత్రతత్రవినిర్దిశేత్॥

తా॥ ఎవరికి 3 నవకములయందలి జన్మతారలు పాపులచేత వేధింపబడునో వారికి హానిగలుగుననియు, శుభులు వేధించిలేని జయము, లాభమును గలుగుననియు నిశ్చయముగా జెప్పబడును. మరియు క్షేమ, ఆరోగ్య, సుఖములు గలుగును.

—నవతారాస్థితగ్రహఫలం—

శ్లో॥ జన్మత్రయస్థితస్సౌరీ క్షేమాయాం రాహుభూమిజౌ
మిత్రాతిమిత్రగేసూర్యే జాయతే వధబంధనం॥

తా॥ జన్మతారాత్రయమందు శనియును, క్షేమతారాత్రయమందు రాహుకుజులును, మిత్ర, పరమమైత్ర తారాత్రికమందు రవియు నుండి లేవి యాతారలు వచ్చిన దినమందతికష్టములును, కట్టుబ్లుగలుగును. మృతవార్తాశ్రవణము గాని మృతిబొందినవారిం జూచుట గాని జరుగును.

శ్లో॥ జన్మత్రయే గురుర్యస్య క్షేమాయాంబుధభార్గవౌ
మిత్రాతిమిత్రగేచంద్రే తస్యలాభం సుఖంభవేత్॥
సాంఘాతికస్థోయది భూమిపుత్రో వైనాశికస్థోయది రాత్రినాథః
అశ్వేనవాతచ్ఛకటేనపాతో వినాశనంయాతినరస్యసమ్యక్॥

వైనాశికస్థోయదిభూమిపుత్రస్సూర్యస్యసౌరేర్నిధనంప్రయాయాత్
వ్యాధేస్సకాశాన్మరణం నరస్యసంవత్సరాంతేమరణంచనూనం॥
జన్మర్క్షగోయస్య నరస్యఖేటోనిహన్యతే పంచవిధోక్తయాయాత్
మాసేనమృత్యుంసముపైతితస్య గర్గార్యముఖ్యామునయోవదంతి॥
కర్మర్క్షగోవాప్రదదాతి మృత్యుర్మాసద్వయేన త్రిదినాదికేన
చతుష్పదాద్వాదశవాసరాణాం వర్గప్రపన్నస్యనరస్యతస్య॥
సాంఘాతికాత్త్రిభిరేవమాసైశ్శనైశ్చరః పంచభిరేవధత్తే
మృత్యుంగతేన స్వగృహస్థితస్య నరస్యమాసె కిమువాక్యపేతత్
మాసైశ్చ తుర్భిశ్చతదైవతత్రిశస్త్రేణ మృత్యుం ప్రదదాతినూనం॥
ఏతేనవా బంధనతోయతోవాస్వయం వినశ్యేదపిదేవరాజః
వైనాశికస్థఃప్రదదాతి మృత్యుంగతేనరోగేణబుభుక్షయావా॥
దినైస్త్రిభిఃపంచభిరేవధత్తేవిదేశసంస్థస్య నరస్యనూనం
మృత్యుస్తథామానసగోనరాణాం మాసైశ్చతుర్భిర్విదధాతిమృత్యుః
జన్మర్క్షగోవాదివసాధినాథస్సాంఘాతికస్థౌశశిభూమిపుత్రౌ
మృత్యుస్తథాశస్త్రకరోనరస్యసంప్రాప్యతే ద్వాదశరాత్రమధ్యే॥
జన్మర్క్షగోవాదివసాధినాథస్సాంఘాతికస్థౌశశిభూమిపుత్రౌ
మాసత్రయేణైవ భవేన్నరస్య తస్యాంతరే వాయువికారజాతః॥
యద్యోదయేస్యాద్దివసాధినాథోసాంఘాతికస్థౌశశిభూమిపుత్రౌ
ఉదానరోగేణతథావినాశస్సంప్రాప్యతే రక్తవికారజాతః॥
వైనాశికస్థో యదివాసరే శోమనస్థితౌ భూమిజరాత్రినాథౌ
మృత్యుప్రదంస్యాద్దివసత్రయేణ షణ్మాసయుక్తేనధ్రువంనరస్య॥
చతుష్పదాద్వామరణంచ తస్యతథాభవేన్మాస చతుష్టయేన
మనర్క్షగస్యాపిచవాసరేశోజన్మర్క్షగౌ భూమిజరాత్రినాథౌ
తథావినాశో మనుజస్యభావివర్షేణమాసత్రియ సంయుతేన॥
జన్మర్క్షగస్స్యాద్యది భూమిపుత్రస్సాంఘాతికే రాత్రిపవాసరేశౌ
తథాసకాశాన్మరణం నరస్యతథా భవేన్మాస చతుష్కమధ్యే॥
సాంఘాతికస్థోయది భూమిపుత్రోదయర్క్షసంస్థౌ రవిరాత్రినాథౌ

మాసాష్టకం స్యాన్మరణం నరస్య శూలాశ్మరీ వాగ్రహణీవికారైః॥
అష్టాదశస్థోయది భూమిపుత్రో జన్మర్క్షగారాత్రిపవాసరేశౌ
అజీర్ణతస్స్యాన్మరణం నరస్య క్షుధార్తికృత్తస్య తథాభవేద్వా॥
జన్మర్క్షకస్స్యాద్యదిసూర్యపుత్రః కర్మర్క్షగౌభౌమనిశాకరౌతు
మాసైస్త్రిభిస్స్యాన్మరణం నరస్యశస్త్రాభిఘాతోప్యథవాత్రఘాతః॥
కర్మర్క్షగస్స్యాద్యది సూర్యపుత్రస్సాంఘాతి కస్థౌకుజరాత్రినాథౌ
సంవత్సరేణ ప్రవదంతి మృత్యుంతథానరస్యాగ్ని సముద్భవంచ॥
సాంఘాతిక స్థోయది సూర్యపుత్రస్తథోదయర్క్షౌకుజరాత్రినాథౌ
మాసైశ్చతుర్భిర్దినవసైశ్చతుర్భిస్తథాభవేత్తన్మరణంనరస్య॥
ఉదయర్క్ష సంస్థోరవిజోయదిస్యాద్వైనాశికస్థౌకుజ రాత్రినాథౌ
తదాష్టమాసాత్ప్రభవోహిమృత్యుర్భవేన్నరస్యప్రమదాత్ప్రకాశాత్
వైనాశికస్థోయదిసూర్యపుత్రోమనస్థితౌభూమిజరాత్రినాథౌ
తదార్ధమాసాష్టభిరేవ మృత్యుర్భవేన్నరస్యక్షుదధిప్రకోపాత్॥
మనస్థితస్స్యాద్యది సూర్యపుత్రో జన్మర్క్షసంస్థౌకుజరాత్రినాథౌ
మాసైశ్చతుర్భిర్మరణం నరస్యతథాభవేద్రోగకృతస్సురేంద్ర.
నవనక్షత్రనవనీత స్వజాతి దేశాభిషిక్తః
ఏతేషాంపీడాయాందినమేక ముపోషితం కిలజుహుయాత్॥

శ్లో॥ రిక్తాష్టమీ త్రయోదశ్యాం మందారగురువాసరే
జాతిదేశాభిషేకేషు యోగేషుక్రమశస్తథా॥
యోగాస్తేధారణాఖ్యాశ్చ త్యాజ్యాస్తైరుగ్రకర్మణి
నక్షత్రగ్రహపక్షే చ చేదమేద్వ్రాజలేన్నృపః॥
క్రూరగ్రహస్య సంస్పర్శంయస్యనామర్క్ష సంస్థితః
తస్యమృత్యుర్నసందేహో రోగాద్వామరణంభవేత్॥ ఆర్యా॥
రవిజాహిమహీజాస్తేష్వేకైకద్వాదశజన్మస్థాః
యదిచంద్రేణయుక్తస్స్యాద్యోనజీవతినసందేహః॥
అథానరుక్షే భృగునందనశ్చవైనాశికస్థో గురురాత్రినాథౌ

సువర్ణలాభోయదిపంచమాసాన్ వదంతిశాస్త్రార్థ విదోమహాంతః॥
కర్త్రర్క్షగస్యాద్రివిమండయుక్తో వైనాశికస్థో యదిరాత్రినాథః
సాంఘాతికస్థోయదిశుక్రవేధఃజన్మర్క్షగో వాయదిసౌమ్యవేధః
మాసైశ్చతుర్భిర్యదివాశ్వలాభోపి వాసయుక్తంయది వస్త్రలాభం॥

—అంశవేధాఫలము—

శ్లో॥ అంశవేధాయదాశుక్రారాశి వేధాబుధశ్శశీ
దశరాత్రిప్రకుర్వీత క్షేత్రలాభోనసంశయః॥
అంశవేధాయదాసూర్యా రాశివేధాకుజశ్శనీ
కలహంచార్థహానిశ్చదశరాత్రింనశంయః॥
సాంఘాతికస్థో యదిరాత్రినాథో ఆధానరుక్షే గురుసౌమ్యయుక్తః
పక్షత్రయేణైవదినత్రయేణభూభూషణ స్త్రీధన వస్త్రలాభం॥

—నక్షత్రాదివేధాపరిజ్ఞానము.—

నక్షత్రాదులకు సర్వతోభద్రచక్ర విన్యాసము లేకయే, సులభముగా వేధలు కనుగొనుటకై యీగ్రంథకర్త చే క్రిందిశ్లోకములు చెప్పబడియె.

౧. కృత్తికకు:—శ్లో॥ భరణ్యాకారౌవృషభంనందాంభద్రాంతులాంచతం
విశాఖాంశ్రవణంఖేటో విధ్యతేవహ్ని సంస్థితః॥

టీక॥ వహ్నిసంస్థితః=కృత్తికయందున్నట్టి, ఖేటః=గ్రహము, భరణ్యాకారౌ=భరణీ=భరణీనక్షత్రమును, అకారౌ=అకారమునున్ను, వృషభం=వృషభరాశినిన్ని, నందాం=నందతిథినిన్ని, దానితోగూడినరవికుజవారములనున్ను, భద్రాం=భద్రతిథినిన్ని, దానియం దలి చంద్రబుధవారములనున్ను, తులాం=తులారాశినిన్ని, తం=త, అనేఅక్షరమును, విశాఖాం=విశాఖానక్షత్రమునున్ను, శ్రవణం=శ్రోణానక్షత్రమునున్ను, విధ్యతే=వేధించుచున్నాడు.

తా॥ అనగా; కృత్తికయందున్న గ్రహము దాని పార్శ్వమందున్న భరణీనక్షత్రమునున్ను- రెండవపార్శ్వకోష్ఠకములో అవకహడాదివర్ణములలో మొదటిదగు అకారమునున్ను దీనియొక్క కర్ణమార్గముగా అనగా అయిమూలకోష్ఠములలో వరుసగా నున్నవృషభ, నందా, భద్రా, తుల, తకార, విశాఖలనున్ను- కృత్తికను అభిముఖముగనున్న శ్రవణమునున్ను వేధించును. ఈశ్లోకప్రకారము చక్రమందు జూచిన వక్ర

శీఘ్రాదిగతి భేదముచేత జెప్పబడిన దృష్టి అనగా- దక్షిణ, వామ, సమ్ముఖవేధాత్రయ మవగాహన యగును. దానివలన సమస్త శుభాశుభములను దెలియనగును.

౨. రోహిణికి:—శ్లో॥ వంయుగ్మంతథా కన్యాం రేఫంస్వాతిముకారకం.
అశ్వినీమభిజిద్ధంశ్చరోహిణీస్థో వియచ్చరః॥

తా॥ వ- మిధున- జౌ- కన్య- ర- స్వాతి- ఉ- అశ్వని- అభిజిత్తు- ఈ వ్రాయబడినవాటిని రోహిణి యందున్న గ్రహము వేధించును- యుగ్మమనగా మిధునమని యర్థము.

౩. మృగశిరకు:—శ్లో॥ కంకులీరంహరిం పంచంచిత్రాం అంలంచ రేవతీం
సమ్ముఖస్తంచవైశ్వర్క్షంసౌమ్యస్థోహంతిఖేచరః॥

తా॥ మృగశిరయందున్నగ్రహము ; క, కర్కాటక, సింహ, ప, చిత్రా, అ, ల, రేవతి, ఉత్తరాషాఢ, వీటినన్నిటిని వేధించును. సౌమ్య అనగా:—మృగశిర, వైశ్వర్క్ష=ఉత్తరాషాఢ, కులీర=కర్కాటం, హరి= సింహం, అని యర్థము.

౪. ఆర్ద్రకు:—శ్లో॥హంశౌకారంటంచహస్తంవంశ్చంచంతదుపాంత్యభం
హంతీఖేటస్థితేరౌద్రే పూర్వాషాఢాం తథాగ్రతః॥

తా॥ ఆర్ద్ర యందున్న గ్రహము ; హ, శౌ, ట, హస్త, వ, శ్చ, చ, ఉత్తరాభాద్ర, పూర్వాషాఢ, వీనినన్నిటిని వేధించును- ఉపాంత్యభం అనగా=ఉత్తరాభాద్ర, రౌద్ర=ఆర్ద్ర).

౫. పునర్వసు:—శ్లో॥ డంయుంభగంకంచవృషంమేషందంపూర్వభాద్రకం
సమ్ముఖస్తంద్దైత్యభంచ అంతౌహంతి ఖేచరః॥

తా॥ పునర్వసునందున్న గ్రహము డ, యు, ఉత్తర, క, వృషభ, మేష, ద, పూర్వాభాద్రా, మూల, వీని నన్నిటిని వేధించును, భగ=ఉత్తర,

౬. పుష్యమి:—శ్లో॥ ఊంపూర్వాం హంచమిధునం ఓంమీనంసంచవా
రుణం। సమ్ముఖస్థంజేష్ఠభంచ గురుభేహంతి ఖేచరః॥

తా॥ పుష్యమియందున్న గ్రహము ; ఊ, పుబ్బ, హ, మిథున ఓ, మీన, స, శతతార, జ్యేష్ఠ, వీనినన్నిటిని వేధించును.

పూర్వా=పుబ్బ, వారుణ= శతభిషం, గురుభ=పుష్యమి.

౭. ఆశ్రేషకు:—శ్లో॥ మఘాండంకర్కాటం నందారిక్తాకుంభగవాసవాః

సర్వస్థఃఖేచరోహంతి మైత్రభంచ పురస్థితం॥

ఆశ్లేషయందున్న గ్రహము; మఘ, డ, కర్కాటక, నంద, రిక్త, కుంభ, గ, ధనిష్ఠ, అనూరాధ, వీటిని వేధించును.

వాసవ= ధనిష్ఠ, సర్ప= ఆశ్లేష, మైత్రభ=అనూరాధ.

౮. మఘకు :—శ్లో॥ సార్పంమసింహాభద్రాశ్చజయామకరఖార్ హారిం
తదగ్రస్థంయామ్యభంచ పిత్ర్యభేవిధ్యతేఖగః॥

తా॥ మఘయందున్న గ్రహము; ఆశ్లేష, మకారము, సింహ, భద్ర, జయ, మకర, ఖ, శ్రవణ, భరణి, వీటిని వేధించును.

భద్రా= భద్రతిథి, జయా= జయతిథి, హారి= శ్రవణము. యామ్యభ= భరణి, పిత్ర్యభ= మఘ

౯. పుబ్బకు:—శ్లో॥ ఊం పుష ం టం స్త్రియం అంచధనుర్జమభిజిత్తథా
తదగ్రస్థం దస్రభంచ పూర్వాస్థో విధ్య తేఖగః॥

తా॥ ఊకారము, పుష్యమి, టకారము, కన్య, అం, ధనుస్సు, జ, అభిజిత్తు; అశ్వని, వీని నన్నిటినిన్ని పుబ్బయందున్న గ్రహము వేధించును.

స్త్రియం= కన్య, దస్రభ= అశ్వని. పూర్వ=పుబ్బ.

౧౦. ఉత్తరకు శ్లో॥ పంతులాంవృశ్చికం బంచపశ్వాం మండఃపునర్వసుం
అగ్రస్థంపౌష్ణభం ఖేటోవిధ్యతే చోత్తరాస్థితః॥

తా॥ ఉత్తరయందున్న గ్రహము ; ప, తుల, వృశ్చిక, బ, ఉత్తరాషాఢ, మకార, డ, పునర్వసు, రేవతి, వీటిని వేధించును.

విశ్వ= ఉత్తరాషాఢ, పౌష్ణభ= రేవతి.

౧౧. హస్తకు:—శ్లో॥రమేయంపూర్వాషాఢాంచటంఙాహంరౌద్రభంతథా
తదగ్రస్థోత్తరాభాద్రాంకరస్థోవిధ్యతేగ్రహః॥

తా॥ హస్తయందున్న గ్రహము ర, ఏ, య, పూర్వాషాఢ, ట ఙా, హ ఆర్ద్ర ఉత్తరాభాద్ర వీనినన్నింటిని వేధించును.

రౌద్ర = ఆర్ద్ర, కర = హస్త.

౧౨. చిత్రకు:—శ్లో॥ తంనంమూలాంపంచ సింహంకర్కాటకంచసౌమ్య
భం । తత్పురస్థాం పూర్వభాద్రాంత్వష్ట్రగోవిధ్యతేఖగః॥

తా॥ చిత్రయందున్న గ్రహము త, న, మూల, ష, సింహ, కర్కాటక, క, మృగశిర, పూర్వాభాద్ర వీనినన్నిటిని వేధించును.

సౌమ్యభ = మృగశిర, త్వష్ట్ర = చిత్ర.

౧౩. స్వాతికి:—శ్లో॥ ఋం జ్యేష్ఠారం స్త్రియం ఔం చ మిథునం వం కభం తథా
తదగ్రస్థం వారుణం చ విధ్యతేఽనిలగో గ్రహః

తా॥ స్వాతియందున్న గ్రహము ఋ, జ్యేష్ఠ, ర, కన్య, ఔ, మిథునం, వ, రోహిణి, శతభిషం, వీనినన్నిటిని వేధించును.

స్త్రియం = కన్య, కభం = రోహిణీ, అనిల = స్వాతి.

౧౪. విశాఖకు:—శ్లో॥ మిత్రం తం చ తులాం భద్రాం నందాం వృషము కారకం । వహ్ని వాసవభే ఖేటో ద్విదైవస్థో హి విధ్యతే॥

విశాఖయందున్న గ్రహము ; అనూరాధ- త- తుల- భద్రా- నందా- వృషభ- అకార- కృత్తిక- ధనిష్ఠ- వీని వేధించును.

మిత్ర= అనూరాధ- వహ్ని =కృత్తిక- వాసవ= ధనిష్ఠ- ద్విదైవ=విశాఖ.

౧౫. అనూరాధకు:—శ్లో॥ విశాఖాం నం వృశ్చికం చ జయ రిక్తే జలౌ యమం
తదగ్రగం సార్పభం చ హంతి మిత్రభగో గ్రహః॥

తా॥అనూరాధయందున్న గ్రహము ; విశాఖ- న- వృశ్చిక- జయ- రిక్త- మేష- ల- భరణి- ఆశ్లేష- వీనిని వేధించును.

అజ= మేషము- యమ= భరణి- మిత్రభ= అనూరాధ.

౧౬. జ్యేష్ఠకు:—శ్లో॥ ఋం స్వాతీం యం చాపమాశ్వమీన చౌ దస్రభం తథా । తత్పురః పుష్యభం హంతి జ్యేష్ఠభస్థో వియచ్చరః॥

తా॥ జ్యేష్ఠయందున్న గ్రహము ; ఋ- స్వాతి- య- ధనుస్సు- అః మీన- చ- అశ్వనీ- పుష్యమి- వీనిని వేధించును.

చాప= ధనుస్సు- దస్రభ= అశ్విని- వియచ్చరః=గ్రహము.

౧౭. మూలకు:—శ్లో॥ నం తం చిత్రాం బం మృగం చ కుంభ దా పౌష్ణభం తథా । పునర్వసుం హంతి ఖేటః పిశితాశనభస్థితః॥

తా॥ మూలయందున్న గ్రహము ; న- త- చిత్ర- బ- మకర- కుంభ- ద- రేవతి- పునర్వసు- వీనిని వేధించును.

మృగ= మృగశిరము- పౌష్ణ= రేవతి- పితృశాళభ= మూల.

౧౮. పూర్వాషాఢకు:—శ్లో॥ యం ఎం రం హస్తభం జంణంసమహిర్బు
ధ్నభంశివం । పూర్వాషాఢర్క్షసంచారీవిధ్యతేహినభశ్చరః॥

తా॥ పూర్వాషాఢయందున్న గ్రహము; య- ఎ- ర- హస్త- జ- ణ- స-
ఉత్తరాభాద్ర- ఆర్ద్ర- వీనిని వేధించును.

అహిర్బుధ్న = ఉత్తరాభాద్ర, శివ = ఆర్ద్ర, ఋక్ష = నక్షత్రము.

౧౯. ఉత్తరాషాఢకు:—శ్లో॥ ఖగౌపూర్వప్రోష్ఠపదంబవృశ్చిక తులాశ్చ
పం । ఉత్తరామిందుభం హంత్రివిశ్వేదేవర్క్షగోగ్రహః॥

తా॥ ఉత్తరాషాఢయందున్న గ్రహము ఖ, గ, పూర్వాభాద్ర, బ, వృశ్చిక, తు
లా, ప, ఉత్తర, మృగశిర, వీనిని వేధించును.

టీక॥ పూర్వప్రోష్ఠపద = పూర్వాభాద్ర, ఇందుభ = మృగశిర, విశ్వేదేవర్క్ష =
ఉత్తరాషాఢ.

౨౦. అభిజిత్తునకు:—శ్లో॥ జంచాపమం వధూంటంచపూర్వామూంశత
తారకం । రోహిణీంఖేచరోహంతిహ్యభిజిత్తారకాంగతః॥

తా॥ అభిజిన్నక్షత్రమందున్న గ్రహములు, జ, ధనుస్సు, అం, కన్య, ట, పూ,
బూ, శతభిషం, రోహిణి, వీనిని వేధించును.

టీక॥ చాప = ధనుస్సు, వధూ= కన్య.

౨౧. శ్రవణమునకు:—శ్లో॥ వసుంఖంమృగరాశించ జయాంభద్రాంహ
రించమం । మఘాగ్నిభేఽచ్యుతర్క్షస్థావిధ్యతేగగనేచరః॥

తా॥ శ్రవణమందున్న గ్రహము, ధనిష్ట; ఖ, మ, జయభద్ర, సింహ, మ, మ
ఘ, కృత్తిక, వీనిని వేధించును. వసు = ధనిష్ట, అగ్నిభ = కృత్తిక, అచ్యుతర్క్ష = శ్ర
వణము, అనగ విష్ణు దైవత్యముగల దని యర్థము.

౨౨. ధనిష్టకు:—శ్లో॥ గకుంభరిక్తానందాంకీటడా శ్రోత్రభానీచవైష్ణవ
ర్క్షంవాసవర్క్షగతోహంతివియచ్చరః॥

తా॥ ధనిష్టయందున్న గ్రహము. గ, కుంభ, రిక్తా, నందా, కర్కాటక, డ, అ
శ్రేష, శ్రవణం, వీనిని వేధించును.

టీక॥ కీట = కర్కాటకము, వైష్ణవర్క్ష = శ్రవణం, వాసవర్క్ష = ధనిష్ట, వియ
చ్చరః = గ్రహము.

౨౩. శతతారకు:—శ్లో॥ సంమీనమోంయుగం హంచపుష్యాభిజిత మూలింతథా । స్వాతీంహంతివభోగస్తువిధ్యతే శతతారకః॥

తా॥ శతభిష మందున్న గ్రహము. స, మీన, ఓ, మిధున, హ, పుష్యమి, అభిజిత్తు, మూ, స్వాతి వీనిని వేధించును.

టీక॥ యుగం = మిధునము.

౨౪. పూర్వాభాద్రకు:—శ్లో॥ గంఖం విశ్వాందం క్రియంచ వృషభం కంపునర్వసుం । చిత్రాంప్రోష్ఠపదస్థాహివిధ్యతేగగనేచరః॥

తా॥ పూర్వాభాద్ర యందున్న గ్రహము. గ, ఖ, ఉత్తరాషాఢ, ద, మేష, వృషభ, క, పునర్వసు, చిత్త, పూర్వాభాద్ర, వీనిని వేధించును.

టీక॥ విశ్వ = ఉత్తరాషాఢ, క్రియ = మేషము, ప్రోష్ఠపద = పూర్వాభాద్ర, గగనేచరః = గ్రహము.

౨౫. ఉత్తరాభాద్రకు:—శ్లో॥ సమైంజం తోయభంచంశంవంశివంహస్తభంతథా । అహిర్బుధ్న్యర్క్షసంస్థోయంవిధ్యతేగగనేచరః॥

తా॥ ఉత్తరాభాద్రయందున్న గ్రహము. స, ఐ, జ, పూర్వాషాఢ, చ, శ, వ, ఆర్ద్ర, హస్త, వీనిని వేధించును.

తోయభ = పూర్వాషాఢ, శివ = ఆర్ద్ర, అహిర్బుధ్న్యర్క్ష = ఉత్తరాభాద్ర.

౨౬. రేవతికి:—శ్లో॥ దంకుంభంమకరం బంచమూలాంలంఅంచ చాంద్రభం । ఉత్తరాఫల్గునీంఖేటోవిధ్యతేపౌష్ణభస్థితః॥

తా॥ రేవతియందున్న గ్రహము. ద, కుంభ, మకర, బ, మూల, ల, అ, మృగశిర, ఉత్తర, వీనిని వేధించును.

చాంద్రభం = మృగశిర, ఉత్తరఫల్గుని = ఉత్తర, పౌష్ణభ = రేవతి.

౨౭. అశ్వనికి:—శ్లో॥ చమీనంఅఃకార్ముకంచయంజ్యేష్ఠాముంవిధాతృభం । పూర్వాంపురస్థితాంఖేటోవిధ్యతేదస్రసంస్థితః॥

తా॥ అశ్వనియందున్న గ్రహము. చ, మీన, అః, ధనుః, య, జ్యేష్ఠా, ము, రోహిణి, పుబ్బ, వీనిని వేధించును.

కార్ముకం= ధనుస్సు, విధాతృభం=రోహిణి, పూర్వా=పుబ్బ, దస్ర=అశ్వని, పురస్థిత = ఎదుటనున్నది.

౨౮. భరణికి:—శ్లో॥ లంమేషం చైవరిక్తాంచజాయాంకీటంవకారకం.
మిత్రింవహ్నింమఘాంఖెటోవిధ్యతేయమభస్థిత॥

తా॥ భరణియందున్న గ్రహములు. ల, మేష, రిక్తా, జయా, వృశ్చిక, అనూరాధ, కృత్తిక, మఘ, వీనిని వేధించును.

కీట=వృశ్చికము, మిత్రి=అనూరాధ, వహ్ని=కృత్తిక, యమభ=భరణి.

ఈప్రకారము బహువిధవేధా లక్షణమున్ను దానియుదాహరణములును బాల బోధగా జెప్పినాడు. కనుక యీవేధలను వెుకటి సర్వతోభద్రచక్రముమీద నవగాహన చేసుకొని గట్టిగా బరిశీలించి గోచారముం జెప్పిరేని జాతకమక్కరలేకయే సమస్తశుభాశుభములును భూతభవిష్యద్వర్తమానములు కరతలామలకముగా జెప్పదగును. కనుక యీప్రశ్యక్షగ్రంధమును ముఖ్యముగ నాదరించవలయును- ఇదితనకునుయితరుటి వారికిని గూడ నుపయోగింప దగినది.

—జగద్వృద్ధిక్షయకాండము.—

—అర్ఘవివరణము.—

శ్లో॥ అర్ఘకాండం ప్రవక్ష్యామి యదుక్తం విష్ణుయామిలే
ఏకాశీతిపదేచ క్రేగ్రహవేధైశ్శుభాశుభే
కూర్మచక్రవశాదే తద్ధాతుమూలాదివస్తుషు॥

టీక॥ ఈయుఘనిర్ణయము విష్ణుయామిళములో కూర్మచక్రమందు సర్వతోభద్రచక్రమువల్ల జెప్పబడెను.

శ్లో॥ దేశకాలగతేవర్ణే సంప్రోక్తశ్చార్ఘనిర్ణయః
చింతనీయంవిశేషేణ సర్వంచైవ విచక్షణః॥

టీక॥ ఈసర్వతోభద్రమందు క్రూరగ్రహవేధలు గల దేశములకును, శనివేధగలదేశములకును, వక్రంగత శనివేధగల దేశములకును ధాన్యాదులపంటలకును, ధారణకును, విభాగము జెప్పబడును గనుక సర్వమును బుద్ధిమంతులచేత గట్టిగా నాలోచింపదగును- ఈప్రకరణమిచ్చట సంక్షేపముగ జెప్పబడినను దీనిని బాగుగ బరిశీలించెనేని బహూపయోగమును, ప్రత్యక్షమును, ఆశ్చర్యమును మనస్సునకు మిక్కిలి యానందమును గల్గును

శ్లో॥ దేశోయంమండలస్థానమితి దేశోభిధీయతే

వర్షమాసదినంచైవత్రిధా కాలోపికథ్యతే॥
ధాతుంమూలం తథాజీవ మితిపణ్యవినిర్ణయః
అర్ఘాదీనామధీశాస్స్యుర్వక్ష్యామిస్వామి ఖేచరాః॥

ధాతుమూల జీవాధిపతులు:—శ్లో॥ ధాత్వీశాస్సౌరి రాహ్వారాజీవేశాజ్ఞేందుసూరయః। మూలేశాః కేతుశుక్రార్కా ఇతివర్గాధిపాగ్రహాః॥

కాలాధిపతులు:—శ్లో॥ వర్షేశాః కేతురాహ్వార్కి జీవామాసాధిపాస్స్మృతాః। భౌమార్కజ్ఞసితేజ్యార్కిచంద్రాశ్చ దివసాధిపాః॥

టీ॥ మండలమని వ్యవహారములు గలది దేశమనబడును, వర్ష, మాస, దిన, అని కాలము 3 విధములుగా నున్నది, బజారువస్తువులను, ఆమ్లకపువస్తువులను ధాతుమూల జీవములని 3 విధములు గానున్నవి- శని, రాహు, కుజ, వీరు ధాత్వాధిపతులు. బుధ చంద్ర, గురు, వీరు జీవాధిపతులు. కేతు, శు రవి, వీరు మూలాధిపతులు.

కేతు, రాహు, శని, గురు, వీరువర్షాధి పతులు. మాసాధిపతులును వీరే పర్యాయముగా దిరుగుదురు- కు, ర, బు, శు, గు, శ, చ, వీరు దివసాధి పతులు పర్యాయముగ తిరుగుదురు.

—దేశములజన్మనక్షత్రములు—

కళింగేకృత్తికర్క్షంస్యాద్రోహిణీచైవకాశ్మిరే
మృగశీర్షావంతిదేశేబాహ్లీకేరౌద్రభంతథా॥
మహారాష్ట్రే పునర్వసుర్వింధ్యాద్రౌపుష్యమేవచ
ఆశ్రేషామత్స్యదేశేతు మఘాపార్థివదేశకే॥
ఫల్గునీత్వంగవిషయేచోత్తరాపాటలేపిచ
హస్తోమిథిలదేశేతుసింధ్యోర్దక్చిత్రభంతథా॥
సౌరాష్ట్రవిషయేస్వాతీవిశాఖాచ విదర్భకే
సౌరాష్ట్రకేత్వనూరాధాపాంచాలెజ్యేష్ఠమాదిశేత్॥
మూలచోత్కలదేశస్యదర్దురాషాఢమేవచ
కాంభోజెతూత్తరాషాఢా, విదేహేశ్రవణంతథా॥
ధనిష్ఠాశూరసేనేచ పాంచాలేశతతారకం
కురుభద్రేపూర్వభాద్రాఉత్తరాభాద్రపర్వతః॥

రేవతీచాంధ్రదేశేతు అశ్వనీలోకపాలినీ
కాలపూర్ణాచభరణీ బుక్కదేశాః వినిర్దిశేత్॥
క్షితిబంధంచనక్షత్రం నక్షత్రంగ్రహబంధనం
గ్రహాకర్మఫలంవేధం తత్తద్దేశేశుభాశుభం॥
గ్రహజంతారజందోషం తత్తద్దేశేవినిర్దిశేత్
అన్యదేశేనదోషస్స్యాద్వరాహాత్రిపరాశరాః॥

—జాతిభేదములకు నక్షత్రములు—

శ్లో॥ సౌమ్యంచత్వ్యరారాజాత్రిపూర్వాక్కృత్తికాద్విజాః
చిత్రాయామ్యధనిష్ఠాశ్చ రేవతీమఘమైత్రభం॥
వణిజశ్చతథాప్రోక్తారోహిణీచాశ్వనీతథా
హస్తాదితిస్వాతిరాద్రేమూలా వారుణశూద్రజాః॥
విశాఖావిష్ణుసర్పస్తు చండాలాది వినిర్దిశేత్॥

గ్రహములజన్మదేశములు:—శ్లో॥ రవిజన్మకళింగేచ యావనేశశిరాహుజౌ
బృహస్పతిస్సింధుదేశేమహారాష్ట్రేభృగుస్తథా
బర్బరేరాహుకేతూచ। అవంత్యాంభూమినందనః సౌరాష్ట్రేచం
ద్రజఃప్రోక్తః గ్రహదేశాః ప్రకీర్తితాః॥

గ్రహాధిపత్యదేశములు.

హిమవద్దక్షిణేమందో గంగాయాందక్షిణేబుధః
యామ్యేవిధుస్తువింధ్యాద్రే రుదగ్గీర్వాణమంత్రిణః
గోదావరీకృష్ణవేణ్యోర్మధ్యోర్వీభార్గవీమతా
అంగారకఃకృష్ణవేణీలంకామధ్యేథచంద్రమాః
కావేరీతామ్రపర్ణ్యోశ్చమధ్యంపాలయతిక్రమాత్
గోదావర్యాఃపశ్చిమేతు రవిజఃకొంకణేభృగుః
భూచక్రమఖిలంభానురేవంపాలయతిక్రమాత్॥

ఈప్రకారము దేశవిభాగము, దేశాధిపత్య నిర్ణయము, గ్రహజన్మస్థానములు, ధాతుమూల జీవాది వివరము, తదాధిపత్య క్రమము, అఘ్ఘనిర్ణయము మొదలగునవి చెప్పబడెను. గనుక తత్తదాధిపత్యములు గల గ్రహములు పాపులయినను, అస్తంగతులై

నను, యుద్ధమందు పరాజితుడైనను, పాపసంబంధము గలిగినను, తద్దేశీయ నక్షత్రాదులను పాపులు వేధించినను కూడినను, ఆయాదేశములకు అరిష్టము అశనిపాతము, ఉల్కాపాతము, శిలావర్షణము, సస్యనాశనము ప్రజాపీడ మొదలగునవి గలుగును. అట్టి దుర్యోగము పట్టిన గ్రహములో చంద్రుడు పూర్ణుడై పాపులచేత వేధింపఁబడి వారితో నేరోజుకలియునో ఆరోజున ఆప్రదేశమందు పైనవ్రాసిన యరిష్టములు గలుగననియు, గాలివాన మొదలగునవి గూడగలుగుననియు పెద్దలు చెప్పుచున్నారు. గనుక బుద్ధిమంతులు బహువిధములుగా గ్రంథముం బరిశీలించి తత్కాల బలాబల శుభాశుభత్వములు గనిపెట్టి సూక్ష్మబుద్ధితో విచారించి చెప్పవలయును.

దేశమునకు గాని, వస్తువునకు గాని నామాద్యక్షరమును బట్టి సమస్త వేధలం గనుపెట్టి దేశమునకు యోగక్షేమమును, వస్తువుల ధరలును చెప్పదగును.

పాపదృష్టి వేధగల వస్తువులు నశించును. శుభదృగ్వేధలు గల వస్తువులు విశేషముగ ఫలించును. అనగా; వస్తువులు నశించునెడ ధర హెచ్చును. వృద్ధిగా ఫలించునెడ చవుకగా నుండును. అని తాత్పర్యము.

క్రూరగ్రహ దృగ్వేధలు పడ్డ నక్షత్రభూములందు ప్రజాపీడా, దుర్భిక్షము, పరచక్రభయమును గలుగును.

శ్లో॥ వేధందేశాధిపేరుక్షేఫలంసర్వంవిచింతయేత్
స్వజాతిభానామేతేషాంతత్తద్భిన్నాద్యాదికంఫలం॥

టీ॥ ఈప్రకారము దేశ నక్షత్రాదులకు క్రూర వేధలం బట్టి క్రూరగ్రహాక్రాంతలం బట్టియు, ఆయాదేశములకు కీడు అనియు, శుభగ్రహవేధాక్రాంతలం బట్టి శుభమును జెప్పేది. వెనుక జెప్పిన జాతనక్షత్రములను వేధించే శుభాశుభులవల్ల ఆయాజాతుల వారికి అనగా; బ్రహ్మ, క్షత్రి, విట్ఛూద్రులు మొదలయిన వారికి క్రమముగా కీడు మేళ్లను జెప్పవలయును.

మఱియు; గురుశుక్రశనులతో గూడిన చంద్రుడేరోజున యేదేశనక్షత్రమును వేధించునో ఆరోజున ఆప్రదేశమందు వాయుపాతము సిద్ధమని చెప్పబడెను.

శ్లో॥ గురుశుక్రార్కపుత్రైశ్చయుక్తశ్చంద్రోహివిధ్యతే
తద్దినేవాయుపాతస్స్యాద్వృష్టిర్వాభవతిధ్రువం॥

శ్లో॥ జ్ఞచంద్రజీవశుక్రాశ్చయత్రవిధ్యంతిఖేచరాః
జలెనపూరితాస్సర్వేధాన్యార్ఘాదిసుభిక్షకృత్॥

టీక॥ శుభులగు చంద్ర, బుధ, గురు, శుక్ర, యీ ౪ గురును యేకమై యేనక్ష త్ర భూములను వేధింతురో లేక కూడియుందురో, లేక చూచెదరో ఆనక్షత్రభూములు మంచి సువృష్టిగలిగి సకలసస్యములును ఫలించి సుభిక్షంబుగ నుండునని తాత్పర్యము.

శ్లో॥ భూసుతశ్చార్కరాహూచ కేతుర్వాయత్రితత్రివై
ఏకవేధేతుతిద్దేశేఅశనీవాయుపీడనం॥

టీ॥ కుజ, రవి, రాహు, కేతు వీరందరును ఏదేశనక్షత్రమును ఏకాలమున వేధింతురో ఆకాలమందా దేశమున అశనీపాత, వాయు, అధికశిలావృష్టి మొదలగునవి. గలుగును.

ఈప్రకారము సర్వతోభద్రచక్రరీత్యా సకలసంగతులును శుభపాపగ్రహదృగ్వే ధాక్రాంతల వల్ల విచారించి కీడుమేళ్ళను ప్రత్యక్షముగా జెప్పవచ్చును.



శ్రీరస్తు.

# దైవజ్ఞకర్ణామృతే

## పూర్వభాగే-మిశ్రఫలబిందౌ

### దశాపరిచ్ఛేదః.

### వర్షదశాప్రకరణము.

శ్లో॥ జన్మనక్షత్రమారభ్యయావన్నూతనవర్షభం
స్తైవసంఖ్యాచమునిభి ౭ గ్గుణితానవ ౯ భాజితా
శేషాద్వర్షదశానాథాఃరవిభౌమార్య కేతవః
బుధశుక్రార్కశశినఃస్వర్భానుశ్చక్రమాదిమె॥

తా॥ జన్మనామనక్షత్రములు సంవత్సరాదినాటి నక్షత్రములవరకును యెంచగా నైన సంఖ్యను ౭ చే గుణించి ౯ చే భాగించగా శేషమును బట్టి యీదిగువ నుదహరింపబడినప్రకారము వర్షదశాధిపతులను దెలియవలయును.

తొమ్మిదిచే భాగింపగా మిగిలిన శేషము ౧, రవి- ౨ కుజుడు- ౩, గురుడు- ౪, కేతువు- ౫, బుధుడు- ౬, శుక్రుడు- ౭ శని- ౮, చంద్రుడు- ౦, రాహువు.

ఈ ప్రకారము సంవత్సరాది నాటికి ప్రథమదశానాథుని నిర్ణయించి యాదశా

సాధుని దశాపరిమాణమును బట్టి బుక్తాద్యంతమును బట్టిన్ని ఆప్రథమదశాశేషమును సాధించి ఆశేషకాలమువరకును దశనునడిపించి పిమ్మట తదానంతర్య దశలను శ్లోకోక్త క్రమముగా నడిపించి వాని ఫలములం జెప్పవలయును- ప్రథమదశయేదియగునో యది మొదలు ౯ దశలు ఆఖరయ్యేవరకు ఆసంవత్సరము ఆఖరగును బుక్త్యాద్యంతమనగా; వెనుక గ్రహప్రకరణములో చంద్రస్ఫుటమునందు జెప్పినరీతిని తెలియదగును.

## —వర్షదశాగ్రహదినపరిమాణము.—

శ్లో॥ ధృత్యే ౧౮ కవింశే ౨౧ ద్వ్యసువార్ధి ౪౮ మూర్ఛనాః ౨౧ కుసా
యకా ౫౧ షష్టి ౬౦ నగేషు ౫౭ భాగ్న్యయః ౩౦
కృతేషవ ౫౪ స్తద్దినసంచయోరాశ్యక్షచారిణాం వర్షదశాధిపానాం॥

తా॥ పైనచెప్పిన వర్షదశలకు దినపరిమాణము. ౧ రవికి దినములు ౧౮. ౨ కుజునికి దినములు ౨౧. ౩ గురునికి దినములు ౪౮ ౪ కేతువుకు దినములు ౨౧. ౫ బుధునకు దినములు ౫౧. ౬ శుక్రునకు దినములు ౬౦. ౭ శనికి దినములు ౫౭. ౮ చంద్రునకు దినములు ౩౦. ౯ రాహువునకు దినములు ౫౪ వెరశి ౩౬౦ దినములు.

## —మాసదశావిభాగము.—

జన్మనక్షత్రమారభ్యయావచ్చంద్రోదయస్థభం
గణయేదద్రి ౭ భిర్నిఘ్నం నవ ౯ హృచ్ఛేషతోదశా॥
రవిస్సౌమ్యఃఫణిర్జీవః ధ్వజశ్చంద్రః కుజోభృగుః,
ధరాపుత్రశ్చంద్రమాసేఫలంవక్ష్యే పృథక్పృథక్॥
దినానిఘటికావక్ష్యే రవ్యాదీనాందశామితి,
సార్ధైకశ్చ ౧-౩౦ సపాదాబ్ధిర-౧౫సార్ధవేదాశ-౩౦బ్ధయశ-౦స్తథా
పాదోనం ద్వీదినం ౧-౪౫ సార్ధద్వ్యహం ౨-౩౦ పాదోనపంచకం
౪-౪౫పంచకం౫-౦సత్రిపాదైక౧-౪౫దినమర్కముఖాత్క్రమాత్॥

తా॥ శుక్లప్రతిపత్తు ఘడియల ఆఖరువరకు అనగా చంద్రోదయము వేళకు రేయే నక్షత్రమగునో ఆనక్షత్రమే మాసనక్షత్ర మనబడును. జన్మనక్షత్రము మొదలు చంద్రోదయ నక్షత్రము వరకును యెంచగా నయిన సంఖ్యను ౭ చే గుణించి ౯ చే భాగింపగా మిగిలిన శేషము ౧ ఐతే రవి, ది౧ ఘ ౩౦ విఘ ౦. ౨ ఐతే బుధ, ౪-౧౫-౦ ౩ ఐతేరాహువు, ౪-౩౦-౦. ౪ అయితేగురు ౪-౦-౦. ౫ ఐతే కేతు, ౧ ౪౫-౦. ౬

ఐతే చంద్ర ౨-30-0. ౭ ఐతే శని, ౪-౪౫-౦. ౮ ఐతే శుక్ర, ౫-౦-౦. (౦) ఐతే, కుజ ౧-౪౫-౦. వెరశి 30-0-0 ఈమానవశలకును ప్రథమ దశకు వెనుకటి వర్షదశవిశేషే బుధాద్యంతముపల్లనశాశేషమును చేసి మరి నడిపించవలెను.

—అధప్రతిదినఫలజ్ఞానాయ నిత్యదశాక్రమోలిఖ్యతే॥—

వెనుక వ్రాయబడిన తారాబల ప్రకరణరీత్యా నిత్యనక్షత్రమే తారయగునో తెలిసి యీదిగువు వ్రాసిన ప్రకారము ఆయాతారలకానిత్యదశయని యెరుంగవలయును- ఎట్లంటే :

౧ జన్మతారకు శనిదశ ౨ సంపత్తారకు గురుదశ, 3 విపత్తారకు కుజదశ, ౪ క్షేమతారకు రవిదశ, ౫ ప్రత్యక్తారకు రాహుదశ, ౬ సాధనతారకు శుక్రదశ, ౭ నైధనతారకు బుధదశ, ౮ మిత్రతారకు చంద్రదశ, ౯ పరమమైత్రతారకు కేతుదశ.

ఈనిత్యదశకు శ్లోకరీత్యా గణించి దశకట్టుకొనుటకంటె యీతారవల్ల తెలియుట సుకరముగా నుండును, అయినను నిత్యదశలు కట్టే శ్లోకమును గూడ వ్రాయబడెను.

శ్లో॥ జన్మనక్షత్రమారభ్య నిత్యనక్షత్రగణ్యతే
సప్తభి ౭ ర్గుణితం కృత్వానవ ౯ భిర్భాగమాహరేత్ ॥
రవ్యాది కేతుపర్యంతంక్రమాన్నిత్యదశాస్మృతా॥

ఈరెండు విధముల వల్లనున్ను కట్టిన నిత్యదశలు ఒక్కటే యగును.

—అధపూర్వోక్తవర్షదశానాంఫలమాహ.—

౧. రవిదశాదినములు ౧౮ కి ఫలం:—శ్లో॥ రాజవార్తాప్రసంగాప్తిముష్ణాధిక్యం మనోరుజం । పత్రికాగమనంచూరసంచారం నేత్రరోగతాం । అపూర్వవార్తాశ్రవణంజీర్ణవస్త్రాదిధారణం । కరోతిమనుజానాంతురవేర్వర్షదశాఫలం॥

౨. కుజదశాదినములు ౨౧కిఫలం:—శ్లో॥ భోజనంకటుశాకాద్యైరుద్యోగేవిఘ్నసంభవః । మనఃక్లేశంమహాకష్టంశరీరేరక్తదర్శనం । పరనిందాపవాదశ్చకలహంశాస్త్రవిజ్ఞనే । ఏవంకరోతిభౌమస్తుసంవత్సరదశాఫలం॥

౩. గురుదశాదినములు ౪౮ కి ఫలం:—శ్లో॥ దేహారోగ్యం సుఖంచైవ బ్రాహ్మణానాంసమాగమం । నూతనాంబరగోలాభం పుత్రలాలనమన్వహం । ధనలాభంచసంతోషం రాజప్రీతిప్రదంసదా । గ్రామాంతరాద్ధాన్యలాభంజీవస్యైవ దశాఫలం॥

౪. కేతుదశాదినములు ౨౧కి ఫలం:—శ్లో॥ శత్రువృద్ధిం సుహృత్పీడాం రాజ్ఞాం కోపాద్భయాపహం । చోరబాధాంచకురుతే కేతోర్వర్ష దశాఫలం॥

౫. బుధదశాదినములు ౫౧ కి ఫలం:—శ్లో॥ విద్యాలాభం భూషణాప్తిం నవద్విజ గురుప్రియం । పత్రికాగమనంబంధు సదనేభోజనంతథా । మిత్రమూలాత్కార్యసిద్ధి శ్చిత్రాంబరవిభూషణం। ప్రదద్యాత్త్వనిశంన్రాణాంబుధవర్ష దశాఫలం॥

౬. శుక్రదశాదినములు ౬౦ కి ఫలం:—శ్లో॥ సద్వస్త్రధారణంసౌఖ్యం బాలస్త్రీచుంబనంతథా । నృత్తగీతప్రసంగంచ వేశ్యాస్త్రీభోగసంభవం। కావ్యాలంకారశాస్త్రాదికాలయాపనమన్వహం । కురుతే మానవానాంతు శుక్రవర్ష దశాఫలం॥

౭. శనిదశాదినములు ౫౭కి ఫలం:—శ్లో॥ మృతవార్తా ప్రసంగంచదేహాజాడ్యం భయాస్పదం ।హీనజాతివిరోధంచ హృదయేవ్యాధిసంభవం । భ్రాతృభృత్యాదికలహం హానికార్యప్రవర్తనం । దద్యాచ్ఛనైర్వర్షదశామనుజానా మహర్నిశం॥

౮. చంద్రదశాదినములు ౩౦ కి ఫలం:—శ్లో॥ విద్యావివాద గోష్ఠిం చ వేదశాస్త్రాదిచింతనం । పురాణశ్రవణంచైవ దూరబంధుసమాగమం । శుక్లవస్త్రాద్యలంకారం మాతృహస్తాన్నభోజనం । తీర్థయాత్రాప్రసంగంచ దద్యాచ్చంద్రదశాఫలం॥

౯. రాహుదశాదినములు ౫౪ కి ఫలం:—శ్లో॥ అకస్మాత్కలహం నిత్యమరివర్గప్రపీడనం । సర్పవృశ్చికదుస్స్వప్నం సాధ్వసంపైత్యసంభవం । విషవైద్యప్రచారంచ మ్లేచ్ఛప్రభుసమాగమం । ఏవంరాహుదశాన్రాణాంకరోత్యత్రనసంశయః॥

—అథపూర్వోక్తమాసదశానాంఫలమాహ—

౧. రవిదశాదినములు ౧౪౦కిఫలం:—శ్లో॥ తాపంచగమనంశోకంశిరోరోగంభయంతథా। నృపభీతించకలహం రవౌమాస దశాధిపె॥

౨. బుధదశాదినముల ౪౦కి ఫలం:—శ్లో॥ బంధుభిశ్చసమాయోగోవిష్ణుభక్తేశ్చచింతనం।విద్వత్సంఘార్థలాభౌచమిత్రసందర్శనంబుధే॥

౩. రాహుదశాదినములు ౪౫౦కి ఫలం:—శ్లో॥ వేదనాచోదరేనాభౌక్రోధశ్చధననాశనం। అకాలభోజనంయానంభోజనేత్వరుచిర్భవేత్। చోరభీతిర్మహోద్వేగే రాహౌమాస దశాధిపే॥

౪. గురుదశాదినములు ౪- కి ఫలం:—ధనలాభం గురౌభక్తిం స్వస్త్రీభూషణలాభతాం। జ్ఞానంసౌఖ్యమ వాప్నోతిగురౌమాస దశాధిపె॥

౫. కేతుదశాదినములు ౧౫౦కి ఫలం:—శ్లో॥ సంఘాధికారోభవతి విషభీతి స్తథైవచ। స్వబంధుకలహాహ్వైరం యుద్ధభీతిస్తథైవచ దుష్టస్త్రీకలహంచైవ కేతౌమాసదశాధిపె॥

౬. చంద్రదశాదినములు ౨౫౦కి ఫలం:—శ్లో॥ దధ్యన్నభోజనం సౌఖ్యం సంభోగం ప్రీతిసౌఖ్యదం। ధనలాభం మనోల్లాసం చంద్రేమాసదశాధిపె॥

౭. శనిదశాదినములు ౪౫౦కి ఫలం:—శ్లో॥ వేదనాజఠరేనాభౌ అగ్రహం పరపీడనం। నీలవస్త్రంచ భీతిశ్చశనౌమాసదశాధిపె॥

౮. శుక్రదశాదినములు ౫కి ఫలం:—శ్లో॥ స్త్రీసౌఖ్యం ధనలాభం చ శయ్యాసౌఖ్యాది సంయుతం। లేపనం గంధపుష్పాద్యైర్ధనగోలాభమేవచ। ఇక్షుక్షీరఫలప్రాప్తింశుక్రేమాసదశాధిపే॥

౯. కుజదశాదినములు ౧౫౦కి ఫలం:—శ్లో॥ రక్తస్యదర్శనం చైవ నృపశస్త్రభయావహం। కార్యవిఘ్నంమనస్తాపం కుజేమాసదశాధిపె॥ ఇతిదశాపరిచ్ఛేదేమాసదశాప్రకరణం.

అథదినచర్యోపయోగార్థంపూర్వోక్త నిత్యదశాఫలాన్యాహ॥

## —నిత్యగ్రహదశాఫలములు.—

౧. రవిదశాఫలం:—శ్లో॥ శిరోరోగం మనస్తాపంసంచారం బుద్ధిచంచలం। రాజవర్గేతు కలహం త్వకాలే భోజనంతథా। శౌర్యం కోపంమనశ్చింతా మృతవార్తాగమంతథా। ఆయాసం కార్యనాశంచరవేర్నిత్యదశాఫలం॥

౨. చంద్రదశాఫలం:—శ్లో॥ రాజదర్శన సంప్రాప్తిస్సువస్త్రవనితాభ్రమః। దేవబ్రాహ్మణభక్తిశ్చ స్త్రీలాభః పుత్రలాలనం। విదేశ వార్తాశ్రవణం భక్షణం శైత్యవస్తునః। హృదయేవిష్ణుభక్తిశ్చమిత్రదర్శన సంభవం। సుఖభోజనసంయుక్తం చంద్రనిత్యదశాఫలం॥

3. కుజదశాఫలం:—శ్లో॥ ధనకర్కశ చింతాచ పాషాణ హృదయస్తథా। మనశ్చింతా మహాకోపో దుర్వార్తా శ్రవణంతథా। రాజభీతి శ్శత్రుభీతిర్గమనం కలహాదికం। బ్రాహ్మణద్వేషసంప్రాప్తిః కుజనిత్యదశాఫలం॥

౪. బుధదశాఫలం:—శ్లో॥ బంధుదర్శన సంప్రాప్తి ర్విద్యాలాభోధనాగమః। రాజవర్గేషువార్తాచ శుభవార్తాపరిజ్ఞానకః॥ జ్ఞానసిద్ధిస్సూక్ష్మబుద్ధిర్మంత్రసిద్ధిర్మతాశనః।జ్యోతిశాస్త్రవరిసంగస్స్యాద్బుధనిత్యదశాఫలం॥

౫. గురుదశాఫలం:—శ్లో॥ వేదవిద్యా పరిసంగశ్చ దేవబ్రాహ్మణ భక్తితా। మానసోత్సాహకార్యంచ స్నానంవస్త్రసుభూషణం। సుఖభోజన సంప్రాప్తిర్గురునిత్య దశాఫలం॥

౬. శుక్రదశాఫలం:—శ్లో॥ తాంబూలం స్వర్ణలాభశ్చ సువస్త్ర వనితా భ్రమః। కందమూలాది భోజ్యంచ రాజద్వారేతి లాభకృత్॥ సౌఖ్యం స్త్రీసంగమే ప్రీతిస్సుఖభోజన సంభవం। మిత్రదర్శనలాభశ్చశుక్రనిత్యదశాఫలం॥

౭. శనిదశాఫలం:—శ్లో॥ లబ్ధకార్య వినాశశ్చ అతినిద్రామనోవ్యథా। మందబుద్ధిః కార్యహాని శ్స్యాద్దేహ కలహాబాధవేత్॥ మన

శ్చింతా మహత్కష్టం శనేర్నిత్య దశాఫలం॥

౮. రాహుదశాఫలం:—శ్లో॥ రాహోర్నిత్యదశాప్రాప్తే స్తేచ్ఛమూ
లాద్భయంభవేత్ । ఋణబాధా శత్రుబాధాభోజనత్వరుచిర్భ
వేత్ । దుష్టబుద్ధిర్దురాచార స్పర్శదర్శన సంభవః॥

౯. కేతుదశాఫలం:—శ్లో॥ భృత్యకోపో మనఃక్లేశో విగ్రహస్స్వజనైస్స
హ । మనసామోహమాప్నోతి పారుష్యం భాషణేపిచ॥ గమనం
రాజభీతిశ్చ కేతోర్నిత్య దశాఫలం॥

ఈప్రకారము వర్ష, మాస, నిత్యదశల లక్షణంబులును వానిప్రత్యేకఫలంబులు న్నువేర్వేరుగ జెప్పబడెను. ఇవి గ్రంథకర్త ఆయాగ్రహముల నిసర్గ శుభాశుభత్వంబులం బట్టి చెప్పియున్నాడు గనుక ఆయాదశలు నడుచుచున్నపుడు యెప్పుడు యేగ్రహదశ యగునో ఆగ్రహము జన్మజాతకములో జన్మలగ్నమువకును, అంశచక్రము నందును శుభుడో పాపుడో బలవంతుడో దుర్బలుడో ఆలోచించి పైవ్రాయబడిన గోచర ప్రకరణమువల్ల శుభాశుభస్థాన భేదము చేతనున్ను, సకల వేధావశము చేతనున్ను శుభుడై యీవర్షాది దశానాధుడున్ను శుభుడై అయ్యేనేని యీదశాశ్లోకోక్త శుభఫలంబులను చెప్పవలెను. పాపుడై పాపదశయైన యెడల మిక్కిలి పాపము అగును. మిశ్రమయ్యేనేని మిశ్రఫల మిచ్చును గనుక అన్నివిధముల బుద్ధిమంతులు గట్టిగ బరిశీలించి మరిచెప్పవలయును.

జన్మజాతక మక్కరలేకుండానే వక్ష్యమాణ ప్రశ్నప్రకరణ మందలి ప్రాశ్నిక లగ్నవశము చేత గ్రహముల శుభా శుభత్వముల నెరింగి చెప్పవచ్చును.

—యోగినీజాతకదశాఫలప్రకరణము.—

ఇక్కడికి జన్మనామనక్షత్రములవల్ల బహుప్రకారముల చేత గోచార, దశాది ఫలములను జెప్పి యిక జన్మనామనక్షత్రములవల్లనే చెప్పదగిన యోగినీ జాతక దశాఫలములనెడు గోచారభేదముం జెప్పుచున్నాడు- ముందుగా తదుపయోగమైన దశాసాధనము చెప్పబడియె.

శ్లో॥ స్వర్క్షరెపినాకినయనై 3 స్సంయోజ్యవసుభి ౮ ర్హ్రారేత్
శేషేణ యోగినీజ్ఞేయాశూన్యసా తేనసంకటా॥
మంగళాపింగళా ధన్యా భ్రామరీభద్రికాతథా

ఉల్కాసిద్ధాసంకటేతి యోగిన్యష్టౌప్రకీర్తితాః
ఏకాదినవపర్యంత మేకవృద్ధ్యాదశాబ్దకాః॥
చంద్రార్కగురు భౌమజ్ఞశనిశుక్రాస్తమఃక్రమాత్
మంగళాదిదశానాథాః ఫలంవక్ష్యేపృథక్పృథక్॥

స్వర్క్షై=తనజన్మనామనక్షత్రములలో, పినాకినయనైః- పినాకి=సాంబమూర్తి వారియొక్క, నయనైః= నేత్రసంఖ్య అనగా ౩ అనుసంఖ్యను, సంయోజ్య=కూడి. వసుభిః=౮ చేత, హరేత్=భాగింపవలెను, శేషేణ=మిగినట్టి శేషము చేతను, యోగినీ=యోగినీదశ, జ్ఞేయా=తెలియనగినది- అనగా ౧ మిగిలిన మంగళాదశ, ౨ మిగిలిన పింగళాదశ, ౩ ఐతే ధన్యాదశ, ౪ ఐతే భ్రామరీదశ, ౫ భద్రికాదశ, ౬ ఉల్కాదశ, ౭ సిద్ధాదశ ౮ సంకటాదశ, శేషము (౦) సున్న మిగిలితే ౮ వదగు సంకటాదశయని తెలియవలెను. ఈమంగళాది దశలకు ఏకోత్తరవృద్ధిగా సంవత్సరములును చంద్రాదులు దశాధిపతులును అగుదురని తెలియబడుచున్నది.

—యోగినీదశాధిప, దశావత్సరపరిమాణములు.—

జన్మనామనక్షత్రసంఖ్యలో ౩ కలిపి, ౮ చే భాగింపగా మిగిలిన శేషము ౧ ఐతే మంగళాదశ. శుభము; చంద్రుడధిపతి. ౧ సం॥ ఉండును ౨ ఐతే పింగళాదశ అశుభము; రవిఅధిపతి ౨ సం॥ ఉండును ౩ఐతే ధన్యాదశ, శుభము; గురుడధిపతి సం॥ ౩ ఉండును. ౪ ఐతే భ్రామరీదశా, అశుభము; కుజుడధిపతి- సం॥ ౪ ఉండును. ౫ ఐతే భద్రికాదశ, శుభము; బుధుడధిపతి స॥ ౫ ఉండును. ౬ ఐతే ఉల్కాదశ, అశుభము; శని అధిపతి, సం॥ ౬ ఉండును. ౭ ఐతే సిద్ధాదశ, శుభము; శుక్రుడధిపతి, సం॥ ౭ ఉండును. (౦) ఐతే సంకటాదశ, అశుభము; రాహువధిపతి సం॥ ౮ ఉండును.

—మంగళాదిమహాదశలకు ఫలము.—

మంగళాదశఫలం॥ సం॥ ౧ కి :—శ్లో॥ మంగళామంగళా ప్రోక్తాయశో
విద్యార్థదాయిని। సువస్త్రాభరణంలాభంవివాహంరాజపూజనం॥
పింగళాదశఫలం॥ సం॥ ౨ కి :—శ్లో॥ పింగళాతనుతేవ్యాధిం నిధనక్లేశ
దాయినీ। చోరానలహృతం విత్తంచతుష్పాజ్జనాశనీ॥
ధన్యాదశఫలం॥ సం॥ ౩ కి :—శ్లో॥ధన్యాధశసుహృద్బంధుస్త్రీలాభంవా
హనాదికం। వేదశాస్త్రాదివిద్యాప్తిపుణ్యకార్యాది కారిణీ॥

భ్రామరీదశఫలం॥ సం॥ ౮ కి:—శ్లో॥ భ్రామరీ జన్మభూమిఘ్నా సర్వ సౌఖ్యవినాశినీ । రాజనిగ్రహ దేహార్తిః మనర్థక్లేశకారిణీ॥
భద్రికాదశఫలం॥ సం ॥ ౫ కి:—శ్లో॥ భద్రికాసుఖసంపత్తి ర్విద్యాలాభ ప్రదాయినీ । స్త్రీపుత్రభ్రాతృసౌఖ్యాది బహుసంతోషదాయినీ॥
ఉల్కాదశఫలం॥ సం॥ ౬ కి:—శ్లో॥ ఉల్కారాజ్య ధనారోగ్యహారిణీ దుఃఖకారిణీ । స్థానభ్రం శరుణవ్యాధి తస్కరోపద్రవప్రదా॥
సిద్ధాదశఫలం॥ సం॥ ౭ కి:—శ్లో॥ సిద్ధాసాధయతే కార్యంన్నృప పూజ్యప్రకాశికా । వాహనాంబరపశ్వాది స్త్రీసౌఖ్య సుతదాయినీ॥
సంకటాదశఫలం॥ సం॥ ౮ కి:—శ్లో॥ సంకటాసంకటంధత్తే ధనధాన్య పశుక్షయం । సుసంకటామంతరేణకస్యాపిని ధనంభవేత్॥

ఇవియన్నియును స్పష్టార్థములే గనుక టీకా తాత్పర్యములు వ్రాయలేదు గాని ఆఖరు శ్లోకమునకు మాత్రము తాత్పర్యము వ్రాయబడుచున్నది.

సంకటాదశ సంకటమునే చేయుచున్నది మఱియు, ధన, ధాన్య, పశు, వీనినన్నిటిని నశింపజేయుచున్నది. ఈసంకటాదశలో సంకటా భుక్తివచ్చెనేని కస్యాపి=అందరికిని, నిధనం=మరణము భవేత్ = అగుచున్నది. అనగా సంకటాదశలో సంకటాంతరము వచ్చినప్పుడు యొవరికిని మరణమేయగును. అనగా అంతదోషకారి యని తాత్పర్యము.

—యోగినీ దశాంతర్దశాఫలాని.—

మంగళమహాదశాచంద్ర సం॥ ౧ కి ఫలం:—శ్లో॥ శతౄణాం విపదాం నాశః రత్నవాహన మన్మథకం । కామినీసుఖమిత్రాది సౌఖ్యమిచ్ఛతిమంగళా॥

౧. మంగళమహాదశాయాం మంగళాంతర్దశాది ౧౦ కి ఫలం:—శ్లో॥ దివ్యాంగనానాం సుఖభాగ్యవృద్ధిః నానోన్యరేశస్యచకీర్తి యుక్తః । అశ్వాది మిత్రాదికళత్ర యుక్తంచెన్మంగళా మంగళమధ్యగాసా॥

౨. మంగళా పింగళాభుక్తిదివములు ౨౦ కి ఫలం:—శ్లో॥ ప్రతాపానలేనైవనూరీ భవంతి, ప్రతిస్పర్ధినో రాజమాన్యత్వ మంత్రాః

ధనప్రాప్తి రత్నాంబరాణాం సుఖంస్యాత్, యదామంగళా పిం
గళా మధ్యగాస్యాత్॥

౩. మంగళాధన్యాభుక్తిదినములు ౩౦ కి ఫలం:—శ్లో॥ వ్యాపారతాబ
హుసుఖం ధనవృద్ధితస్స్యాత్ మిత్రాదివస్త్రధనధాన్యగృహాది
లాభః। శత్రోఃపరాజయ ఇహాస్వజనైః ప్రతిష్ఠాధన్యాదశాభవ
తిమంగళపాక మధ్యే॥

౪. మంగళాభ్రామరీ భుక్తిదినములు ౪౦ కి ఫలం:—శ్లో॥ శరీరసన్త్రా
మయకంఠరోగీభయం వికారోసహసా పదశ్చ। సర్వాంగపీడా
తరుణీవియోగం చేద్భ్రామరీ మంగళగామినీ స్యాత్॥

౫. మంగళాభద్రాభుక్తిదినములు ౫౦ కి ఫలం:—శ్లో॥ శరీరసౌఖ్యం
ఋణమోచనంచ ధనాగమం కీర్తివిశేష వృద్ధిః। దేశాధికా
రోన్నృపమాన్యతాచ భద్రాదశా మంగళమధ్యగాస్యాత్॥

౬. మంగళాఉల్కాభుక్తి దినములు ౬౦ కి ఫలం:—శ్లో॥ చిత్తభ్రమా
కృపణతావధిచోరకష్టం। శోకోదయం స్వజనవర్గ వివాద
ముగ్రం। గ్రామాధిపత్యే కలహోనిజదేహపీడా ఉల్కాయదా
భవతి మంగళ పాకమధ్యే॥

౭. మంగళా సిద్ధాభుక్తిదినములు ౭౦ కి ఫలం:—శ్లో॥ విద్యాలంకార
వస్త్రాణివివిధాని మహద్యశః। విగ్రహోస్వజనై స్సార్థంస్యాత్సి
ద్ధా మంగళాంతరే॥

౮. మంగళా సంకటాభుక్తిదినములు ౮౦ కి ఫలం:—శ్లో॥ ధనహానిని
ఖలచోరాద్భయం చరణనేత్రశిరఃపరిపీడనం। సుతకళత్రజనా
ద్భయం వియోగభయం భవేద్యదిచ మంగళపాకసంకటా॥

అథపింగళా మహాదశాసూర్యః సం॥ ౨ కి ఫలం:—శ్లో॥ దుఃఖశోకకుబు
ద్ధించ రోగంస్వజనవైరితా। ఫలప్రాప్తివ్యతీతంచ పింగళాఇచ్ఛ
తిధ్రువం॥

పింగళమహాదశాయాం పింగళాంతర్దశాభుక్తిదినములు ౪౦కి ఫలం:—
శ్లో॥ శరీరేసుఖంవ్యాధికష్టాదినాశం। ధనేవాహనేనైభవేవృద్ధి

యుస్య । గృహేస్వల్పవాసం పరివాసాభిలాషోయదాపింగళాపిం
గళా పాకమధ్యే॥

పింగళమహాదశాయాంధన్యాంతర్దశా దినములు ౬౦ కి ఫలం:—శ్లో॥ శ
త్రోరివిమర్దన కరీబుధ మోక్షకర్తారాజప్రదాన ఫలదాధన
ధాన్యదాత్రీ ॥ పుత్రాదికర్తనిజగేహ భవార్తి ధన్యాధన్యా
దశాభవతి చేత్తను పింగళాయాం॥

పింగళా భ్రామరీ భుక్తి ౨ నెలలు ౨౦ దినములకు ఫలం:—శ్లో॥ శో
కోదయం వికలభావి నృథాపకీర్తి దేశాంతరే ఫలవియోగకరీ
వరిణార్త ః । హానిర్ధ్రువం సుతకళత్ర జనైవియోగంచె భ్రా
మరీ భవతి పింగళపాకమధ్యే॥

పింగళమహాదశాయాం భద్రాంతర్దశా ౩ నెలలు ౧౦ దినములకు
ఫలం:—శ్లో॥ మిత్రాదిసౌఖ్యమణిమౌక్తికలాభదశ్చ భార్యాసు
తాదిసుఖతా ధనధాన్యదాతా । దేశాధికారపదవి తత ఇచ్ఛతీ
యంచేద్భద్రికాభవతి పింగళపాకమధ్యే॥

పింగళమహాదశాయాం ఉల్కాంతర్దశా నెలలు ౪ కి ఫలం:—శ్లో॥
సదావిగ్రహే వాదిబుద్ధ్యారతిస్యాత్ ప్రతిస్పర్ధయాభాషణే త
న్నరత్వం । ధనార్తిశ్చవస్త్రాదికానాం వియోగోయదా ఉల్కా
లాపింగళాపాకమధ్యే॥

పింగళమహాదశాయాం సిద్ధాంతర్దశా ౪ నెలలు ౨౦ దినములకు ఫ
లం:—శ్లో॥ సౌభాగ్యసిద్ధి విజయోరిపూణాం దేవార్చనం
బ్రాహ్మణ పూజనంచ । మిత్రాదిసౌఖ్యం విజయాభివృద్ధి స్సి
ద్ధాదశాపింగళపాక మధ్యే॥

పింగళమహాదశాయాం సంకటాంతర్దశా నెలలు ౫ దినములు ౧౦ కి
ఫలం:—శ్లో॥ చోరాద్ధనం నశ్యతిగుప్తదుఃఖం హానిర్భయం పు
త్రకళత్రఖేదం । చోరోదయం సంధిసమీరపీడాత్ మోధికా పిం
గళపాకమధ్యే॥

పింగళమహాదశాయాం మంగళాంతి దశాదినములు ౨౦ కి ఫలం:—
శ్లో॥ తురగభవనదారా ద్రవ్యపుత్రాదిసౌఖ్యం। నరపతిఫలమాన్యంసర్వదాధన్యబుద్ధిః। భవతితను జరోగీపుష్టితాస్యాచ్ఛరీరే సకలసుఖసమృద్ధిం మంగళాపింగళాయాం॥

అధధన్యామహాదశాగురు సం॥ ౩ కి ఫలం:—శ్లో॥ ధనధాన్యనృపాల్లాభం యుద్ధెస్థైర్యం జయులసుఖం। వస్త్రపుత్రస్త్రీసుఖంచధన్యా ఇచ్ఛతి సంతతం॥

ధన్యాధన్యాభుక్తి నెల ౩ కి ఫలం:—శ్లో॥ విద్యామతిర్ధనకళత్రసుఖాని శశ్వచ్ఛత్రోర్భయంహరతి గాత్రమహాత్సుఖంచ। చీనాంబరాణివసువాహనమిత్రలాభం। ధన్యాయదాభవతిధన్యగగామినీస్యాత్॥

ధన్యాభ్రామరీభుక్తి నెలలు ౪ దినములు (౦) కి ఫలం:—శ్లో॥ అలసమతిర తంద్రావాతయుక్తం శరీరం సభయభ్రమణవిప్రద్వేషణం విగ్రహంచ। తురగజనవివాదం మానసంమానభంగం యది భవతిచ ధన్యామధ్యగా భ్రామరీచేత్॥

ధన్యాభద్రికాభుక్తి నెలలు ౫ దినములు: (౦) కి ఫలం:—శ్లో॥ అతులవిమలకీర్తిర్ద్రవ్యవృద్ధిః పరస్మాత్ స్వజన సుతకళత్రేభ్యస్సదా సౌఖ్యమత్ర। నవనవరిపునాశస్సూక్తిసౌఖ్యాదివృద్ధిః పరిభవతిచ ధన్యామధ్యగాభద్రికాస్యాత్॥

ధన్యాఉల్కాభుక్తి నెలలు ౬ దినములు (౦) శ్లో॥ వ్యయకలహావిపత్తిర్వాదవైకల్యతాచరిపు వివిధవికారైర్విగ్రహాబంధుభిశ్చ। నృపనిశిచరపీడా వాయుపీడాచ సంఘో యదిభవతిచ ధన్యామధ్యగాఉల్కాచేత్॥

ధన్యాసిద్ధాభుక్తి నెలలు ౭ దినములు (౦) కి ఫలం:—శ్లో॥నృపతిమానవిరాజిత విగ్రహారిపు భయంతురగాయ యుతంసదా। సుఖకళత్రభవేనను సిద్ధిదామకురుతే యదిధన్యదశాగతిః॥

ధన్యాసంకటాభుక్తి నెలలు ౮ దినములు (౦) కి ఫలం:—శ్లో॥ కళత్ర

కష్టం కమలావియోగం శత్రుప్రకోపం నృపచోరభీతిః । వాతాదిరోగం ప్రాణవిహ్వలత్వంతి మోఘిసా ధన్యదశాదశాచేత్ ॥

ధన్యామంగళాభుక్తి దిన ౩౦ కి ఫలం:—శ్లో॥ భూపాలయుక్తి విశారవిచిత్రభోగం ప్రౌఢప్రతాప విహితాభరణంసుపుణ్యం । ద్రివ్యాశ్వలాభ యువతీయుత తీర్థలాభం వస్త్రాధిపాయుతిచ ధన్యదశాప్రపన్నా॥

ధన్యాపింగళాభుక్తి దిన ౬౦ కి ఫలం:—శ్లో॥ సదాశత్రునాశంసగోత్రిప్రతిష్ఠామహద్ద్రవ్యలాభోవివాదేజయశ్చ । స్వదారాదిసౌఖ్యం కలిఃస్వార్థసిద్ధిం భవేద్ధన్యగా పింగళాచేద్దదాతి॥ ఇతి ధన్యాదశాసమాప్తా॥

భ్రామరీ కుజమహాదశా సం॥ ౪ కి ఫలం:—శ్లో॥ విదేశయానము ద్వేగం హాని స్త్రీదేహపీడనం । ఋణవ్యాధిభూఃపతాపం భ్రామరీ యచ్ఛతిధ్రువం॥

౧. భ్రామరీ భ్రామరీ భుక్తిదినములు ౧౬౦ కి ఫలం:—శ్లో॥ వికలబుద్ధి ధనార్తిః కరీ మహత్సమర దుస్తరదుర్గనివేశనం । తురగవాహన హాని వృథాపదం, భ్రమరిపాకగతాయది భ్రామరీ॥

౨. భ్రామరీభద్రికా దినములు ౨౦౦ కి ఫలం:—శ్లో॥ భూపాలతో బహుసుఖం మహతీ ప్రతిష్ఠాభాగ్యోదయే స్వజనపుత్రకళత్రలాభం । భాగ్యాది లాభమతులం కురుతేచ భద్రాచే ద్భ్రామరీ భవతి సాన్నృపతేర్ధనాప్తిః॥

౩. భ్రామరీ ఉల్కాభుక్తిదినములు ౨౪౦ కి ఫలం:—శ్లో॥ వాతామయ శ్లేష్మ శిరోవ్యథాచ, కంఠాది కుష్ఠంకురుతేభయత్వం । రిపూర్ధకీర్తిశ్చ వినాశకీర్తిః, భ్రామ్యా దశామధ్యగతోల్కాలాచేత్ ॥

౪. భ్రామరీ సిద్ధాభుక్తిదినములు ౨౮౦ కి ఫలం:—శ్లో॥ ఉగ్రే వివాదేశమనం ప్రకాశం, మాంగళ్యవస్త్రాభరణాది లాభం । ప్రజ్ఞావిశేషం నృపమాన్యతాచ, భ్రామీదశామధ్యగతాచసిద్ధా॥

౫. భ్రామరీసంకటా భుక్తిదినములు ౩౨౦ కి ఫలం:—శ్లో॥ మృతం దుఃఖగం రాజపత్నాదిభీతి, స్స్వహృద్బంధుకష్టం గృహేనైవవాసః। మనోవిభ్రమం ఘాతపాతాదికంచ యథాభ్రామరీపాకగా సంకటాస్యాత్॥

౬. భ్రామరీ మంగళాభుక్తిదినములు ౪౦ కిఫలం:—శ్లో॥ రజతవిద్రుమ హేమ వరాంగనా సుఖమహీపతి మానయుతం వరం। విమల కీర్తియుతం కురుతేకుజా, ధివగతా ఖలుమంగళాఫలం॥

౭. భ్రామరీ పింగళాభుక్తి దినములు ౮౦ కి ఫలం:—శ్లో॥ నిపుణ మతివినీతం వేదశాస్త్రార్థ బుద్ధిం। స్వజన ధన సుఖాఢ్యం తీర్థయాత్రాపిరితార్థాః। జితసకలరిపుంవా మానినాం పింగళాచెద్యదిభవతికదాచి ద్భ్రామరీ మధ్యగాచేత్॥

౮. భ్రామరీ ధన్యాదినములు ౧౨౦ కి ఫలం:—శ్లో॥ వ్రతాపానలైర్భస్మితా శేషశత్రూన్, కళత్రాత్మజంశ్రేష్ఠసౌఖ్యం విధత్తే। తథారత్నముక్తా ప్రవాళాదిలాభం, దశాధన్యకా భ్రామరీమధ్యగాచేత్॥

భద్రికాబుధమహాదశా సం॥ ౫ కి ఫలం:—శ్లో॥ ధనానాంవివృద్ధింగుణానాం ప్రకాశం, సమీచీనశాస్త్రస్సభారాజమానం। అలంకారదివ్యాంగనాభోగసౌఖ్యం, సదాభద్రికా భద్రకాయాం కరోతి॥

భద్రికాభద్రికాభుక్తిదినములు ౨౫౦ కి ఫలం:—శ్లో॥ ప్రోథప్రతాపం పిజితారిపక్షం, క్షోణీపతిప్రీతిమహాప్రతిష్ఠా। ప్రసన్నమూర్తిం కురుతే ధనాఢ్యం, భద్రాదశాభద్రిక మధ్యగాచేత్॥

భద్రికాఉల్కాభుక్తి దినములు ౩౦౦ కి ఫలం:—శ్లో॥ దద్రుకండు ముఖరోగపీడితం, వాజివాహన వినాశదుఃఖితం। వహ్నిచోరనృపశత్రుపీడితం, భద్రికాభవతిచోల్కలాన్వితం॥

భద్రికాసిద్ధాభుక్తి దినములు ౩౫౦ కి ఫలం:—శ్లో॥ యజ్ఞాదికర్మజసు

ఖం ద్విజదేవభక్తి, రత్యర్థమార్జనయుతా విభుతానమేతా। చే
త్సిద్ధికాభద్రికయానమేత, కళత్రపుత్రాదియుతో విరాజతే॥

భద్రికాసంకటాభుక్తి దినములు ౪౦౧ కి ఫలం:—శ్లో॥ జ్వరవమనవి
కారంగుప్తదుఃఖంవిపత్తి, రనిలభయవిషాదద్వేషబుద్ధిర్వినాశంవి
జకులపతిభీంశ్యక్లేశ పీడావ్రిణాథ్యం, యదిభవతిచభద్రామ
ధ్యగాసంకటాస్యాత్॥

భద్రికామంగళాభుక్తిదినములు ౫౦ కి ఫలం:—ధాన్యాంబరాణిసిజవ
గణసుఖాదిపుష్టి, లీలావిలాసపురరత్న కృతాచసిద్ధిః। విత్తాగ
మంచకురుతేచమహాప్రతిష్ఠా, భద్రాదశాగతేవతీకిలమంగళాచ॥

భద్రికాపింగళాభుక్తి దినములు ౧౦౦ కి ఫలం:—శ్లో॥సుహృదనంతధ
నం కలినాశనం విమలబుద్ధివిలాససుఖానిచ। అనుపకీర్తియుతః
కిలపింగళా, సతతసుఖం కురుతేకిలభద్రయా॥

భద్రికాధన్యాభుక్తి దినములు ౧౫౦ కి ఫలం:—శ్లో॥ కళత్రసౌఖ్యం మ
హీమీసుధేనుద్రవ్యాగమం శత్రుధనంవివాదే। నృపేంద్రమా
నం కురుతేచధన్యాభద్రాదశాయాం యదిచోపయుక్తా॥

భద్రాదశాభ్రామరీ దినములు ౨౦౦ కి ఫలం:—శ్లో॥ కళత్రపుత్రా
ది వియోగదుఃఖం మహద్భయం రూపకృతం త్వనిష్టం। త్రి
దోషరోగంచ శరీరకష్టం చేద్భ్రామరీ భద్రికయా సమేతా॥

ఉల్కాశనిమహాదశా సం॥ ౬ కి ఫలం:—శ్లో॥ భ్రమంవ్యాధికో
పం జరాయాః ప్రకర్షం, ధనన్యూనతా స్త్రీజనస్యప్రకోపం।
స్వగోత్రైర్వివాదం సుహృద్బంధువైరం దశామధ్యకీర్తిర్మనఃక్లేశ
దోల్కా॥

ఉల్కాఉల్కాభుక్తిదినములు ౩౬౦ కి ఫలం:—శ్లో॥ దేహేపీడాజాయ
తేవాతపిత్తైరాజ్ఞాభీతిర్బంధుభిశ్శత్రుభిశ్చ। స్త్రీపుత్రాదేస్స్యాద్వి
యోగోవిపత్తి శ్చోల్కాపాకే ఉద్భవాచోల్కాలాచ॥

౧. ఉల్కాసిద్ధాభుక్తి దినములు ౪౨౦ కి ఫలం:—శ్లో॥ సిద్ధిక్రియా
ద్వికక్రియాచ్చాతిలాభః, సువర్ణాస్త్రధావస్త్రతో ధాన్యలాభః। పు

శేవాధతా రాజమాన్యత్వ మత్రి భవేదుల్కా కాపాకగా సిద్ధి కాచేత్॥

౨. ఉల్కాసంకటాభుక్తిదినములు ౪౮౦ కి ఫలం:—శ్లో॥ శిరఃకర్ణనాసాక్షి కంఠేవికారో, భవేత్క్లేశ తాచెన్న పాచ్చోరతోపి। భయంబంధనం దేహపీడాదిరోగం, భవేదుల్కయా మధ్యగా సంకటాచ॥

౩. ఉల్కామంగళాభుక్తి దినములు ౬౦ కి ఫలం:—శ్లో॥ రోగాదినాశం రిపుకష్టనాశం లాభోభవేద్దేశయుతంస కాశా। త్వేరాజనాస్తస్య సహాయకాస్యుః చేన్మంగళాచోల్కాలపాకగాస్యాత్॥

౪. ఉల్కాపింగళాభుక్తి దినములు ౧౨౦ కి ఫలం:—శ్లో॥ వారాంగనాహాస్యవిలాససౌఖ్యం, రత్నాదిలాభం ధనధాన్యసంపదం। పుణ్యేమతిస్యాద్ద్విజదేవతీర్థా, చేదుల్కాకాపింగళపాకగాస్యాత్॥

౫. ఉల్కాధన్యాభుక్తి దినములు ౧౮౦ కి ఫలం:—శ్లో॥ శుభోదయం మిత్రసమాగమంచ రిపుక్షయం దేశనరాధిపత్యం। బహుప్రతాపేనచ సర్వమైత్రీ చేదుల్కాకాపాక గతాచధన్యా॥

౬. ఉల్కాభ్రామరీభుక్తి దినములు ౨౪౦ కి ఫలం:—శ్లో॥ దేశత్యాగం వ్యాధిదుఃఖంవిరోగం, బంధుద్వేషం బుద్ధినాశంచకష్టం। తేజోనాశంచాగ్ని చోరాదిభీతిం, ఉల్కాపాతేజాయతే భ్రామరీచేత్॥

౭. ఉల్కాభద్రికాభుక్తి దినములు ౩౬౦ కి ఫలం:—శ్లో॥ సువర్ణరౌప్యాది కలాపముగ్రం, వాణిజ్యతోఽతీవ ధనాగమాస్స్యాత్। చతుష్పదప్రాప్తి సుహృత్సుఖంచ, చేద్భద్రికాస్వీయగృహస్య లబ్ధిః॥

సిద్ధాశుక్రమహాదశా సం॥ ౭ కి ఫలం:—శ్లో॥ రాజప్రసాదం స్వజనాదిసౌఖ్యం, ధాన్యాదిలాభం గుణకీర్తిలబ్ధిం। సదంగనా ప్రీతి మనిష్టహానిం, విద్యాంచసిద్ధాప్రకరోతిపుంసాం॥

౧. సిద్ధాసిద్ధాభుక్తి దినములు ౪౯౦ కి ఫలం:—శ్లో॥ ద్రవ్యాగమంచ

సనిచింతితకార్యసిద్ధిం । సత్కార్యమంగళసుఖంబహుధాన్య వృద్ధిః । గ్రామాధిపంచసుతబంధు సుఖంభవేచ్చ చేత్సిద్ధికా సిద్ధికపాకగాస్యాత్ ॥

౨. సిద్ధాసంకటాభుక్తి దినములు ౫౬౦ కి ఫలం;—శ్లో॥ ఆలస్యతం ద్రాకటిగుల్ఫపీడా, మాయావికారో దరవాతవేగః । రాజ్ఞాతిభీతిబలానహీనా చాతం, సిద్ధాదశాయాం యదిసంకటాస్యాత్ ॥

౩. సిద్ధామంగళాభుక్తి దినములు ౭౦ కి ఫలం:—శ్లో॥ ముక్తాప్రవాళ మణివిద్రుమ లాభకారీనానావిధం ధనచయంకురుతేవిభుత్వం। దివ్యాంగనావదనపంకజచుంబనంచ,చేన్మంగళాసిద్ధకపాకమధ్యే॥

౪. సిద్ధాపింగళాభుక్తి దినములు ౧౪౦ కి ఫలం:—శ్లో॥ ఆర్ద్రిఃకపోలేచ శిరశ్శరీరం హేమాదివస్త్రైః పరిభూషితత్వం । కామాధికం కామినిసంగరాగం, సిద్ధాదశాయాం యదిపింగళాస్యాత్ ॥

౫. సిద్ధాధన్యా భుక్తిదినములు ౨౧౦ కి ఫలం:—శ్లో॥ గృహద్వారి వాజీరణే రంగరాజీ, విచిత్రాంబరేణా సుఖం దేశలాభం । కుటుంబాధికో మిత్రపశ్వాది లాభో- యదాసిద్ధికా మధ్య గాధన్యకా చేత్ ॥

౬. సిద్ధాభ్రామరీ భుక్తిదినములు ౨౮౧కి ఫలం:—శ్లో॥ జనాప వాదం బహుధావకష్టం, పుత్రైశ్చ మిత్రైశ్చ భవేద్విరుద్ధం । నృపాదిభీతిం కలహంచ రోగం చేద్భ్రామతీ సిద్ధకపాక గాస్యాత్ ॥

౭. సిద్ధాభద్రికా భుక్తి దినములు ౩౫౦ కి ఫలం:—శ్లో॥ సకల తాప వితాప సుఖోదయం, విమలకీర్తి గుణం విపులంధనం । విపుల గేహ సుఖం నృపమాన్యతా । బుధదశా భృగుసంగమ మాగతః॥

౮. సిద్ధా ఉల్కా భుక్తిదినములు ౪౨౦ కి ఫలం:—శ్లో॥ సుఖాదినాశం తను రోగదుఃఖం నృపాదిభీతిం కలహం కుమిత్రం । మనోవిమోహం భ్రమయావిదేశం చేదుల్కికా సిద్ధికపాకగాస్యాత్ ॥

అథసంకటారాహు మహాదశా సం॥ ౮ కి ఫలం:—శ్లో॥ జనానాంవివా
దం జ్వరాణాం ప్రకోపం కళత్రాది కష్టంచ పశ్వాదినాశం।
గృహేస్వల్పవాసం ప్రవాసాభియానః దశాసంకటా సంకటం
త్వెచ్ఛతీవ॥

౧. సంకటా సంకటా భుక్తి దినములు ౬౪౦ కి ఫలం:—శ్లో॥ దేహాదిక
ష్టం మనసేతనుంచ రోగాదికై వార్తకష్ట ప్రకోపైః। విరోధ
దోషం రిపువర్గభీతిం చేత్సంకటా సంకటపాక గాస్యాత్॥

౨. సంకటామంగళాభుక్తి దినములు ౮౧ కి ఫలం:—శ్లో॥ స్వస్త్రీసుతా
ర్థార్థధనధాన్యసంపత్ప్రమాంశ్చసత్పూరుషసౌహృదాఢ్యః। సుజ్ఞా
త్వ పాండిత్య కలామతిస్స్యాచ్చేన్మంగళా సంకటపాకమధ్యే॥

౩. సంకటా పింగళా భుక్తిదినములు ౧౬౦ కి ఫలం:—శ్లో॥ ప్రవాస
ముక్తాఫలవస్త్రలాభ క్రియార్థవార్త సర్వజనేషుమైత్రీ। ర
థాది లాభంఖలు సేవకర్తా చేత్పింగళా సంకట పాకగాస్యాత్॥

౪. సంకటా ధన్యాభుక్తి దినములు ౨౪౦ కి ఫలం:—శ్లో॥ సేవాదికం
దేవగురు ద్విజానాందానమతిస్త్రీధన జపాతిహోమే। బహూ
ద్యమస్యా ర్థన లబ్ధిరత్రిచే త్సంకటాయాం భవతీహధన్యా॥

౫. సంకటాభ్రామరీభుక్తిదినములు ౩౨౦ కి ఫలం:—శ్లో॥ దేశాటనం
పర్వతమస్తకేషుదారాదిపీడాధనహానిరత్ర। వాతాదిరోగరిపు
భీతిదుఃఖం చేద్భ్రామరీరాహుదశాప్రపన్నా॥

౬. సంకటాభద్రికాభుక్తి దినములు ౪౦౦ కి ఫలం:—శ్లో॥ దివ్యాలం
కారవస్త్రాణి వివిధాని మహద్యశః। విగ్రహాన్యజనైస్సా
ర్థం చేద్భద్రాసంకటాగతా॥

౭. సంకటాఉల్కాభుక్తి దినములు ౪౮౦ కి ఫలం:—శ్లో॥ నాసాక్షి
కర్ణపాదేషు కటిగుహ్యేతిపీడనం। ధనహానిః కాయనాశ
శ్చేదుల్కాసంకటాంతరే॥

౮. సంకటా సిద్ధాభుక్తిదినములు ౫౬౦ కి ఫలం:—శ్లో॥ నృపాల్లాభో
ధనం శాస్త్రమనేక ప్రియసంగమః। సంకటాంతర్గతా సిద్ధాస

దినిన్ని కూడగా పైన దినఘటికాదిని యొకరి విదశకావలసియుండునో, వాని దశావత్సరములచేత గుణింపగా వాని విదశాప్రమాణమగును. ఈలాగుననే సూక్ష్మదశా, ప్రాణదశలను గూడ కట్టుకొనవచ్చును.

ఉదాహరణము. పైనవ్రాయబడిన బుధమహాదశలోని కుజాంతర్దశా ప్రమాణము నెలలు ౧౧ దినములు ౨౭ దీనిలో మాసస్థానమగు ౧౧ టిని ౪ చే భాగింపగా ౨¾ అనగా రెండు దినములు నలువదియైదు గడియలని యర్థము. పిమ్మట అంతర్దశలోని దినస్థానమగు ౨౭ టిని (౨) రెండుచే భాగింపగా ౧౩½ అనగా పదమూడు గడియల ముప్పది విఘటికలు ఈఘటికాదియగు ఘ ౧౩-౩౦ ని వెనుకటి దినాదియగు దిన ౨ ఘ ౪౫ తో కలుపగా దినములు ౨- ఘ ౫౮- విఘ ౩౦ అగును. ఈప్రమాణము ను ధ్రువముగా నుంచుకొని యిష్టవిదశావత్సరములచే గుణింపగా నిష్టవిదశయగును. ఇప్పుడుమనకు కుజవిదశ కట్టవలసియుండెను- గనుక వెనుకటి ధృవమగు ది ౨- ఘ ౫౮- విఘ ౩౦ ను, ఇష్టకుజవిదశావత్సరములను ౭ చేత గుణింపగా నీకుజాని విదశాప్రమాణము ది ౨౦- ఘ ౪౯ విఘ ౩౦ అగును. ఈలాగుననే సూక్ష్మప్రాణదశలను గట్టుకొనవచ్చును- సూక్ష్మాదిదశలు కట్టునప్పుడు మాసస్థానమున్నయెడల ౪ చే భాగింపవలయును. లేనిచో దినాది రెండుచేభాగింపవలయును.

## ఇక ప్రకారాంతరము చేత దశాభేదముం జెప్పుచున్నారు.

జన్మకాలనక్షత్రముగాని దశగాని తెలియనియెడల ఛాయాదశను బట్టి ప్రస్తుత మాజాతకునికి ఫలానా గ్రహసంబంధమయిన దశ జరుగుచున్నదని తెలిసి దానివలన శుభాశుభములను చెప్పవలయును.

ఎట్లనిన:—శ్లో॥ బృహజ్జాతకే॥ "ఛాయాం మహాభూతకృతాంచ స
ర్వేభివ్యంజయంతి స్వదశా మవాప్య। క్ష్మాంబ్వగ్ని వాయ్వంబ
ర జాన్గుణాంశ్చ నాసాస్య దృక్త్వ క్ర్ఛవణాను మేయాన్॥"

టీక॥ సర్వే=సమస్తగ్రహములును, స్వదశామ వాప్య-మహాభూతకృతాం=పంచమహాభూతములవలన, కృతాం=చేయబడు, ఛాయాం=దేహచ్ఛాయను, అభివ్యంజయంతి=తోచింపజేయుచున్నారు- అశరీరకాంతి, క్ష్మాంబ్వగ్నివాయ్వంబరజాన్- క్ష్మా=భూమి అంబు= జలము, అగ్ని=అగ్ని, వాయు=గాలి, అంబర=ఆకాశము, అనగా; పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులవలన, జాన్-పుట్టునట్టి యు, నాసాస్యదృక్త్వక్ఛ్రవణానుమేయాన్- నాసా=ముక్కు, ఆస్య=నోరు, దృక్=కన్లు, త్వక్=చర్మము, శ్రవణ=చెవులు

వీనివలన తరువాత- అనుమేయాః=ఊహింపదగినట్టి- గుణాః=గుణములను, అభివ్యంజయంతి=ప్రకాశింపజేయుచున్నది- అనగా, ఎప్పుడైతే, పురుషుడు, స్రక్చందనాది సుగంధద్రవ్యములం దాసక్తుడై యాఘ్రాణించుచుండునో, అపుడు గంధమునకు ఆశ్రయం బగు భూమియొక్క ఛాయ కాని దేహమందు చూపట్టును.

2. ఎప్పుడు మంచి రసపదార్థంబుల భుజింపుచుండునో అపుడు రసనేంద్రియ గ్రాహ్యం బగు జలముయొక్క దేహచ్ఛాయ జూపట్టును.

3. ఎప్పుడు పురుషుండు మంచిరూపము గలిగియుండునో అపుడు చక్షురింద్రియ గ్రాహ్యంబగు నగ్నియొక్క ఛాయయని తెలియునది.

4 ఎప్పుడు పురుషుడు మృదుస్పర్శ గలిగియుండునో అపుడు త్వగింద్రియగ్రాహ్యమగు వాయువుయొక్క ఛాయయని యెఱుగునది.

5. పురుషుడు ఎప్పుడైతే మంచియింపైన పలుకులం బలుకుట గాని అట్టిచెవులకింపైన వీణాగానాదులను వినుటయం దాసక్తిగాని యున్నయెడల శ్రోత్రేంద్రియగ్రాహ్యంబగు నాకాశముయొక్క ఛాయ చూపట్టును.

ఇట్లువరుసగా చెప్పబడిన పంచమహాభూతములలో నేభూతసంబంధమైన ఛాయ ఆకాలమందు తోచబడునో దానిని నిశ్చయించి పిమ్మట యీదిగువవ్రాసినరీతిగా అఛాయకు ఫలానా గ్రహముయొక్క మహాదశవర్తమానము జరుగుచున్నదని చెప్పవగును.

ఎట్లంటే;—౧ పృథివీఛాయకు బుధదశ ॥ ౨ జలఛాయకు చంద్రదశగాని శుక్రదశగాని యగును. ౩ అగ్నిఛాయకు రవిదశగాని కుజదశగాని యగును॥ ౪ వాయుచ్ఛాయకు శనిదశ॥ ౫ ఆకాశచ్ఛాయకు గురుదశ॥ ఈలాగు వర్తమానదశనే నిర్ణయించవలెను- ఏభూతమునకు నేగ్రహము చెప్పబడెనో ఆగ్రహమహాదశానుగుణముగనే లోపలయుండు నంతరాత్మతాదృగ్ధర్మములను ఆటువంటి ఛాయకు వెలుపలికి ప్రకాశింపజేయును- మరియు నాతని మనస్సును గూడ నాలాగునే చేయును- స్ఫటికాది పాత్రములలోపల వెలుగుచుండు దీపప్రభ వెలుపలికెట్లు ప్రకాశింపజేయునో ఆలాగునే అంతరాత్మగూడ లోపలి తత్వగుణములను వెలుపలికి స్ఫురింప జేయును- ఇట్లు వర్తమాన గ్రహదశను తెలిసి యాగ్రహమునకు తత్కాల లగ్నగ్రహచక్రమువల్ల బలాబలములును, శుభాశుభంబులును చూచుకొని బలవచ్ఛుభగ్రహదశ యయ్యెనేని శుభము, సౌఖ్యము, సంతోషము, లాభము మొదలగు శుభఫలములం జెప్పవలయు- అశుభదశయందశుభఫలముల జెప్పునది- మిశ్రదశయందు మిశ్రఫలముం జెప్పవలయును- శుభాశుభగ్రహదశలఫలములు బృహజ్జాతకము మొదలగు దశాఫల గ్రంథములందు విశ

స్వీకరింపబడియున్నది- ఒక వేళ దశానాథుడు శుభుడైనను పాపుడైనను బహుపాపం జన్మకాలమందు తత్సంబంధశుభాశుభములు వ్యవహారము చేతి ; శుభగ్రహములకు గాక అశుభగ్రహములకు బహుదుఃఖమును అనుభవింతురు అనగా నిష్ఫలమని భావము-

—ఇక నైసర్గికములగు స్థిరదశలను జెప్పుచున్నాడు.—

శ్లో॥ ఏకద్వా నవవింశతి ర్ధృతి కృతీ పంచాశ దేషాం క్రమా। చ్చంద్రారేందుజశుక్రజీవశనిజ ద్దైవాకరీణాం సమాః॥ బృహజ్జా॥

అనియున్నది గనుక ప్రతిమనుజుడును పుట్టినది మొదలు ౧ సంవత్సరము వరకు చంద్రదశ- పిమ్మట ౨ ఏళ్లు కుజునిదశ- పిమ్మట ౯ ఏండ్లు బుధదశ- తర్వాత ౨౦ ఏండ్లు శుక్రదశ- తర్వాత ౧౮ యేండ్లు గురుదశ- తర్వాత ౨౦ యేండ్లు రవిదశ- పిదప ౫౦ యేండ్లు శనిదశ యీలాగు మొత్తము ౧౨౦ యేండ్లు పరమాయుస్స్వరకను ఆగును కాబట్టి వర్తమాన దశయొక్క శుభాశుభములు వెనుకటివలెనే జాతకము వల్లగాని లేక తత్కాలచక్రము వల్లగాని తెలియవలయును. ఇదివరకుజెప్పిన అనేకదశా ప్రకరణములు శోధించి అందులో బహుసంవాదము పరిమాణము చేసి శుభాశుభములు జెప్పవలయును.

దశాపరిచ్ఛేదము సమాప్తము.



శ్రీరస్తు.

# దైవజ్ఞకర్ణామృతే

## పూర్వభాగే-ముహూర్తబింబా

### ముహూర్తపరిచ్ఛేదః.

ఇక ముహూర్తబింబము నారంభింపదలచి సకలముహూర్తసాధారణోపయోగంబగు పంచకరహితంబును జెప్పుచున్నాడు.

శ్లో॥ తిథివారోడు భిర్మిశ్రిం తత్కాలోదయ మిశ్రితం- గ్రహసంఖ్యాహృతేచ్ఛేషం పంచకం పరికీర్తితం॥ ఫలం॥ ఏకో మృత్యు ర్ద్వయం వహ్ని శ్చత్వారో రాజపంచకం షట్చోరం వసురోగంచ ఇతరే శుభదాయకాః॥

ఉదాహరణము॥ గ్రంథాదావ్యతితిథియనగా; శకే ౧౭౧౪ నందననామ సం॥ ఆశ్వయుజ శు ౧౫ గురువారము నాడు సూర్యాస్తాది ౩-౨ ఘడియలకు రేవతీనక్షత్రమేషలగ్నముం బొక యుదాహరణము కొరకు కల్పితముహూర్తమేర్పరుపబడినది. గనుక నాటి తిథిసంఖ్య ౧౫ పైన జెప్పినరీతిగా గురువారసంఖ్య ౫ రేవతీనక్షత్రసంఖ్య ౨౭ మేషలగ్నసంఖ్య ౧ ఈనాలుగుసంఖ్యల మొత్తము ౪౮ దీని ౯ చేత భాగింపగా మిగిలినశేషము ౩ గనుక పూర్వోక్తరీతిని ౩ మిగిలినమంచిదేగనుక యీముహూర్తము పంచకరహితమైనది కాబట్టి గ్రాహ్యంబయినది.

ఇక మతాంతరరహితమని పెద్దలువ్యవహరించుచుండెడు మార్తాండ రీత్యాపంచకశుద్ధి యెట్లనిన.

సుముహూర్తకాలమునకు తాత్కాలిక తిథికి గతమైన తిథియొక్క సంఖ్యయును తత్కాలలగ్నసంఖ్యయును గూడి ౯ చే హరింపగా శేషమునుబట్టి పూర్వోక్తరీతిగ ఫలమేర్పడును.

ఉదా॥ వెనుకటి తిథినాటికి అనగా శుద్ధపూర్ణిమ గనుక దానికి గతతిథి సంఖ్య ౧౪ తత్కాలమేష లగ్నసంఖ్య ౧ న్ని కూడగా ౧౫ అయినది. దీనిని ౯ చే భాగింపగా శేషము ౬ వచ్చినది. ౬ శేషిస్తే చోరపంచకమని వెనుకనే చెప్పబడినది. కాబట్టి మతాంతరము చేత నీముహూర్తము అంగీకరింప బడదని పెద్దలుచెప్పిరి. "లగ్నం సేతతిథిః॥" అనే శ్లోకము మార్తాండమునందు విశేషముగ జెప్పబడియున్నది గనుక దానిం జూచిన యీగుణదోషంబులును, తద్దోషాపవాదలును స్పష్టమగును.

పైనజెప్పిన దుష్టశేషములకు కాలభేదము చేత శుభత్వముం జెప్పుచున్నాడు. ఎట్లంటె;

శ్లో॥ రోగంచోరం త్యజేద్రాత్రౌ దివారాజాగ్ని పంచకె
వివాహాదిషుకార్యేషు మృత్యుం సర్వత్రవర్జయేత్ ॥

అని యున్నది గనుక రోగచోర పంచకములు రాత్రిభాగమందును, రాజాగ్ని పంచకములు పగటియందును మృత్యుపంచకము మాత్రము సర్వకాలము లందును విడువవలయు ననియుం జెప్పిరి. ఇట్లు పంచక శుద్ధిం జూచుకొని పిమ్మట యేముహూర్తము నైన నిశ్చయింప వలయును.

సకలముహూర్తములకును ఉద్దిష్టలగ్న పుష్కరాంత ఘటీసారిణిఉదయాదిగాగాని అస్తాదిగాగాని బేరీజు క్రమలేకుండా పుష్కరకాలమింతకు బైగానని తెలుపును.

| మేషాది సంక్రమణమ్ము | మేష | వృషభ | మిధున. | కర్కాట. | సింహ | కన్యా | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఇది మేషాదిలగ్నముల పుష్కరకాలము. | | | | | | | | | | | |
| మేష | ౭-౫౩ | ౬-౭౮ | ౧౩-౭౬ | ౧౫-౪౮ | ౭౩-౪౬ | ౭౨-౫౦ | ౩౪-౫౬ | ౩౨-౧౯ | ౪౫-౧౮ | ౪౯- ౨ | ౫౪-౫౯ | ౫౬-౪౬ |
| వృషభ | ౫౮-౩౩ | ౭- ౮ | ౯- ౬ | ౧౧-౭౮ | ౧౯-౭౬ | ౭౩-౩౦ | ౩౦-౩౬ | ౩౭-౫౯ | ౪౦-౫౮ | ౪౪-౪౨ | ౫౧-౩౯ | ౫౭-౭౬ |
| మిధున | ౫౩-౩౨ | ౫౨-౧౭ | ౪-౧౦ | ౬-౩౭ | ౧౪-౩౦ | ౧౮-౩౪ | ౭౫-౪౦ | ౭౮- ౩ | ౩౬- ౭ | ౩౯-౫౧ | ౪౫-౪౩ | ౪౨-౩౦ |
| కర్కాట | ౪౮-౧౧ | ౫౧-౪౬ | ౫౮-౪౪ | ౧- ౬ | ౯- ౪ | ౧౩- ౮ | ౭౦-౧౪ | ౭౭-౩౨ | ౩౦-౩౬ | ౩౪-౭౫ | ౪౦-౧౨ | ౪౭- ౪ |
| సింహ | ౪౭-౪౦ | ౪౬-౧౫ | ౫౩-౧౩ | ౫౫-౩౫ | ౩-౩౩ | ౨-౩౨ | ౧౪-౪౩ | ౧౨- ౬ | ౭౫- ౫ | ౭౮-౫౪ | ౩౪-౪౬ | ౩౬-౩౩ |
| కన్యా | ౩౨-౭౦ | ౪౦-౫౫ | ౪౨-౫౩ | ౫౦-౧౫ | ౫౮-౧౩ | ౭-౧౨ | ౯-౭౩ | ౧౧-౪౬ | ౧౯-౪౫ | ౭౩-౩౪ | ౭౯-౭౬ | ౩౧-౧౩ |
| తులా | ౩౭- ౫ | ౩౫-౪౦ | ౪౭-౩౮ | ౪౫- ౦ | ౫౭-౫౮ | ౫౨- ౭ | ౪- ౮ | ౬-౩౧ | ౧౪-౩౦ | ౧౮-౧౯ | ౭౪-౧౧ | ౭౫-౫౮ |
| వృశ్చిక | ౭౬-౪౧ | ౩౦-౧౬ | ౩౨-౧౪ | ౩౯-౩౬ | ౪౨-౩౪ | ౫౧-౩౮ | ౫౮-౪౪ | ౧- ౨ | ౯- ౬ | ౧౭-౫౫ | ౧౮-౪౨ | ౭౦-౩౪ |
| ధనుస్సు | ౭౧- ౮ | ౭౪-౪౩ | ౩౧-౪౧ | ౩౪- ౩ | ౪౭- ౧ | ౪౬- ౫ | ౫౩-౧౧ | ౫౫-౩౪ | ౩-౩౩ | ౨-౭౭ | ౧౨-౧౪ | ౧౫- ౧ |
| మకర | ౧౫-౪౯ | ౧౯-౭౪ | ౭౬-౭౭ | ౭౮-౪౪ | ౩౬-౪౭ | ౪౦-౪౬ | ౪౨-౫౭ | ౫౦-౧౫ | ౫౮-౧౪ | ౭- ౩ | ౨-౫౫ | ౯-౪౭ |
| కుంభ | ౧౧- ౬ | ౧౪-౪౧ | ౭౧-౩౯ | ౭౪- ౧ | ౩౧-౫౯ | ౩౬- ౩ | ౪౩- ౯ | ౪౫-౩౭ | ౫౩-౩౧ | ౫౨-౭౦ | ౩-౧౭ | ౪-౫౯ |
| మీన | ౬-౫౫ | ౧౦-౩౦ | ౧౨-౭౮ | ౧౯-౫౦ | ౭౨-౪౮ | ౩౧-౫౭ | ౩౮-౫౮ | ౪౧-౭౧ | ౪౯-౭౦ | ౫౩- ౯ | ౫౯- ౧ | ౦-౪౮ |

జ్యోతిష్కుడు, తానుముహూర్తమును రహితము చేయునప్పుడు పంచాంగము జూచి యేరోజున పంచాంగశుద్ధిగా నుండునో ఆరోజున పంచాంగద్వారా గ్రహసంచారము శోధించుకొని మేషాది ౧౨ లగ్నములను బరిశీలించి చూడగా నేలగ్నము వకు శాస్త్రప్రకారము గ్రహబలము, దోషరాహిత్యమును గలిగియుండునో అట్టి లగ్నము పంచకరహితమయినదిగా జూచి పిమ్మట అట్టిముహూర్త లగ్నములో దాని పుష్కరాంశ వేళకు ఉదయాదిగా గాని లేక సూర్యాస్తాదిగా గాని యిన్ని ఘడియల యిన్ని విఘడియలగునని కాలమును నిర్ణయింపవలెను. ఆకాలము నిర్ణయించుటకు లగ్నము లన్నిటిని మొత్తము చేసి క్రిందపడనక్కర లేకుండ యీప్రస్తార చక్రము చూచిన మాత్రన ఉదయాది లేక అస్తాది ఇన్ని ఘడియలయ్యెనని అనాయాసముగా తెల్పదగియున్నది. అదియెట్లంటె; తాను ముహూర్త లగ్నము ఫలానాయని నిర్ణయించి పిమ్మట ఫారమును చూడవలయును. చూడగా; పైభాగమందు వ్రాయబడిన పఙ్త్తి ప్రతిదినము ఉదయప్రభృతి పునస్సూర్యోదయ పర్యంతము తిరుగు మేషాది ౧౨ లగ్నము లనియు; ఎడమ ప్రక్క నిడుపుగా మొదట వ్రాసిన కోష్ఠకములు ౧౨ న్ను మేషాది ౧౨ రవి సంక్రమణ మాసములనియు దెలియవలయును.

ఇట్లుండగా:—తాను ముహూర్తనిర్ణయము చేయునప్పటికి రవి సంక్రమణ మాసము యేదో అగడిమొదలు దాని కభిముఖముగ నడ్డపంక్తిగా వ్రాయబడిన ౧౨ గళ్లున్ను ఆనెలతాలూకు లగ్నపంక్తియని గుర్తుచేసికొని, యుంచి పిమ్మటతాను నిర్ణయించుకొన్న ముహూర్త లగ్నము యేగడియఅగునో దానిలో ఘడియ విఘడియలు యెంతవ్రాయబడి యున్నదో ఆఘటికాదిని ఉంచుకొని దానిలో ఆరోజు పంచాంగము తిధిచివరను వ్రాయబడియున్న భుక్తియను దానిని తీసివెయ్యగా మిగిలిన ఘటికాదియే తనయుద్దిష్టలగ్నముయొక్క పుష్కరాంశ వేళకు ఉదయాది ఘడియ విఘడియలగును.

ఉదాహరణము ॥ శకే ౧౮౧౪ నందననామసంవత్సరఆశ్వయుజ శు ౧౫ గురువారంరోజున రాత్రి మేషలగ్నపుష్కరయంశాక ముహూర్తము రహితపర్చబడెను. గనక ఈలగ్నపుష్కరసారిణిలో వర్తమానకన్యాసంక్రమణకోష్ఠకము చూడగా మొట్టమొదట మేషలగ్నకలంలో ఘటికాది 37-20 అని వ్రాసియున్నది- ఇందులో ఈరోజున పంచాంగములో తిధిచివర వ్రాయబడిన భుక్తియను 3-37 ను తీసివేయగా 33.43 వున్నది- ఇది నేటిదినప్రమాణము ౨౯-3౬ కంటె అధికమైనది. గనుక దానిలో నీదినమానమును తీసివేయగా ౪-౭ వున్నది, ఇదియే, సూర్యాస్తమయాది మేషలగ్న పుష్కరాంశ వేళకు అయిన ఘడియావిఘడియలని తెలియవలెను. ఈలాగున సక

లగ్నశుద్ధ్యాదులను గూడ ఆనాయాసముగ కాలనిర్ణయము చేయవచ్చును. ఇది యనేక కార్యములకు నుపకరించును.

—౧. నవవస్త్ర ఆభరణ ఛత్రాది ధారణమునకు.—

సమస్తాభరణములను ధరించుటకు॥ శ్లో॥ చిత్రావిష్ణు కరేందుదస్రవసు

౧ప్రాజేశమిత్రోత్తరా। స్వారాదిత్య సురారిపూజిత సురా

చార్యజ్ఞ వారేషుచ। రిక్తామాది వివర్జితే శుభతిథౌ సౌమ్య

గ్రహాణాంగృహే। హేమాది ప్రతికర్మధారణ శుభం ఛత్రా

ద్యవాప్తాతథా॥

టీ. సమస్తాభరణములను ధరించుటకు శుభకాలమును జెప్పుచున్నాడు- తా॥ చిత్త- శ్రవణ- హస్త- మృగశిర- అశ్విని- శతతార- రోహిణి- అనూ- ఉత్తరఫల్గుణి నక్షత్రములయందును, కుజ- భాను- గురు- శుక్ర బుధ వారములయందును- ౪- ౯- ౧౪- ౧- తిథులను- అమావాశ్యను విడిచి తక్కిన శుభతిథులయందును- వృషభ- మిథున- కన్యా- తుల- ధనుర్మీనలగ్నములందును- సమస్తాభరణములను ధరించుటకును ఛత్రము మొదలుగా గల నూతనవస్తువులను స్వీకరించుటకును శుభమగు ననుట-

—౨. లోహాది పాత్రలయందు భోజనముచేయుటకు.—

శ్లో॥ చిత్రాశ్వ్యైంద్వాంతిజ్యమిత్రరవి దస్రాజేషు కాంస్యాం తథా

భుక్తింరాజతి భాజనేపవన చిత్రాంత్యాజ పంచస్వపీ

వహ్న్యిందాసుర శూర్పభేషుశుభద స్స్యాత్స్వంచ లోహేతథా

హైమ్నిత్ర్యుత్తర రోహిణీషుచ శుభెవారేచ లగ్నేతిథౌ॥

తా॥ చిత్త- ఉఫ- మృ- పున- పుష్య- అనూ- హ- అశ్వి- రో- యిూ ౯ నక్షత్రములందును, శుభవార, శుభలగ్న, శుభతిథులయందును క్రొత్తకంచుపాత్రములలో భుజింపవలెను మరికటి శుభతిథివారలగ్నములందును, స్వాతి- చి- రే- రో- మృ- ఆర్ద్ర- పున- పుష్య యిూ ౮ నక్ష॥ యందును క్రొత్త వెండిపాత్రమందు భుజింపవలయును కృ త్తి- మూ. విశా. యిూ ౪ నక్ష॥ యందును, శైతిథివారలగ్నములందును పంచలోహపాత్రములను వాడుక చేయవలయును. ఉఫ-ఉత్తర-ఉత్తరాషాడ. ఉభా-రో యిూ ౪ నక్షత్రములయందును శైతిథివారలగ్నములందును క్రొత్తసువర్ణపాత్రములందు భుజింపవలెను.

౩. నూతనచుల్లికాస్థాపనమునకు అనగా క్రొత్తగాపొయివేయుటకు.

శ్లో॥ శూర్పాగ్నా వసుపంచకేశతమఖే మందారతీక్ష్ణత్విషాం
వారేనూతనచుల్లికాం జయదనేపూర్ణేచ సంస్థాపయేత్
బ్రహ్మత్ర్యుత్తరవాజివిష్ణువసుచంద్రాంత్యేందరావహ్నిష్వభూ
దర్కార్కోర్వ్యద్విజవాసరే శుభగృహే చుల్ల్యగ్నిసంస్థాపనం॥

తా॥ విశా, కృ, ధ, శత, పూభా, ఉభా, రే, జ్యే, ఈ ౮ నక్ష॥ యందును శని, కు
జ, భాను, వారముల యందును, ౩-౫-౮-౧౦-౧౩-౧౫ ఈతిథులందును శుభగ్రహ ల
గ్నములందును క్రొత్తగా పొయిలు కట్టవలెను. కర్కాటక లగ్నము మాత్రము కూ
డదు. రో, ఉత్తరాత్రయము, అశ్వి, శ్రీ, ధ, మృ, రే, జ్యే, కృ, ఈ ౧౨ నక్ష॥
యందును పూర్వోక్త తిథివార లగ్నములందును పొయిలో క్రొత్తగా అగ్ని హోత్ర
ము వేయుటకును మంచిది.

—౪. పర్యంకలక్షణము.—

శ్లో॥ ఏకద్విత్రిచతుర్విధ ద్రుమభవైః ఖట్వాం కృతందారుభి
శ్చైత్సౌఖ్యం బలవర్ధనంచ లభతేచాయుక్షయం నాశనం
తస్మిన్ రజ్జువిసర్పణం యదికృతేరవ్యాదివారేషుచే
త్స్యాల్లాభస్సుఖదగ్ధరోగసుతసౌఖ్యాత్మక్షయాశ్చక్రమాత్॥

తా॥ మంచము ఒకజాతి కఱ్ఱచే చేయబడెనేని సౌఖ్యంబును, రెండుజాతుల క
ఱ్ఱలచే చేయబడెనేని బలవృద్ధియును మూడుజాతులకఱ్ఱలచే చేయబడెనేని ఆయు
ఃక్షీణంబును, నాలుగుజాతుల కఱ్ఱలచే చేయబడెనేని మరణంబును ఇచ్చును. ఇకపట్టె
డ మొదలగునవి నేయుటకు; ఆదివారమునాడు నేసినేని లాభము, సోమవారము సు
ఖము, మంగళవారము అగ్నిదగ్ధము, బుధవారము రోగము, గురువారము పుత్రలాభ
ము, శుక్రవారము సౌఖ్యము, శనివారము మరణము; అగునని తాత్పర్యము.

—౫. క్రొత్తకుండతడుపుటకును, క్రొత్తరోలు వాడుకచేయుటకును.—

శ్లో॥ మృద్భాండార్ద్రికరంశుభంచ విధివిష్ణ్వర్కేజ్యమిత్రానిలా
దృక్షేష్వర్కబుధేందువారయుత పూర్ణాస్వేవ నందాసుచ
బ్రహ్మేంద్రాదితితిష్యవాయు వరుణాద్యార్కార్య మూలాసుచే
న్నవ్యోలూఖల ఘట్టనంచ శుభదంతేష్వేవ వారాదిషు॥

తా॥ రో- క్రు- హ- పుష్య- అనూ- స్వా- అశ్వి- ఈ ౭ నక్షత్రములందును, ఆది- సోమ- బుధవారములందును, ౧- ౫- ౬- ౧౦- ౧౧- ౧౫- తిథులందును, క్రొత్తకుండలు కొనుటకు శుభము॥ రో- జ్యే- పున- పుష్య- స్వా- శత- అశ్వి, ఉఫ- హ- మూ- ఈ ౧౦ నక్షత్రములందును, పూర్వోక్తతిథివారములయందును క్రొత్తరోలు వాడుక చేయుటకు శుభము.

—౬. పశువులకు బందము వేయుట, చల్ల చేసే స్తంభము పాతుట వీనికి శుభకాలము.—

శ్లో॥ రేవత్యశ్విని తిష్యపూర్వ శశిమూలత్ర్యేణు దేవేజ్యశు
క్రార్కానాంయది వాసరేషు శుభదం గోష్పాద బంధంతదా
తద్వారేషు హయాదితీందు గురుచిత్రాంత్యార్క మైత్రేషుచే
న్మంథన్యాశ్చకృతం శుభం శనిగృహే సంస్థాపనం సర్వదా॥

తా॥ రేవతి, అశ్వి, పుష్య- పూర్వ- మృ- మూ, ఈ ౬ నక్షత్రములందును, గురు, శుక్ర, భానువారములందును గోదోహనకాలికం బగు బందము వేయుట శుభము- పూర్వోక్తవారములందును; అశ్వి, పున, మృ, పుష్య, చి, రే, హ, అనూ, ఈ ౮ నక్షత్రములందును, మకరకుంభలగ్నములందును, మంధనీదండమనగా చల్లరాడు పాతుటకు శుభము.

—౭. పశువులను కట్టుటకును, దొడ్డి వేయుటకును.—

శ్లో॥ కావ్యార్యారుణవారయుక్త మృగమూలాజైకపాదశ్వినీ
జీవార్కాదితిభేషుబంధన మభూద్వృద్ధిం పశూనాం తథా
తిష్యే దేవగురోచ్చవాసరయుతే గోంశేచలగ్నే వృషే
తస్మింశ్చేన్మృగచోరబాధరహితం గోష్ఠంగవాం సౌఖ్యదం॥

తా॥ మృగ, మూ, పూభా, అశ్వి- పుష్య- హ- పున- ఈ ౭ నక్షత్రములందును పశువులను నూతనముగా కట్టెనేని పశువృద్ధియగును. పుష్యమీనక్షత్రము గురువారముతో గూడిన దినమందు వృషభలగ్నమందైనను వృషభాంశయందైనను పశువులదొడ్డి వేయబడెనేని మృగచోరబాధలు లేక పశువులు సుఖముగ నుండును.

—౮. పశువుల ప్రయాణమునకును, దూడలను కాడిపూచుటకును.—

శ్లో॥ యామ్యార్ద్రాగ్నిలమైత్రమూలమఖవాతాదిత్య చిత్రేందుషు

స్వీకర్తుం శుభదం కుజార్క శనివారేషు ప్రియాణాం పశోః
చేజ్జీవారుణ వారయోర్వరుణ శూర్పార్కార్క్య బ్రహ్మేంద్రియా
మాద్యద్యంత్యాదితిభేషు నవ్యవృషభ స్కంధేషు యుగ్యం ఘటేత్॥

తా॥ భ- ఆర్ద్రా- కృ- అనూ- మూ- మ- స్వా- పున- చి- మృ ఈ ౧౦ నక్షత్రములందును, కుజ- రవి- శనివారములందును క్రయము మొదలగువానిచే పశువులం గ్రొత్తగా దెచ్చుటకును, గురు- రవి- వారములందును శత- విశా- హ- పున- రో- జ్యే- భ- అశ్వి- రే- ఈ ౯ నక్షత్రములందును దూడలం గ్రొత్తగా కాడి పూన్చుటకును శుభము.

——౯. పోతులనుపూచుటకును, ప్రత్తిచేను చల్లుటకును.——

శ్లో॥ కాలత్వష్ట్రహరిస్థిరాహిషు శనేర్వారే శుభం చాష్టమీ
రిక్తామాసు నవం చయుగ్య ఘటనం పుంమాహిమస్కంధయోః
కార్పాసస్యచబీజ వాపనవిధిర్గుర్వర్కవారేంగనా
కర్క్యంత్యేష్వదితీయమార్కగురువాతాద్యం త్యద్వైత్యేందుషు॥

తా॥ భ, చి, శ్ర, రో, ఉత్తరాత్రయము, ఆశ్లేష ఈ ౯ నక్షత్రములందును, శనివార మందును, ౯-౪-౯-౧౪-౩౦, ఈతిథులందును క్రొత్తపోతులకు దుక్కి మప్పుటకును కాడిపూయుటకును శుభము. గురు, రవి వారములందును, కన్య, మీన, కర్కట లగ్నములందును, పున, భ, హ, పుబ్బ, స్వా, అశ్వి, రే, మూ, మృ, ఈ ౯ నక్షత్రములందును ప్రత్తిచేనుచల్లుటకు శుభమని తాత్పర్యము. ఉత్తరాత్రయ మనగా:——ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలనియు, పూర్వత్రయ మనగా:——పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలనియు తెలియంగునది.

౧౦. సెనగమొదలగు చేలు చల్లుటకును, విత్తనముల కట్టకట్టుటకును.

శ్లో॥ మూలాత్ర్యుత్తర వైష్ణవేంద్వదితి వస్వంత్యాజమైత్రానిలే
ష్వేవం కర్కిధనుర్ఘటస్థిర గృహేష్వాహుశ్చ వారే శుభే
బీజావాపనమన్వహం చణక గోధూమాఢకానాం శుభం
మూలాత్ర్యుత్తర మైత్రశూర్ప మఘవిష్ణ్వం త్యేజ్యభే బంధనం॥

తా॥ మూల, ఉత్తరాత్రయము, శ్ర, మృ, పున, ధ, రే, రో, అనూ, స్వా, ఈ ౧౨ నక్షత్రములందును, కర్కి, ధను, తులా, వృష, సిం, వృశ్చి, కుంభ, ఈలగ్నములందును, బుధ, గురు, శుక్ర వారములందును, సెనగ, గోధుమ, కంది విత్తనములు చ

ల్లుటకు శుభము. మరిన్ని మూల, ఉత్తరాత్రయము, అనూ, విశా, మ, శ్ర, రే, పుష్య, ఈ ౧౦ నక్షత్రములందు, సమస్త జాతుల విత్తనములున్ను కట్టగాకట్టి జాగ్రత్త చేయు టకున్నుశుభమని తాత్పర్యము.

—౧౧. అరటిచెట్లు, మామిడిచెట్లు వేయుటకు.—

శ్లో॥ పుష్యోత్తరాభాద్ర మఘాశ్విపౌష్ణ
మైత్రార్యభేషుక్రియ కీటవృషాంగనాసు
పూర్ణాజయాసు భృగువిద్గురువాసరేషు
సంస్థాపనం కదళిభూత వనాదికార్యం॥

తా॥ పుష్య, ఉభా, మ, అశ్వి, రే, అనూ, ఉత్తర, ఈ ౭ నక్షత్రములందును మేష, వృశ్చిక, వృష, కన్య ఈలగ్నములందును, ౩-౫-౭-౧౦-౧౩-౧౫, ఈతిథులం దును బుధ, గురు, శుక్ర వారములందును అరటి మొక్కలును, మామిడి మొక్కలును వేయుటకు శుభము.

—౧౨. కొబ్బరితోట మొదలగు తోటలువేయుటకు.—

శ్లో॥ వాక్పతౌచాశ్వినీహస్త మృగమైత్రా సురేషుచ
ఖర్జూరనారికేళాది తరుసంస్థాపనంశుభం॥

తా॥ పుష్య- అశ్వి, హ, మృ, అనూ, మూ, ఈ ౬ నక్షత్రములందును ఖర్జూర నారికేళాది వృక్షములు తోటవేయుటకును, శుభము. ఆదిశబ్దమువేత పోకచెట్లు పుశిరి కె మొదలగు ఫలవృక్షము లన్నియును వేయవచ్చునని తాత్పర్యము.

—౧౩. సకలఫలవృక్షములకును.—

శ్లో॥ రేవత్యుత్తరరోహిణీగురుకరాదిత్యేషునక్షంచరే
హాయావారుణవాజినోశ్చశశి జ్ఞేంద్వార్క్యేషు నారేషుచ
వృక్షస్థాపనబీజవాపన హలప్రారంభ కార్యేశుభం
కన్యాకర్కయు గోక్షమీన మకరేసంపూర్ణధాత్రీఫలం॥

తా॥ రేవతి, ఉత్తరాత్రయము, రోహిణి, పుష్య, హ, పున, మూ, స్వాతి, శత, అశ్వి, ఈనక్షత్రములందును, గురు, బుధ, సోమవారములందును, కన్య, కర్క, మిథు న, వృషభ, మీన, మకర, ఈ రాసులయందును, హల కర్మారంభము, సమస్తబీజావా పనము, సమస్త ఫలవృక్షములున్ను వేయబడెనేని సూభూమిసంపూర్ణ ఫలప్రదంబగును.

—౧౪. పొగతోట వేయుటకు.—

శ్లో॥ నిశాకరేగురౌరాధాద్రి తురంగేకాలవాతయోః
గురుభౌమార్కవారేషు స్థాప్యంచేద్ధూమపత్రికం॥

తా॥ మృ, పుష్య, ఆర్ద్రి, అశ్వి, భ, స్వా ఈ ౬ నక్షత్రములందును; గురు, రవి, భౌమవారములందును పొగతోట వేయుట శుభము.

—౧౫. గంజాయితోట వేయుటకు—

శ్లో॥ మూలోత్తరాదితీశక్రి పౌష్ణమైత్రికరేందుషు
భౌమార్కగురువారేషు స్థాప్యం గాంధారికస్యచ॥

తా॥ మూల, ఉత్తరాత్రయము, పునర్వ, జ్యే, రే, అనూ, హ, మృ, ఈ ౮ నక్షత్రములందును ; కుజ, గురు, రవివారములందును గంజాయితోట వేయుటకు శుభము.

—౧౬. చేలకాపుకు.—

శ్లో॥ చిత్రాశ్వివస్వగ్ని విశాచరేషు వారేషుజీవేందుజభార్గవానాం
సస్యస్యగుప్తిం మృగనాగచోరైః క్రోడాదికైస్స్యాద్భయనాశనంచ॥

తా॥ చిత్ర, అశ్వి, ధ, కృ, మూ ఈ ౫ నక్షత్రములందును ; బుధ, గురు, శుక్రవారములందును చేల కాపు నిమిత్తము వెళ్లినేని, అడవిపందులు మొదలగు మృగములచేతను, సర్పములచేతను, దొంగలచేతను భయము కలుగదు.

—౧౭. వుల్లితోట పాతుటకు.—

శ్లో॥ రేవత్యశ్విని మైత్రివాయు వరుణాదిత్యేంద్రవిష్ణ్విజ్యమూ
లార్యమ్ణేందుషు భానుసోమ గురువారేష్వేవ వృద్ధిప్రదం
పూర్ణాయాంమృగ మీనకీట కధనుః కుంభేషుచార్కోదయే
స్థాప్యంగృంజనబీజమాహు రితివాసిష్ఠాత్రిగార్గ్యాదయః॥

తా॥ రే, అశ్వి, అనూ, స్వా, శ, పున, జ్యే, శ్ర, పుష్య, మూ, హ, ఉఫ, మృ ఈ ౧౩ నక్షత్రములందును ; భాను, సోమ, గురువారములందును ; ౫, ౧౦, ౧౫ ఈతిథులయందును, మకర, మీన, వృశ్చిక, ధను, కుంభ, సింహ లగ్నములందను వుల్లితోట వేసినేని, వృద్ధి యగునని వసిష్ఠాదులు చెప్పిరి.

—౧౮. కొత్తధాన్యము తెచ్చుటకు.—

శ్లో॥ మృదుక్షిప్రాఖ్యఋక్షేషు శశిభృగ్విజ్యవాసరే

చంద్రతారాబలేచసస్యాన్నవ్యధాన్యాగమం శుభం॥

తా॥ చిత్త, రే, మృ, అనూ, అశ్వి, పుష్య, హ ౭ ఈనక్షత్రములయందును; సోమ, గురు, శుక్రవారములందును; చంద్రతారా బలయుక్తమగుచుండగా, క్రొత్తధాన్యము పొలమునుంచి తమ గృహమునకు తెచ్చినేని శుభమగును.

## —౧౯. క్రొత్తధాన్యాన్నము భుజించుటకు.—

శ్లో॥ తిష్యాదిత్యాశ్విదైత్యాధిప వసువరమేష్వంత్యచిత్రావిశాఖా
శ్రీశప్రాచేత సార్కశ్వసన పితృవిశాధీశ మిత్రోత్తరాసు
రిక్తాహిత్వాంత్య మేషాళిషుచ శుభతిథౌచాష్టమస్థం శశాంకం
హిత్వామందేగురౌవాశుభమితి మునయోనవ్యధాన్యాన్నభుక్తిం॥

తా॥ పుష్య, పున, అశ్వి, మూ, ధ, రో, రే, చి, వి, శ్ర, శత, హ, స్వా, మ, మృ, అనూ, ఉత్తరాత్రయము ఈనక్షత్రములందును; ౨, ౩, ౫, ౭, ౧౦, ౧౧, ౧౩ ఈ తిథులందును; మేష, వృశ్చి, మీన ఈలగ్నములందును; అష్టమచంద్రుడు లేకుండగాను శని, గురువారము లందును క్రొత్త ధాన్యాన్నమును భుజించినేని, శుభమని మునులు చెప్పిరి.

## —౨౦. క్రొత్తభూమిలో కృషికి ప్రవేశించుటకు.—

శ్లో॥ మైత్రార్కత్రియ రోహిణీవసుమఖాదస్రోత్తరాంత్యాసురే
ష్వాద్యారజ్ఞకవేదినేషు శుభదోమధ్యస్తుచాంద్రేదినే
త్యక్త్వారిక్తదినాదిదగ్ధదినసార్ధ దర్శానవమావైధృతి
వ్యాఘాత వ్యతిపాతవిష్టిదివసాన్ శేషాః కృషౌశోభనాః॥

తా॥ అనూ, హ, చి, స్వా, రో, ధ, మ, అశ్వి, ఉత్తరాత్రయము, రే, మూ, ఈ నక్షత్రములందును; భాను, భౌమ, బుధ, శుక్రవారములందును; కృషి భూమియందు ప్రవేశించుట శుభమనియును; సోమవారము మధ్యమ మనియును; రిక్త, దగ్ధ అనే తిథులును; ప్రతిపత్తును, అమావాస్య, అవమ, వైధృతి, వ్యాఘాత, వ్యతిపాత, ఈయోగములున్ను విష్టి లేక భద్రకరణంబును వీనిని బరిత్యజించి తక్కిన దినములు కృషి భూమియందు ప్రవేశించుటకు శుభము.

## —౨౧. ఏరువాకకు.—

శ్లో॥ శూర్పార్కేందు మఘావితీ విధిహయశ్రీశత్రయత్ర్యుత్తర

క్రవ్యాదాంత్యసమీర మిత్రగురుషుత్వాష్ట్రజార్యతీక్ష్ణత్రిషాం
వారేష్వార్ధల కర్మణోంత్యయుగ కన్యాచాపకీటే శుభం
తౌలీనక్రఘటాజకర్కి-హరిషు ప్రాణఘ్నసస్యక్షయా
చోరంత్రాసపశుఘ్న వాహాభుజగత్రాసాభవేయుః క్రమాత్॥

తా॥ విశా, హ, మృ, మ, పున, రో, అశ్వి, శ్రి, ధ, శ, ఉత్తరాత్రయము, మూ, రే. స్వా, అనూ, పుష్య, ఈనక్షత్రములందును, కుజ, గురు, భానువారము లందును, వృష, మీన, మిధు, కన్య, ధను, వృశ్చి, ఈలగ్నములందును హల కర్మము శుభమగును.

మరియును, తులాలగ్నమందు హలకర్మ ఆరంభము చేసినేని ప్రాణహానియు, మకరమందైతే సస్యనాశంబును, కుంభమందైతే చోరభీతియు, మేషమందైతే పశునాశనమనియు, కర్కాటకమందైతే సర్వనాశనంబనియు సింహామందైన సర్పభయమనియుం జెప్పబడెను.

—౨౨. బీజావాపనమునకు.—

శ్లో॥ రిక్తాపర్వవిష ప్రదోషరహితే వారేశుభానాం గృహే
క్షిప్రస్వాతిమృదుధ్రువాసుర మఘావిష్ణుత్రయాఖ్యోడుషు
బీజావాపనమాద్యమేవఫలదంస్యాత్పూర్వ సస్యేపరే
యద్వర్ణగ్రహవాసరేషు యదివాతద్వర్ణబీజంవపేత్॥

తా॥ రిక్తతిధులును, పంచపర్వంబులును, త్యాజ్య ఘటికలును, ప్రదోషకాలంబును వీనింబరిత్యజించి తక్కిన తిధులయందును, శుభగ్రహవారముల యందును క్షిప్రసంజ్ఞలనగా—అశ్వి, హ, పుష్య, నక్షత్రములయందు చిత్ర, రే, మృ, అనూ, రో, ఉత్తరాత్రయము, స్వా, మూ, మ, శ్రి, ధ, శ, ఈనక్షత్రములందును విత్తనములం జల్లినేని ఫలప్రదంబగుననియును, మరిన్ని ఏవన్నెగల విత్తనములును ఆవన్నెగల గ్రహవారము లందు అన్ని విధములయిన విత్తనములు చల్లిన శుభమనియును బుధ, గురు, శుక్రవారములందు అన్నివిధములయిన విత్తనములు చల్లిన శుభమనియు, ఏరువాకకు జెప్పినలగ్నములయందు విత్తనంబులం జల్లిన ఫలప్రదంబగుననియు దాత్పర్యము.

—౨౩. క్రొత్తగా ధాన్యాదుల రాశి కొలుచుట.—

శ్లో॥ మైత్రార్కేందుమఖోత్తరాత్రయహయత్వాష్ట్రాంత్యభాగ్యత్రయ

బ్రహ్మాంగీరసభేషుభద్రజయయా పూర్ణాఖ్యతిథౌ చేచ్ఛుభం
గోసింహాంత్యఘటాంగనాయుగ ధనుర్లగ్నేషు భృగ్వార్యయో
ర్వారే పాపగృహేషు పాపఖచరాస్స్వామ్యాత్రిశ్ఛుభేషుస్థితాః॥
స్వాద్వారస్థిత దుర్ముహూర్తసహితే సేందూదయే వా తథా
ఋక్షత్యాజ్యయుతే తు మాసమయ ప్రాప్తే తు లగ్నే యదా
మధ్యేఽభ్రిస్యమఖర్క్ష తోరణయుతే చేద్ధాన్యరాశేఃక్రమా
న్మందం మానమితి బ్రువంతి మునయో తద్వృద్ధి సంప్రాప్తయే॥

తా॥ అను, హ, మృ, మ, ఉత్తరాత్రయము, అశ్వి, చి, రే, పూర్వాత్రయము లో, పుష్య ఈ నక్షత్రములందున్ను, ౨-౩-౫-౭-౮-౧౦-౧౨-౧౩-౧౫ ఈ తిథులందున్ను, వృష, సింహ, మీన, కుంభ, కన్యా, మిధు, ధను ఈ లగ్నములందును, గురు, శుక్రవారములయందును ఆముహూర్త లగ్నానికి ౩-౬-౮-౧౧-౧౨ ఈ స్థానములయందు పాపగ్రహంబులును, ౧-౪-౫-౭-౯-౧౦ ఈ స్థానములందు శుభగ్రహంబులు నుండగా, రాశికొలకు మధ్యసుమూహూర్తము వున్న లగ్నము వారదుర్ముహూర్తము తోనైనను చంద్రోదయములోనైనను, నక్షత్రత్యాజ్య కాలముతోనైనను కూడియుండగా నున్ను, అంతరిక్షమందు మఘానక్షత్రము మధ్యాహ్నమైయుండగానున్ను ధాన్యాధి రాసులను నింపాదిగ కొలిచినేని ధాన్య వృద్ధియగునని మునులు చెప్పిరని ఫలగ్రంధమందు చెప్పబడియున్నది.

## —౨౪. రాశికొలకు ప్రత్యేకవారఫలము—

శ్లో॥ బుధస్త్రిభాగం వసుభాగ మూర్వ్యాజోరవి ర్దశాంశంచ శశీకళాంశం
శనైశ్చరోవింశతి భాగమాహా రేన్నభాగహారౌ గురుభార్గవౌతథా॥

తా॥ రాశిని కొల్చునాడు బుధవార మయ్యేనేని మొత్తము రాశియొక్క 3 వ పాలునున్ను, మంగళవారమయ్యేనేని ౮ వ పాలునున్ను, ఆదివారమునాడు ౧౦ వ పాలునున్ను సోమవారము ౧౬ వ పాలునున్ను, శనివారము ౨౦ వ పాలునున్ను ఈ రీతిగా హరించును. గురుశుక్రవారములందు కొలిచినేని యెంతమాత్రము ధాన్యాదులనున్ను హరింపరనియును తాత్పర్యము గనుక గురుశుక్రవారములు ధాన్యాదిరాసులకొలతకు మిక్కిలి శుభము.

## —౨౫. క్షౌరమునకు.—

శ్లో॥ శస్తాహస్తచతుష్టయాదితిగురుశ్రీశత్రయాద్యేందవో
జ్యేష్ఠాంత్యోడుచమధ్యమంచశుభకృచ్చంద్రజ్ఞవారాన్వితే
రోగాంతేమృతకర్మసుక్రతువిధౌ పుణ్యస్థలేశోభనే
కారాగారవిమోచనేశుభకరం క్షౌరంతువర్జ్యేష్వపి॥

తా॥ హస్త- చి- స్వా- విశా- పున- పుష్య- శ్ర- ధ- శత- అశ్వి- మృ- ఈ నక్షత్రములందు ప్రశస్తము. జ్యేష్ఠ- రేవతి ఈ ౨ నక్ష మధ్యమములు. సోమ- బుధ- వారములందు మంచిది. ఈప్రకారమాలోచించి మంచిరోజున క్షురకర్మ చేయించు కొనవలయును మరియు నొక్క విశేషంబుగలదు. యేమనిన; రోగియొక్క ఆరోగ్య స్నానదినమందును, మృతకర్మలయందును, యాగాది క్రతుదినములందును, పుణ్యక్షేత్రములందును శుభకార్యములందును, చెరసాలనుంచి విడువబడినరోజుననున్న నిషేధ తిథివారాదులు తటస్థించినను క్షురకర్మ శుభకరమే యగును.

## —౨౬. ప్రయాణమునకు.—

శ్లో॥ అశ్వాంత్యాదితితిష్యమైత్రవసువిష్ణ్వింద్వశ్విమూలానుగో
కర్కిసింహధనుర్ఝషేషుబుధశుక్రార్క్యేందువారేతథా
హిత్వాద్వాదశిపూర్ణిమాష్టమతిథీ భద్రాన్నుపూర్ణాజయా
భిఖ్యేష్వహ్నిషుచేత్ప్రయాణమనిశం తత్కార్యసిద్ధిర్భవేత్॥

తా॥ హస్త- రే- పున- పుష్య- అనూ- ధ- శ్ర- మృ- అశ్వి- మూ- ఈనక్షత్రము లందును, వృష- కర్కాట- సింహ- మిధు- ధనుర్లగ్నము లందును, బుధ- శుక్ర- గురు- సోమవారములందును, ౧౨- ౧౫- ౮ ఈ తిథులు గాక తక్కిన అనగా ౨- ౩- ౫- ౭- ౧౦- ౧౩- ఈతిథులందును ప్రయాణమైతే కార్యసిద్ధి యగును.

ఇందు చెప్పబడినలగ్నములలో మిధునలగ్నమును కాలామృతములో నిషేధించెను.

## ౨౭. ప్రయాణవిషయమై ప్రాగాదిదిక్కులకు తిథివారాది శూలలును, శూలల పరిమాణకాలంబును.

తూర్పునకు; ప్రతిపత్తు, నవమి, శని సోమవారములు జ్యేష్ఠధనిష్టలు; తుల, కుంభములును. ఆగ్నేయమునకు ౩-౧౧ తిథులు; గురుశనివారములు; మకరములును. దక్షిణమునకు; ౫, ౧౩ తిథులును; గురువారము; శ్ర, అశ్వి, మీన, వృశ్చికమును. నై

కృత్తిక; ౮-౧౨ తిథులును; సోమ, శుక్రవారము కర్కాటలగ్నము. పశ్చిమమునకు; ౬-౧౪ తిథులును; శుక్ర, రవివారములు, పుష్య, రో, ధను, సింహములు. వాయవ్యమునకు; ౭-౧౫ తిథులు; బుధ, భౌమవారములు; మీనలగ్నము. ఉత్తరమునకు; ౨-౧౦ తిథులు, బుధ మందవారములు; హస్త, పూభ, వృష, కన్యాలగ్నములు. ఈశాన్యమునకు; ౩౦-తా తిథులును; బుధవారము; మిధునలగ్నములు మేలని చెప్పబడు గునది.

శుక్రవారము ఆయాదిక్కులకు చెప్పబడిన తిథివారనక్షత్రలగ్నములను విడిచి తక్కినవానియందు ప్రయాణమై వెళ్లవచ్చును.

వీనికి శ్లోకములు వ్రాసినేని గ్రంథవిస్తారమగునని సంక్షేపింపబడియె.

### ప్రయాణవిషయమై దిక్కులకు మంచివారములు.

తూర్పునకు; మంగళవారము, దక్షిణమునకు; సోమ శని వారములును, పశ్చిమమునకు; బుధగురువారములును, ఉత్తరమునకు; రవి శుక్రవారములందు పోవ జనును.

### ౨౭. నూతన వస్త్రధారణమునకును, ఆభరణ ధారణమునకును.

శ్లో॥ కుర్యాన్నూతన వస్త్రభూషణధృతిం విష్ణుత్రయార్కత్రయం
బ్రహ్మాదిత్యగురూత్తరాద్వశశిభృన్మిత్రాంత్యమూలేష్వపి
వారావారదినేశయోఃప్రతిపదం రిక్తామమావష్టమీ
నందావైధృతివిష్టిపాతపరిఘాన్ హిత్వాధమందేధవా॥

తా॥ రవి, కుజ, శనివారంబులును, ఉభయాష్టమీ ప్రతిపత్తులను, నందరిక్తతిథులను, దినక్షయంబును, పరిఘవైధృతి యోగంబులును, భద్రకరణంబును, వ్యతీపాత మహాపాతలను, వీనింబరిత్యజించి తక్కిన తిథివారములందును, అశ్వి, రో, మృ, పున, పుష్య, ఉత్తరాత్రయము, హ, చి, స్వా, అనూ, మూ, శ్ర, ధ, శత, రే, ఈనక్షత్రములందును, శిశువునకు నూతనముగా వస్త్రాభరణములు ధరించిన శుభము గలుగును.

### ౨౮. కూపారంభమునకు.

శ్లో॥ మైత్రత్ర్యుత్తరవారుణార్కమఘపుష్యేందాగ్రజీవేషుపా
షాణంచామృతతుల్యనీరమజలం క్షారోదకంక్షీరకం
కీలాలంనజలంచపల్వలమిదం భాన్వాదివారేషుచ

త్వ్యాణ్ణాయాంచజయాష్టమీవిరహితే విద్యాదశీభద్రకే
కర్కిణ్యంత్యమృగేషుకుంభవృషయోస్తౌలీయుగాళిష్వధో
పూర్ణార్ధాంశజలంక్రమాద్భవతి శేషేష్వనష్టంజలం
ఏకద్విత్రిచతుర్గృహేష్వశుభగేష్వారంభలగ్నస్యత
శాత్రసాధస్థలగాశ్మదర్శనమిదం కూపస్యచైవక్రమాత్
పాపాఃకేంద్రగతాతిసూర్యభవనేష్వశ్మనసందర్శనం
కేంద్రేవాజలభేషుచంద్రభృగుజౌనీరాధికంకూపతః
త్రీణిత్రీణియథాక్రమంవిలిఖితం కూపాకృతౌ వతుర్ణాలే
చక్రేజాదిహిమాంశుభాంతమనిశం ప్రాగాదిమధ్యేపిచ
నిర్నీరంనజలాజలాజలసుధా తుల్యోదకాజీవన
స్వాద్వంభాంసికషాయకంసలవణం మధ్యేచశీఘ్రంజలం
కూపస్యాహదిగర్వాణస్య ఫలమైశ్వర్యంచ వృద్ధింసుతై
హీనం సౌఖ్యమరిష్టదంచమరణం నంపచ్ఛశత్రోర్భయం
మధ్యేనాశకరం నివేశనభువస్యాచ్ఛంభు కోణాదికం॥

తా॥ అనూ, ఉత్తరాత్రయము, శత, హ, మ, శ్ర, జ్యే, రో, పుష్య, ఈనక్షత్రము లందు శుభము. ఆదివారమున కూపారంభము జేసినేని పాషాణములును; సోమవారమున నమృత తుల్యోదకంబును, మంగళవారమున జలహీనంబును, బుధవారమున క్షారోదకంబును, గురువారమున క్షీర తుల్యోదకంబును, శుక్రవారమున జలలోకూడిన యుదకంబును, శనివారమున పచ్చికగుంటవలెను నీరున్ను కలుగును. గాన; సోమ, గురు శుక్రవారములయందును; ౨, ౩, ౫, ౭, ౧౦, ౧౩, ౧౫, ఈతిథులయందును, కర్కి, మీన, మకర రాసులయందును పూర్ణజలమనియును; కుంభ, వృషభ లగ్నములయందర్ధజలమును; తులా, మిధునలగ్నములయందు పాదజలంబును గలుగుగాన; కర్కాటక, మకర, మీనరాసులందును, కూపారంభలగ్నమునకు ౧, ౨, ౩, ౪ గృహములందు పాపగ్రహములు లేకుండగానున్ను లగ్నాదికేంద్రములందు శుక్రచంద్రులుండగానున్ను, యీచంద్రశుక్రులే కర్కాటక, మకర, మీనములనెడు జలరాసులందుండగానున్ను, కూపారంభము జేసినేని సంపూర్ణజలము దొరకునని తాత్పర్యము. లగ్నాది కేంద్రములందుగాని లగ్నాదిగా ౧, ౨, ౩, ౪ స్థానములందుగాని పాపులున్నను, లగ్నమందు రవియున్నను పాషాణములు గన్పించును. పాపులు లగ్నమందుంటె మొద

టి నిలువులోనున్ను ౨ ట వుంటె ౨ వ నిలువులోనున్ను, ౩ ట వుంటె ౩ వ నిల్వులోనున్ను; ౪ ట వుంటె ౪ వ నిల్వులోనున్న రాశ్లు గన్పించును. ఈలాగు కూపారంభ ముహూర్తమును జాగ్రతగా నుంచవలెను.

—కూపచక్రవిన్యాసము.—

కూపాకారముగా అనగా వర్తులముగా నొకచక్రము వేసి యందు రోహిణీనక్షత్రము మొదలు ప్రాగాదిగా మూడేసినక్షత్రముల చొప్పున ౨౭ నక్షత్రములు మధ్యముతోగూడ ౯ దిక్కులందును లిఖించగా నందు చంద్రుడున్న నక్షత్రము కూపచక్రముకు; తూర్పు, దక్షిణ, నైరృతి వాయువ్యదిక్కులనున్న నక్షత్రములలో నొకటైయుండెనేని జలనాశనమనియు, ఆగ్నేయమున పూర్ణజలమనియు, పశ్చిమంబున అమృతతుల్యోదకంబనియు, ఉత్తరమున రుచ్యమగుజలమనియు, యీశాన్యమున లవణజలమనియు, వగరనియు, మధ్యప్రదేశమందు శీఘ్రజలమనియును తాత్పర్యము.

—కూపమునకుఆర్వాణముచూచే క్రమము.—

తాము నివసించు స్థలమునకు కూపము యీశాన్యభాగమున నుండెనేని ఐశ్వర్యంబును, తూర్పున వృద్ధియును, ఆగ్నేయంబున పుత్రనాశంబును, దక్షిణంబున సౌఖ్యంబును, నైరృతిని అరిష్టంబును, పడమర మరణంబును, వాయువ్యయమున సంపదయు, ఉత్తరమున శత్రుభయంబును, మధ్యమునందు నాశనమును గలుగును.

—౩౦. ఇక రజస్వలాప్రకరణము.—

శ్లో॥ కన్యాయాః ప్రథమార్తవే శుభకరాణ్యాద్యంత్యమూలోత్తరా
బ్రాహ్మ్యేందు దినేశపంచక హరిత్రీణ్యే వనాన్యానితు
వారాశ్చేందుజజీవశుక్రశశినాం తే షాంచవర్గాశ్శుభాః
కేంకోప్రాంత్యధనత్రికోణసహితాశ్చాన్యేరి లాభద్రిగాః॥ కాలా॥

స్త్రీయొక్క రజస్వలాసమయమందు; అశ్వి, రే, మూ, ఉత్తరాత్రయము, రో, పుష్య, మృ, హ, చి, స్వా, వి, అనూ, శ్ర, ధ, శ, యీనక్షత్రములను, బుధ, గురు, శుక్ర, సోమవారములున్ను, యీశుభగ్రహములయొక్క షడ్వర్గమున్ను మంచిది. ఈశుభగ్రహములు రజస్వలాలగ్నమునకు కేంద్రములందు అనగా ౧-౪-౭-౧౦ స్థానములయందున్ను, ౧౧, ౨, ౫, ౯ స్థానములందును వుండగానున్ను పాపులు ౬-౧౧-౩ స్థానములందుండగానున్ను శుభప్రదమని చెప్పబడెను.

శ్లో॥ కృత్తికార్ద్రాపునర్వసూమఘాజ్యేష్ఠారజస్వలా

ఆదివారేశుభం ప్రోక్తం సాకన్యామంగళప్రిదా
ద్వితీయతురజోమష్టం పంచవింశతిభోజనం
త్రిపాదేచచతుర్థేచ శాంతిం కుర్యాద్యథావిధి॥ ఫలగ్రంథము॥

టీక॥ ఆర్ద్ర, జ్యే, పున, మ, కృ, యీనక్షత్రముల ప్రథమపాదమందు రజస్వల అయితే శుభము; ౨ వ పాదమందైతే స్వల్పదోషము గాని ౨౫ గురు బ్రాహ్మణులకు భోజనమిడవలెను. ౩-౪ పాదములయందైతే అధికదోషము గనుక యథావిధిగా శాంతి జేసికొనవలెను.

శ్లో॥ వైధవ్యాఽసుతనిర్ధనాఽశుభఫలం యామ్యత్రిపూర్వోరగా
ష్వేకద్విత్రిచతుష్పదానియువతేర్దద్యుఃక్రమాదార్తవే॥

టీక॥ భర, పూర్వాత్రయము, ఆశ్రే, యీనక్షత్రముల మొదటిపాదమందు రజస్వలయితే ఆస్త్రీకి వైధవ్యంబును, యీనక్షత్రముల ౨ వ పాదములందైతే సంతానరాహిత్యంబును, వాని ౩ వ పాదములందైతే దారిద్ర్యంబును, వాని ౪ పాదములందైతే అశుభఫలంబును యిచ్చును.

శ్లో॥ దుఃఖస్యాత్పితృరౌద్రయోరదితిభేసాబంధకీశక్రభే
వ్యగ్నౌనిస్వతరాక్కభౌమదినకృద్వారేషురోగార్తికృత్॥ కాలా॥

చెడ్డవానిఫలములు:—మఖ, ఆర్ద్రలయందైతే దుఃఖవంతురాలు అగును; పునర్వసు జ్యేష్ఠలయందును వ్యభిచారిణి; కృత్తికయందుదరిద్రురాలు అగును. మరియును రవి, కుజ, శనివారములందైతే రోగములచే పీడింపఁబడును.

శ్లో॥ సంధ్యోపప్లవపర్వపాతపరిఘారిక్తాష్టమీద్వాదశీ
షష్ఠీవిష్టివిషావమాదిదివసాదుష్టర్క్షసంస్థారవిః
రంధ్రేందుర్నిధనోడుభర్తురశుభాయోగానిశావైధృతిః
పాపాక్రాంతభమస్తపాపవసతిః కన్యార్తవేదోషకృత్॥ కాలా॥

టీక॥ సంధ్యాకాలము, ఉపద్రవకాలము, పర్వము, మహాపాతకాలము, పరిఘనామయోగమున్ను, రిక్తతిథులున్ను ఉభయపక్షములయందలి అష్టమి, ద్వాదశి, షష్ఠి, తిథులున్ను, విష్టికరణము, విషకాలము, దినక్షయము మొదలయిన తిథులయందున్ను సూర్యుడు దుష్టరాశియందున్నప్పుడును ఆస్త్రీయొక్క భర్తకు, అష్టమచంద్రవైధనతారలయందును, ఇంకా దుష్టయోగములు, రాత్రిభాగము, వైధృతినామయోగము

పాపగ్రహమున్న నక్షత్రము, రజస్వలానక్షత్రమునకు సప్తమమందు పాపగ్రహముండ గా వీనియందు స్త్రీ రజస్వల యయ్యెనేని దోషంబు. మఱిన్ని.

శ్లో॥ శ్రీశేంద్రాసుకభేషుచిత్తవరుణేం ద్వారోత్తరాస్వంత్యశూ
ర్పాశ్విబ్జ్యానలమిత్రభేషుచవిధౌ పుష్పంచసందృశ్యతే
స్త్రీణాంపంచదిగష్టశైలమితసత్పుత్రాభవేయుఃక్రమా
త్స్వాత్పూర్వత్రయభేషుయామ్యవుణినోః పుష్పంచసందృశ్యతే
పుంసాంతన్ముఖదర్శనంమరణదం ద్వ్యేకషడబ్దక్రమాత్॥

తా॥ శ్ర-జ్యే-మూ- ఈమూడునక్షత్రములలో నొకనక్షత్రమందు స్త్రీ ప్రథమ రజస్వలయయ్యెనేని అయిదుగురు కొమాళ్లును : చి- శ-మృ-హ- ఉత్తరాత్రయం, వీని లో నొకదానియం దైతే పదిమంది కొమాళ్లు ను; రే-వి- అశ్వి పుష్య- స్వాతి- అనో వీనిలో నొకదానియందైతే యెనుమండ్రుకొమాళ్లును ; రోహిణీనక్షత్రమందైతే యేడు గురు కొమాళ్లును కలుగుదురు. మఱియును పూర్వాత్రయము అనగా పుబ్బ- పూర్వా షాఢ- పూర్వాభాద్ర వీనియందు రజస్వలయయిన స్త్రీయొక్క ముఖమును పెనిమిటి రెం డుసంవత్సరముల వరకును, భరణియందైతే ఒకసంవత్సరమువరకును ఆశ్లేషయందైతే ఆరుసంవత్సరములవరకును చూడగూడదు. చూచెనేని మరణము కలుగునని ఫలగ్రంథ ము చెప్పుచున్నది.

౧. గ్రంథాంతరమందు॥ శ్లో॥ క్రూరక్షే ప్రథమార్తవం యదిభవే
త్తచ్ఛాంతిమాదాస్త్రియాం । కృత్వానంతర మార్తవంచశుభ
భేస్యాచ్చేత్తథావల్లభః । సంయోగం కురుతేశుభం భవతిక్రూర
ర్క్షస్థితేందౌరవౌ । స్నామ్యర్క్షంచగతే భవేదశుభకృన్నైతిస్త్రి
యామార్తవే॥

తా॥ క్రూరనక్షత్రములయందు; ప్రథమరజస్వలయైనస్త్రీకి ముందుగా శాంతిచేసి తిరిగి శుభనక్షత్రమందు యెప్పుడు రజస్వలయగునో అంతవరకును యూరకొని అప్పుడు గర్భాధానముహూర్తము చేయబడెనేని శుభమగును. క్రూరనక్షత్రమందు చంద్రుడున్నను- సూర్యుడు శుభనక్షత్రమందుండెనేని దోషములేదని యభిప్రాయము. దీనియర్థమునే గ్రంథాంతరమందు మఱియొక శ్లోకముగా వ్రాయబడియున్నది.

ఎట్లంటే॥ శ్లో॥ పుష్పందృష్టంనిందితేభేయతస్యా। చ్ఛాంతింకుర్యాదంగ
నానాంచపూర్వం। తత్సంయోగంవల్లభోవర్జయేయు। ర్యావ

ద్భాయుశ్శస్తథేచైవదృష్టం॥ ౩౭॥

శ్లో॥ యదాహిసందష్టజనోవిశేషైర్మంత్రౌషధైస్సాన్త్వయస్వముపైతిభూయః
దథైవగండోరగదష్టజంతుస్తదుక్తశాంత్యాశుచిరంసజీవతి॥

తా॥సర్పదష్టమయిన మనుష్యునకు మంత్రౌషధిక్రియలచే వెంటనే శాంతి చేయక పోవుట వల్ల యెట్లు హానికలుగునో అప్రకారమే ఈనక్షత్రములకు వెంటనే శాంతి చేయకపోయినయెడల అట్లు హాని సంభవించును. వెంటనే అట్టి మంత్రమువల్ల యెట్లు ఆపత్తు నివారణమవునో అప్రకారం తద్దోషము శాంతియగును. పిమ్మట గర్భాధానముహూర్త మాలోచింపవలెను.

## —౩౧. జనన ప్రకరణము.—

శ్లో॥ గండస్స్యాచ్ఛిసుజన్మనాఽసితచతుర్దశ్యాష్షడంశేషుచే
దాద్యక్షేమమనంతరంజనకమాతోర్మాతులాగ్రియరో॥
స్స్వస్యాపిక్రమశష్షడంశకయుతాఽయాయాంతుతద్వత్క్రమా
ద్విత్తాంబాపితృమాతులాత్మనిధనం వష్టాంశకేక్షేమకృత్॥

తా॥ బహుళచతుర్దశియందు జననమయ్యెనేని యాచతుర్దశి తిధియొక్క మొత్త ము అనగా తిధ్యాద్యంతము చేసి దానిని ఆరింటభాగింపగా నది యొకపాలు అవును. అట్టి ఆరుపాళ్లకు వరుసగా ఫలము చెప్పబడును. అందు మొదటిపాలునందు జననమయ్యెనేని క్షేమంబును, రెండవభాగమందు పితృగండంబును, మూడవభాగమందు మాతృగండంబును, నాల్గవభాగంబునందు మేనమామగండంబును, అయిదవభాగంబునందు భ్రాతృగండంబును, ఆరవభాగంబునందు ఆజననమయిన శిశువుగండంబును, అగును-అప్రకారముగనే అమావాస్యయును- ఆరుపంతులుచేయగా మొదటిభాగమునందు జననమయ్యెనేని ధనగండము, రెండవభాగమందు మాతృగండము, మూడవభాగమందు పితృగండము నాలుగోభాగమందు మేనమామగండము, అయిదోభాగమందు ఆశిశువునకు గండము ఆరవభాగమందు శుభప్రదంబును అగును.

## —ఇకసినీవాల్యాది తిధిగండములు.—

శ్లో॥ కృత్వాదాద్విరదాదివిత్తమఖిలం త్యాగాతతోదోషహృత్
సచ్ఛాంతింకురుతేశుభంహ్యదిసినీ వాల్యాంశిశోర్జన్మని
నందాదాఘటికాద్వయంచ దశమీపంచమ్యమాంత్యేతథా

గండస్యాత్తిథి సంధినామక ముదంశాంతిం విక్రర్యాస్తథా॥ ౩౫॥

తా॥ సినీవాలీ అమావాస్యయనగా కృష్ణ చతుర్దశికలిసిన అమావాస్యయని యర్థము. దీనియందు శిశుజనన మయ్యేనేని ముందుగా అనగా తక్షణమే శక్త్యాను సారము గ దానములంజేసి పిమ్మట దోషనివారణ కొరకు యథావిధిగా శాంతిజేసినేని శుభమగును. అమావాస్య, శుద్ధపాడ్యమి, పంచమి, షష్ఠి, దశమి, ఏకాదశి యీతిథులు గండతిథులగుట వలన వీనిసంధులనగా అమావాస్య, పంచమి, దశమి, యీమూడుతిథులయొక్క అంతమందు రెండు ఘడియలును కృష్ణపాడ్యమి, షష్ఠి, ఏకాదశి, యీతిథులయొక్క ఆదియందు రెండుఘడియలును, తిథిసంధులు కాబట్టి యీసంధులయందు జననమయ్యెనేని గండమగును. తద్దోషపరిహారముకొరకు శాంతి చేయవలయును.

—జ్యేష్ఠానక్షత్రగండములు.—

శ్లో॥ జ్యేష్ఠర్క్షస్య దశాంశకేషు శిశుజన్మస్యాత్ప్రసోర్మాతరం
అంబాయాః పితరంచ మాతులనిజాంబేస్వాన్వయే ద్వేక్షుతే
అగ్రియంశ్వశురంచసర్వమనిశం నాశందశాంశక్రమాత్
పాదేఽంత్యఘటికాసుతస్యవసువేదాగ్ని క్రమాసూద్భవ
చ్చేద్భ్రాతృత్వాన్పితరం తథైవచ శిశోరాత్మానమేవం క్రమాత్॥

తా॥ జ్యేష్ఠానక్షత్రాద్యంతమును ౧౦ పాళ్ళుచేయగా నందు మొదటిపాలునందు జననమైతే ఆశిశువుయొక్క మాతా మహీకిన్ని, రెండవభాగమందు జననమైతే మాతామహునికిన్ని, ౩ వభాగమందు జననమయితే మేనమామకును, ౪ వ భాగమందైతే తల్లికిని, ౫ వ భాగమందైతే శిశువునకును, ౬ వ భాగమందైతే తనవంశమునకును, ౭ వ భాగమందైతే ఉభయవంశములను, ౮ వ భాగమందు భ్రాతలను, ౯ వ భాగమందైతే మామగారిని, ౧౦ వ భాగమందు సర్వంబును నశింపజేయును. ఇట్లు జ్యేష్ఠలకు మొత్తముమీద ౧౦ పాళ్ళమీద ఫలము చెప్పి తిరుగా ప్రత్యేకము అంత్యపాదమునకు మాత్రము ఫలమును జెప్పుచున్నాడు. జ్యేష్ఠాంత్య పాదప్రమాణమును ౧౫ పాళ్ళు చేయగా నందు మొదటి ౮ పాళ్ళలో జననమయ్యెనేని భ్రాతలకును, అపిమ్మట ౪ పాళ్లలో అయితే తండ్రికిని, అతర్వాత ౩ పాళ్లలో అయితే శిశువునకును గండమని తాత్పర్యము.

—మూలానక్షత్ర గండవిభాగము.—

శ్లో॥ జన్మస్యాత్తిథి భాజితాఽసురభభాగేష్వేవ చేత్తత్క్రమా

న్నాశేంద్రియాంతిపితా పితృవ్య భగినీ శ్యాతాత తాతః ప్రసూః
తన్మాతృ ప్రసృమాతులౌ జనకభ్రాతాచైవ జాయాపితా
ఘ్నంత్యంతిక పశుభృత్యకాత్మసహజ భ్రాతృశ్చమాతామహాః॥

తా॥ మూలానక్షత్రి అత్యంతఘడియలను ౧౫ పాళ్లు చేయుగా నందు మొదటి పాలునందు జననమయ్యేనేని శిశువుయొక్క తండ్రి, రెండవభాగమునందు పినతండ్రి, 3 వ భాగమునందు తోబుట్టు పెనిమిటి అనగా భావమరిది, నాలుగవ భాగమునందు పితామహుడు, ౫ వ భాగమునందు తల్లి, ఆరవ భాగమునందు పినతల్లి లేక పెత్తల్లి, ఏడవభాగమందు మేనమామ, యెనిమిదవ భాగమందు పినతండ్రి లేక పెత్తండ్రి, తొమ్మిదవభాగమందు భార్యతండ్రి ౧౦ వ భాగమందు పశువులు, ౧౧ వ భాగమందు నవుకర్లు, ౧౨ వ భాగమందు శిశువు, ౧౩ వ భాగమందు భ్రాతలు, ౧౪ వ భాగమందు ఆడతోబుట్టువులు, ౧౫ వ భాగమందు తల్లియొక్క తండ్రి అనగా మాతామహుడున్నూ క్రమముగా నాశముజెందుదురని తాత్పర్యము.

మరియు నీమూలకు ప్రకరణాంతరముచేత ద్వాదశ
గండముల పక్షములు జెప్పుచున్నాడు.

శ్లో॥ కేచిద్ద్వాదశభాజితాఽసురభభాగేషూదయశ్చేచ్ఛిశో
ర్నాశంతత్క్రమశోవదంతి పితృమాతృభ్రాతరశ్చస్వసా
పవంతచ్ఛ్వశురశ్చతాత భగినీమాతృష్వసాసంపద
శ్చాత్త్వాబాధదరిద్రతాచ కమలారాజ్యేచ వృద్ధింయయుః॥

తా॥ పూర్వోక్తరీతిగా మూలానక్షత్రి అత్యంతమును పన్నెండుపాళ్ళు జేయగా నందు మొదటిపాలునందు జననమయ్యేనేని తండ్రిన్నీ, రెండవభాగమందు తల్లిన్నీ, 3 భ్రాతలు, ౪ ఆడతోబుట్టువులు, ౫ మామగారు, ౬ తండ్రి తోబుట్టువు ౭ పినతల్లి పెత్తల్లులు, ౮ సంపత్తు ౯ శిశువున్ను నశింతురనియు, ౧౦ దరిద్రమును, ౧౧ వభాగము రాజ్యమును, ౧౨ వభాగము సంపత్తును వృద్ధిబొందుననియు జెప్పుచున్నారు.

—ఆశ్రేషా మూలా పుష్య పూర్వాషాఢ నక్షత్రి చతుర్థ గండములు—

శ్లో॥ కేచిద్వేదవిభాజితాఽసురభభాగేషూదయశ్చేచ్ఛిశో
రేకద్విత్రిషుతాత మాతృధన గండంస్యాచ్చతుర్థేఽశుభం
సర్పర్క్షస్యతథైవవేద భజతేష్వాం శేషుచేత్తత్క్రమా

త్రైమంచాదిపదిస్వ మాతృపితృగండం స్యాత్పరేషుత్రిషు
శివాంబ్వంఘ్రిషుతాతమాతృజననీభ్రాతౄన్ వాంచక్రమాత్ ॥

తా॥ మూలా ౧ పాదమందు జనమయ్యేనేని తండ్రికిని, ౨ వ పాదమందు తల్లికిని, ౩ వ పాదమందు ధనమునకును గండమనియు, ౪ వ పాదమందైతే శుభమని కొందరు చెప్పచున్నారు.

మరిన్ని ఆశ్రేషా ౧ వ పాదమందైతే శుభమనియు, ౨ వ పాదమందు ధనమునకును, ౩ వ పాదమందు తల్లికిని, ౪ వ పాదమందు తండ్రికిని గండము.

మరిన్ని పుష్యమీ, పూర్వాషాఢ యీరెండు నక్షత్రములయొక్క ౧ వ పాదమందు జన్మిస్తే పితృగండమనియు, ౨ వపాదమందు తల్లికిని, ౩ వ పాదమందు మేనమామకును ౪ వ పాదమందు శిశువునకును గండము.

—అంతరాళదోషము—

శ్లో॥ సర్పేంద్రాంత్యతదగ్రిభాంతర గతంయామప్రమాణంపరే
పంచాగ్ని క్రమమేవ కేచిదను రేంద్రక్షాంత రేవాతథా
యామార్ధంచ పరేతదర్ధఘటకాత త్రాంత రేవాజగు
శ్చాభుక్తాఖ్యమిదంచతత్రిజననం డింభస్యచేత్తత్పితా
అష్టాబ్దంచ పరేర్ధవర్షమనిశం నాలోకయేత్తం శిశుం
కేచిద్ధోమ జపాదిశాంతి విధవత్కృత్వాతుదోషాపహం॥

తా॥ ఆశ్రేషమఖలు- జ్యేష్టమూలలు- రేవత్యశ్వినులు- యీనక్షత్రములనదుమను అనగా మొదటినక్షత్రాంతమందు ౨ ఘడియలును- తర్వాతనక్షత్రాదియందు ౩ ఘడియలు ను- కలిపి ఒకయామము అభుక్తసంజ్ఞ కలదనియు కొందఱు జ్యేష్ఠామూలా నక్షత్రములయొక్క మధ్యను అనగా జ్యేష్ఠాంతమందు ౨ ఘడియలును, మూలాదియందు ౨ ఘడియలును- అభుక్తమనియును మరికొందరు జ్యేష్ఠాంతమందు పాతికగడియ- మూలాదియందు పాతికగడియ- మొత్తం అరగడియ మాత్రమే అభుక్తమనియును చెప్పిరి.

మరియు యీఅభుక్తకాలమందు జన్మించిన శిశువుయొక్క తండ్రికి యెనిమిది సంవత్సరములపరకును- దోషము గాన అంతవరకును తండ్రి శిశుముఖమును చూడకూడదనియును కొందరారుమాసముల వరకూ దోషమనియును- మరికొందరు యెన్నడును చూడకూడదనియును, కొందరు జపహోమాదిశాంతులం జేసి తేని దోషములేదనియు చెప్పిరి.

—ఇతరనక్షత్రగండములు.—

శ్లో॥ అర్యేజ్యోదకచిత్రయామ్యతపనాంత్యక్షేషుషాకద్వివ్య
ద్వ్యబ్ధ్యాశ్వ్యాంశకరార్ధపూర్వపుర వేదాభిజ్ఞ పాదేషుచ
రామాంగాజరసాంగ వేదపవనాభిజ్ఞాసు నాడీషుచే
న్నేత్రాగ్న్యష్టషడంగరత్నశశిమాసాభ్యంతరే తత్ఫలం
పుత్రస్యాజ్జననం పితుశ్చమరణం మాతుశ్చపుత్రీయది॥

తా॥ ఉత్తరాఫల్గునీ నక్షత్రప్రథమచరణమందలి ౨ ఘడియలలో జననమయ్యేనే ని రెండుమాసములకును, పుష్యమీ ౨ పాదమందలి ౪ ఘడియలలో అయితే 3 మాసములకును, పూషా 3 పాదమందలి ౯ ఘ॥ లో అయితే ౮ నెలలకును, చిత్రాభరణీ ౨ చరణమునందలి ౬ ఘడియలలో అయితే ౬ నెలలకును, హస్త 3 వపాదమందలి ౪ ఘడియలలో నైతే ౯ నెలలకును రేవతీ ౪ పాదమందలి ౫ ఘడియలలో నైతే ౧ నెలకును, పుత్రుడైతే తండ్రికిని, పుత్రిక ఐతే తల్లికిని గండమని చెప్పబడును.

—గ్రంథాంతరమునందు ఇతరనక్షత్రగండములు—

—పితాపుత్రులకు ఏకనక్షత్రజననఫలము.—

శ్లో॥ కేచిచ్ఛ్వాగ్నియమత్రిపూర్వపిత్ర్యరుద్రాగ్న్యంత్యపాదేషు త
న్నాడీష్వష్టసుడింభకస్యజననం స్యాన్మాతృగండంజగుః
జన్మర్క్షస్యాప్పిత్ర్యభే పితుశ్చమరణం స్యాన్మాతృభేచపిత్రో
రేకస్మిన్భవనేపి భిన్నచరణేచ ద్దోషశాంతింన్నృణాం
ఇత్యేవంసహజాదిభేషుచవదంత్యన్యేశిశోర్జన్మని॥

తా॥ విశా- భర- పూషా- పూషా- మ- ఆర్ద్రి- కృ- ఈనక్షత్రముల యొక్క నాలుగవ పాదముల యందలి ౮ ఘడియల యందు జననమైతే మాతృగండము- మరి న్ని, తండ్రియొక్క జన్మనక్షత్ర- జన్మలగ్నము లందు శిశువు జననమైతే పితృగండము- ఈలాగునే తల్లి- సోదరులు మొదలగు వారికి కూడ చెప్పనగును. మరిన్ని పైనచెప్పిన వారియొక్కయు- శిశువుయొక్కయు- జన్మనక్షత్రలగ్నములు ఏకమయినను పాదభే దములయిన యెడల దోషములేదని తాత్పర్యము.

—గండనక్షత్రమునకు దానములు.—

శ్లో॥ తద్దోషస్యాహరాయతత్ర తిలగోదామీకరాణిక్రమా

వ్యస్త్రింస్యాన్మహిషం సువర్ణకనకేచార్ద్యాది సప్తోడుషు
ఆశ్రేషామఘువాసవాసురహయాశం త్యక్ష్కేషచైవక్రిమా
దద్యాంకాంచనధేనవశ్చమహిషం వస్త్రింఘృతంచేచ్ఛుభం॥

తా॥ పూర్వోక్తములగు నుత్తరానక్షత్రము మొదలగు నక్షత్రములకును అనగా; ౧ ఉఫ- ౨ పుష్య- ౩ పూషా- ౪ చిత్ర- ౫ భర- ౬ హ- ౭ ఆశ్రే- ౮ మఘ- ౯ శ్వ- ౧౦ మూ- ౧౧ అశ్వ- ౧౨ రేవ- యీనక్షత్రములకు క్రమముగా ౧౨ దానములు అనగా ౧ తిలదానము ౨ గోదానము ౩ సువర్ణ దానము- ౪ వస్త్రదానము ౫ మహిష- ౬ సువర్ణ- ౭ అశ్వ- ౮ సువర్ణ- ౯ ధేను- ౧౦ మహిష- ౧౧ వస్త్ర- ౧౨ ఆజ్య దానమును జేసెనేని దోషపరిహారమగునని చెప్పబడెను.

—నక్షత్రయుత లగ్నగండములు.—

శ్లో॥ పుష్యేకర్కటకేద్విపాదజనితో గండఃపితుస్యాద్దివా
చాంభఃకశాత్రిపదేపిచేద్ధనుషి జేచిత్రార్ధపూర్వేస్త్రియి
ఆద్యంఘ్రాయతిచోత్తరేహరి గృహేమాతుశ్చ రాత్రౌతథా
జాతాచేత్తలుకన్యకాధనహరం సంధ్యాసుసత్యంవిదుః॥

తా॥ పుష్యమీ నక్షత్ర ౨ చరణమై కర్కాటలగ్నమందు శిశుజననమైనను పూర్వాషాఢా ౩ చరణ ధనుర్లగ్నమయినను- చిత్తా పూర్వార్ధమందు కన్యాలగ్నమైనను ఉత్తరా ౧ చరణ సింహాలగ్న మయినను, పగటిభాగమై పుత్రజననమయ్యేనేని తండ్రికిని- రాత్రిభాగమైపుత్రికాజననమయ్యేనేని తల్లికి గండమనియును చెప్పబడెను. ఇట్లు చెప్పుటచేత పగలు పుత్రీజననమయినను రాత్రి పుత్రజననమయినను దోషములేదని తాత్పర్యము. అనగా ; నక్షత్రము దానిరాశియు, తత్కాలలగ్నంబును ఏకమగుటవలన దోషము గలిగెనని భావము.

—విషఘడియలగండము.—

శ్లో॥ స్యాద్గండోవిషనాడికాసుపిత్రోర్మాత్రిఘాతత్మనాంచక్రమా
త్స్యాద్రుద్రాంతకవహ్నిమృత్యవఇమేధిష్ఠానదేవాఃక్రమాత్
పాలాశంఖదిరంచబిల్వసుతిలైహోమంశతోర్ధ్వాష్టకం
మంత్రైస్తాపిత్రయంబకేనవసుసాహస్రంజపంచాపరే॥

తా॥ నక్షత్రత్యాజ్యఘడియలలో జననాదులు సంభవించెనేని దానిత్యాజ్య పరిమాణమును ౪ చేత భాగింపగా పాలు ౧ కి యేర్పడును. అట్లుయేర్పడిన మొదటిపాలు

వందయితే తండ్రికిని, ౨ వ పా॥ నందు తల్లికిని, ౩ పా॥ నందు ధననాశమును, నాలు గవపాదమునందు శిశువునకును, గండమని తాత్పర్యము. మరిన్ని యీవిషకాలములకు నీ పా ళ్ళకును వరుసగా రుద్రుడు, యముడు, అగ్ని, మృత్యువు అధిదేవతలు గనుక వరుసగా మోదుగ సమిధలు, చండ్రి, మారేడుసమిధలను, తిలలును యీ నలుగురు దేవతలకును వరుసగా జెప్పబడినవి గనుక తత్తత్కాలవిహితమగు దేవతకు జెప్పబడిన ద్రవ్యముచేత ౧౦౮ మార్లు హోమము చేసినచో దోషశాంతియగును. మరిన్ని, త్ర్యంబకమంత్రము ను ౧౦౦౦౦ జపముచేసిన సకలదోషపరిహారంబగునని కొందరు చెప్పిరి. దీనియర్థమే ఉత్తరకాలామృతమందును జెప్పబడినది.

శ్లో॥ త్వాష్ట్రోత్పన్నఘటీ చతుష్టయఫలం వక్ష్యే రజో జన్మనో
స్తాతఘ్నం జననీహరం ధనహరం చాత్మక్షయం యచ్ఛతి
రుద్రం చాంతకమగ్నిహోత్రమథ తం మృత్యుం చ సంపూజయే
త్త్సార్ధ్యం దుగ్రహణోద్భవో యది పితుర్మాతుర్వినాశం క్రమాత్॥

సూర్యచంద్ర గ్రహణకాలములయందు జననమయిన శిశువునకు వరుసగా పితృ మాతృనాశనములు కలుగునని యిందు విశేషము చెప్పబడినది.

—గండపురుషస్థితియు దానిఫలమును.—

శ్లో॥ వ్యోమేతిష్ఠతి మాఘఫాల్గుననభోవైశాఖమాసేషు చే
త్పాతాలే వసతీష భాద్రపదచైత్రోర్జేషు మాసేషుచ
మర్త్యేతిష్ఠతి పౌషమార్గశుచి శుక్రాఖ్యేషుమాసేషుచే
త్పాతాళేసుఖమంబరేచవిజయం మర్త్యేమృతిస్స్యాత్ఫలం॥

తా॥ వైశాఖ, శ్రావణ, మాఘ, ఫాల్గున మాసములందు గండపురుషుడు ఆకాశమునందును, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక, చైత్రమాసములందు పాతాళమందును, మార్గశిర, పౌష, జ్యేష్ఠాషాఢ మాసములందు మనుష్యలోకమునందు నుండును గనుక యీగండపురుషుడు ఆకాశంబునగాని లేక పాతాళంబునగాని యుండెనేని శుభము. మర్త్యలోకమున నుండెనేని మరణము గలుగునని తాత్పర్యము.

— ౩౨. మృతికి తిథివారనక్షత్రములవల్ల మంచిచెడ్డలం
దెలియజేయుచున్నాడు —

శ్లో॥ రోహిణ్యాం వసుపంచకే త్రిపదభే యుగ్మాంఘ్రిభే పైతృభే

నందాశామచతుర్దశీషు భృగుజారార్కేషుభద్రాసుచ
ప్రేతశ్రాద్ధమృతీసపిండకరణత్రైపక్షికోనత్రయా
శ్చేద్వంశవియమాప్నువంతికురుతేమాసద్వివత్సద్వయే॥

తా॥ రోహి, ధని, శత, పూభా, ఉభా, రే, కృ, మృ, పున, ఉఫ, చి, విశా, ఉషా, మఘ యీనక్షత్రములందును ౧.౨.౬.౭.౧౧.౧౨.౧౩.౧౪ యీతిథులయందును; శుక్ర, కుజ, భానువారములయందును; ప్రేతకర్మ, మరణము, సపిండీకరణము, త్రైపక్షికము, ఊనమాసికము, జరిగినయెడల ౧-౨ నెలలకు వంశము నశించునని తాత్పర్యము.

—ఇక ద్విపాది త్రిపాది నక్షత్రములయందైన మృతికి మాసనిర్ణయము.—

శ్లో॥ ద్విపాదేతుత్రిమాసంస్యాత్రిపాదేతు చతుష్టయం
తద్గృహంవర్జయేద్ధీమాన్ షణ్మాసంవసు పంచకే॥

తా॥ ద్విపాదినక్షత్రములందు మరణము జరిగినేని ౩ నెలల వరకును, త్రిపాదులయందైతే నాలుగు నెలలవరకును, ధనిష్ఠాపంచకమందైతే ౬ నెలలవరకును ఆమృతిగృహమును తప్పక విడువవలయును.

ద్విపాదులు=మృ- చి॥ త్రిపాదులు=కృ- పున- ఉఫ- విశా- ఉషా॥ ధనిష్ఠాపంచకము=ధ- శ- పూభా- ఉభా- రే॥

—గ్రంథాంతరే మృతివిషయే.—

శ్లో॥ నందాభద్రాశామభూతాస్వర్కశుక్రారవాసరే
దహనంమరణంచైవ తత్ఫలం త్రిగుణంభవేత్॥

తా॥ ౧-౨-౬- ౭- ౧౧- ౧౨- ౧౩- ౧౪- ఈతిథులందును- రవి శుక్ర కుజవారములందును దహనమరణములు జరిగినేని మరణము జరిగినస్థలమందు మరణమున్ను దహనము జరిగిన స్థలమందు దహనమున్ను, మూడుపర్యాయములు జరుగునని తాత్పర్యము. మరియును,

శ్లో॥ తిథియుగ్మయోగేగ్రామే వారయుగ్మయోగే వాటికాయాం
తిథివారయుగ్మ యోగేగేహేమరణం పునర్భవేత్॥

తా॥ పైన వ్రాసిన దోషతిథులు, నక్షత్రములు గూడగా మరణము పొందెనేని

గృహ[ ]గామమునందు తిరుగ మరణముజరుగుననియు, నక్షత్రవారములుగూడ నేనియా వాటి యందు తిరుగ దహనంబు జరగుననియు తిథివారనక్షత్రములు ౩ న్ను గూడనేని మరణము జరిగిన యాగృహమునందె మరల మరణము జరుగుననియు నభిప్రాయము.

ఈప్రకారము తిథివార నక్షత్రములయందు పరాయగృ మొదలగు కార్యములున్ను చేయకూడదని పెద్దలు చెప్పుచున్నారు.

—మృతివిషయేపునః గ్రంథాంతరే.—

శ్లో॥ భరణ్యామేకమాసంతుద్విత్రిపాదే త్రిమాసకం
వసుపంచకషణ్మాసం మృతిగేహం పరిత్యజేత్
ద్విపాదేచత్రయంమాసంషణ్మాసంచత్రిపాదకే॥ జ్యోతిర్నిబంధే॥

—ధనిష్ఠాపంచక మృతావపి కాలభేదమాహ.—

శ్లో॥ ధనిష్ఠాయాంతుషణ్మాసం వారుణేతుత్రిమాసకం
పూర్వాభాద్రేతదర్ధంచ అహిర్బుధ్నేతుమాసకం
రేవతీపక్షమిత్యాహుర్మృతిగేహవిసర్జనే॥ ఫలగ్రంథే॥

ఇదివరలో ధనిష్ఠాపంచకం ౫ నక్షత్రములకును గూడా సాధారణముగా ౬ నెలలు విడువవలసినదని చెప్పి యిప్పుడు దానిలో భేదముం జెప్పుచున్నాడు యెట్లంటే;

ధనిష్ఠకు= ౬ నెలలు శతభిషము= ౩ నెలలు పూ॥ భాద్ర=౧౹౦ నెల అనగా ౪౫ రోజులు ఉ॥ భాద్ర= ౧ నెల రేవతి= ౦౹౦ నెల అనగా ౧౫ రోజులు ఈలాగు మృతిగృహంబును విడువవలయునని చెప్పబడినది.

ఇక దుష్టనక్షత్రములందు మృతి జరిగినయెడల దానింబట్టి చక్రము వేయగా ఆ యింటికి గాక తత్పరిసరదగ్గర గృహంబునకు గూడ మంచిచెడ్డలు చూచుటకు మృతిచక్రముం జెప్పుచున్నాడు.

శ్లో॥ చతురశ్రీత్రియేచక్రే పాగ్రాదిరవి భాదికే
ఆరోహమవరోహేణ వామమార్గేణలేఖయేత్॥
మృతకాలేందునక్షత్రంయత్రతిష్ఠతి తత్క్రమాత్
అంతరంగేత్రిపక్షంస్యాన్మధ్యకక్ష్యాంద్విపక్షకం
అంతేచపక్షమేకంస్యాద్బాహ్యరేఖానదోషభాక్॥ ఫలగ్రంథే॥

అని చెప్పియున్నది. ఇది ఆయింటి వారివిషయము॥ ఇక అన్యులకు చక్రదోషము యేదిక్కుకు వచ్చునో ఆదిక్కువారు అంతకాలము విడువవలయును.

—కల్పితచక్రోద్ధారమునకు ఉదాహరణము.—

ఒకడు విశాఖానక్షత్రమునందు మృతిబొందెను. అప్పుడు సూర్యుడు అశ్వినియం దుండెను. సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని యిడమప్రక్కగా చక్రము వేయవలెను.

—మృతచక్రము.—




కొందరు రవినక్షత్రాదిగా ఈశాన్యము మొదలుగా చక్రము వేయవలసినదని చెప్పుచున్నారు. మేమును సాంప్రదాయము ననుసరించి ప్రాగాదిగా ఉదాహరణ కనుపరచబడియున్నది.

ఇక్కడ చక్రమందు మృతకాల నక్షత్రమగు విశాఖ త్రిపాదియై పశ్చిమదిక్కులో అంత్యకక్ష్యలో పడినది. యింటివారికి దోషముస్వల్పమును అదిక్కువారికి దోషాధిక్యమును పైగ్రంథమువలన సూచింపబడి యున్నది గనుక విస్తరించలేదు.

—నక్షత్రవారత్యాజ్యములు—

నక్షత్రవిషధ్రువములు—అశ్వి-౫౦-భర-౨౪-కృ-౩౦-రో-౪౦-మృ-౧౪-ఆ-౨౧-పున-౩౦-పుష్య-౨౦-ఆ-౩౨-మ-౩౦-పుబ్బ-౨౦-ఉ-౧౮-హ-౨౧-చి-౨౦-స్వా-౧౪-వి-౧౪-అనూ-౧౦-జ్యే-౧౪-మూలకు-౨౦-మీదను-౫౬-మీదను రెండు పర్యాయములు విష్యము-పూషా ౨౪-ఉషా ౨౦ ధ ౧౦-శత-౧౮-పూభా ౧౬-ఉభా ౨౪-రే ౩౦-ఈనక్షత్రములకు నక్షత్రప్రవేశము మొదలు ఇన్నిఘడియలకు పైగా ప్రవేశించి

ఘుయాసు నాల్గు ఘడియల పర్యంతముండును. ఈవిషములో గూడిన లగ్నములు గూడ విడువవలయును.

వారదుర్ముహూర్తములు—ఆది ౧౪- సో ౯; ౧౨- జయ ౪; ౨౨ బు ౧౭- గు ౬;౧౨-శు ౪; ౯- స్థి ౧; ౨౮- ముహూర్తములును దుర్ముహూర్తములు- రెండుగడియలకాలము ముహూర్తమనబడును- ఘడియ ౧ కి ౨౪ నిమేషములు గ్రహింపవలెను. దుర్ముహూర్తముతో గూడిన లగ్నమును విడువనక్కరలేదు. నక్షత్రవిషము తగిలిన లగ్నముగాని లగ్నములు గాని తప్పక విడువవలయును. అని పెద్దలు చెప్పెదరు.

శ్లో॥ భానాం విషంతు సర్వాఖ్యం వారాణాం వృశ్చికాహ్వయం । అని అభియుక్తోక్తి.



శ్రీరస్తు

# దైవజ్ఞకర్ణామృతే

పూర్వభాగే-

కౌతుకపరిచ్ఛేదః

పాతపంచాంగతిథివారనక్షత్రాదులనుజూచిముందుసంవత్సరతిథి వారనక్షత్రాదుల సాధించుటకు సులభోపాయము యీక్రింద వ్రాయబడుచున్నది.

శ్లో॥ తిథౌ వేదధృతిర్నాడ్యబ్ధిష్వక్షేత్రిణేత్రయోదశ
యోగేయుగ్మం మనుస్త్వ్యబ్ధ్యవారే త్వేకంచయోజయేత్ ॥

అని చాటుధార.

టీ॥ తిథౌ=అడిగిన తిథిసంఖ్యయందు, వే=౪ న్ను, నాడ్య=అగడియలలో ధృతి= ౧౮ న్ను చేర్చవలయును. బా కే= నాటి నక్షత్రసంఖ్యయందు, త్రిణే= ౩ న్ను ; త్ర

యోషక=నక్షత్రగడియలలో ౧౩ చేర్చవలయును. యోగే=నాటి యోగసంఖ్యలో, యుగ్మం= ౨ కూర్చి, మనుః=యోగగడియలలో ౧౪ను, త్యాజ్యాః=తీసివేయవలెను. వారేతు=వారమునందు, ఏకంచ= ౧ ని, యోజయేత్=కూడవలెను. పూర్వులు రచియించిన శ్లోకము గావున నిందలి యన్వయాది దోషములను పాటింపలేదు.

తా॥ గడచిన సంవత్సరపు పంచాంగములో నేమాసపు తిథిని జూచుచున్నారో ఆతిథి సంఖ్యలో ౪ న్ను, ఆతిథిసంబంధమైన గడియలలో ౧౮ న్ని కూడగా నెంత యగునో ముందుసంవత్సరం తాలూకు ఆమాసములోని అంతిసంఖ్యగల తిథయొక్క గడియలగును. గతసంవత్సర తిథినాటివారమేదో దానిలో ౧ కూడగా అయినవారము నాడు అన్నిగడియలు ఆతిథియుండునని యభిప్రాయము. ఒకవేళ పూర్వపుగడియల లో ౧౮ కూడగా ౬౦ టికంటె నధికమయ్యేనేని ౬౦ టిని తీసివేసి యాశేషఘడియలను వెనుకవచ్చినవారముకంటె పరవారమునాడు వ్రాసేది. ఈలాగుననే నక్షత్రాదిసంఖ్యలును, వాని ఘడియలనున్ను వ్రాయవలయును. ఒకవేళ గతసంవత్సరములో నధికమాసము వచ్చెనేని భవిష్యద్వత్సరంబు నాయధికమాసపునెల యతిక్రమించువరకును గతపంచాంగమునందు దాను జెప్పెడు నెలతాలూకు తిథ్యాదులన్నియును భవిష్యద్వత్సరములో దానిక్రిందినెల తాలూకని చెప్పుచుండవలయును. అలాగు అధికమాసపునెల దాటిన పిమ్మట యథాపూర్వముగా జెప్పుచుండవలయును.

అనగా ; గతసంవత్సరములో తన యిష్టతిథినాటి వారములో ౧ న్ని ఆతిథిసంఖ్యలో ౪ న్ను దాని ఘడియలలో ౧౮ న్ని, కూడి నక్షత్రసంఖ్యలో ౩ న్ను దాని ఘ॥ లో ౧౩ న్ను నాటియోగ సంఖ్యలో ౨ న్ను కూడి సదరు యోగ ఘ॥ లో ౧౪ ని తీసివేయగా నెంతయగునో పయిసంవత్సరము ఆనెలలో ఆయాతిథ్యాదులను ఘడియలును అగును.

ఉ॥ శక ౧౮౧౪ నందననామసంవత్సర ఆశ్వయుజ శు ౧౫ గురువారము ౧౬-౧౪ రేవతి ౫౫-౦ అని వ్రాసియున్నారు, గనుక యీసంవత్సరయీతిథిని బట్టి ముందురాగలసంవత్సరము అనగా శక ౧౮౧౫ విజయనామసంవత్సరతిథిని చెప్పనగును- అయితే ఈ యాశ్వయుజ మాసతిథులంబట్టి ముందు ఆశ్వయుజమాసతిథులే రాదగియున్నవి. అయినను ముందురాగల ఆశ్వయుజమునకు లోపల ఆషాఢ మధికము రానైయుండుటం జేసి యొకనెల తక్కువగల మాసము అనగా భాద్రపదమాసతిథులకు సరిపడుచుండును. గనుక ఈనందన సం॥ ఆశ్వయుజమాసపుతిథులన్నియును రాగల భాద్రపదమాసతిథులగును.

కాబట్టి వర్తమానోదాహృతఆశ్వయుజ శు ౧౫ కు ౧౬-౧౪ దా పూర్ణిమ సంఖ్య ౧౫ లో ౪ ను చేర్చగా ౧౯ అగును. ౧౯ తిథిభవిష్యద్భాద్రపదములో బహుళ ౪ ర్థి యనబడును, నేటిగురువారసంఖ్య ౫ టి లో ౧ కూడగా ౬ వది శుక్రవారమగును. నేటి తిథిఘడియలు ౧౬-౧౪ లో ౧౮ కూడగా ౩౪-౧౪ ఇవి ఆతిథిఘడియలగును- అనగా విజయసం॥ భాద్రపద బ ౪ శుక్రవారము ౩౪-౧౪ అయి-యుండవలయును- ఇక నేటియుదాహరణతిథినాటినక్షత్రము రేవతి ౫౫-౦ గనుక రేవతి సంఖ్య ౨౭ లో ౩ కూడగా ౩౦ దీనిలో భగణం ౨౭ తీసివేయగా శేషము ౩ మూడవది కృత్తికగదా- ఈనక్షత్ర ఘ ౫౫-౦ లో ౧౩ కూడగా ౬౮-౦ ఇందులో ఆశుక్రవారము యొక్క అహోరాత్రము ౬౦-౦ పోగా శేషము ౮-౦ అనగా శనివారమునాడు కృత్తికానక్షత్రము ౮-౦ వుండవలెను. స్వల్పమైనవిఘడియలు తేడాయున్నను అతి సౌలభ్యమును బట్టి గ్రాహ్యము. ఇట్లే యోగాదులుం గ్రహించునది.

ఈపరిచ్ఛేదమువలన యింగ్లీషుతారీఖు చెప్పిన నాటివారము తెలియుట, ఇంగ్లీషుతారీఖునకు సరియగు తెలుఁగు తిథియు తెలుగు తిథివారములు చెప్పిన నాటి యింగ్లీషు తేదీని చెప్పుట, ఈసంగతులను క్రమశేక బహుసులభముగా తెలియవచ్చును. ఈప్రకరణమును 2, 3 సార్లు చూచిన నతిసుగమముగా చెప్పదగియుండును. దీనికి ముందుగా తెలుసుకోదగిన ముఖ్యసాధనము లేమనగా ;-

నెంబర్లు.

1. తెలుగుసంవత్సరమువల్ల యింగ్లీషుసంవత్సరము తెలియుట.
2. హూణసంవత్సరధ్రువమును సాధించుట.
3. లీపుసంవత్సరజ్ఞానము.
4. హూణమాసధ్రువములు.
5 షష్టిధ్రువలక్షణము.
6. గతపదనిర్ణయము.
7. భాగ్నితష్టశేషము.
8. హూణమాసపదకములు.

సదరు 8 సంగతులను ముందుగా తెలిసికొనియుండవలెను.

వెనుకటి 8 నెంబర్లను తెలియు సాధనం బెట్లనగా ;—

—నెం 1 రు క్రీస్తుశకసాధనము అనగా యింగ్లీషుశకము.—

శ్లో॥ చాంద్రవత్సరతశ్శాకశ్శాలివాహనసంజ్ఞకః
గజాశ్వ ౭౮ యుక్తోహూణాఖ్యశ్చాంద్రవర్ష ప్రవేశతః
జనేవరాఖ్యమాసస్య ప్రవేశాదేకసంయుతః ॥

తా॥ వెనుక జెప్పినరీతిగా తెలుగుసంవత్సరమునకు శాలివాహనశకముం దెచ్చి యందు ౭౮ ని కూడగా ఇంగ్లీషుశకమగును. ఇదియే ఆసంవత్సరం డిశంబరు నెలాఖరు వరకును క్రీస్తుశకము. పిమ్మట అనగా ది 1 జనవరి లగాయతు దానిలో 1 కూడితే అంతటినుండి యది క్రీస్తుశకమగును, అనగా యింగ్లీషుశకమగను.

—నెం ౨ రు హూణవర్షధ్రువసాధనము.—

శ్లో॥ ఖఖాంకేందు ౧౯౦౦ విహీనోయం హూణాశాకస్వపాదయుక్
పునర్నేత్ర ౨ యుతం సప్త ౭ హృచ్ఛేషోబ్దధ్రువస్మృతః
అగ్రేశతాధికేద్వ్యూనం తద్వదేవపునఃపునః
యద్వాశతేయాతకాలేద్వ్యధికంచముహూర్మహుః॥
హూణవర్షధ్రువస్సస్యాద్యదిలీప్వాఖ్యవత్సరే
ఫిబ్రవర్యాఖ్యమాసాంతపర్యంతం త్వేకహీనకః ॥

తా॥ హూణసంవత్సరధ్రువమును సాధించుచున్నాడు. హూణశకములో ౧౯౦౦ తీసివేయగా వున్న శేషమును రెండుచోట్ల వుంచి యందొకదానిని ౪ చే భాగింపగా వచ్చులబ్ధమును మాత్రమే రెండవప్రతిలో గూడి యందులోని వారల రెండు గతి ని ౭ చే భాగింపగా శేషము వత్సరధ్రువమగును.

హూణశకము ౧౯౦౦ పైబడినగా మున్నంతవరకు నీప్రకారమే వర్షధ్రువము గును. ముందు ౨౦౦౦ పైనున్నప్పుడు ఏమియును కలుపనక్కరలేదు. అనగా రెండు కూడనక్కరలేదు. ఒకవేళగతకాలములో ౧౭౦౦ పైబడినగా నున్నప్పుడు ౪ ను కలుపవలెను.= అనగా ముందుకైతే శతము ౧ కి రెండు చొ॥ తరిగిపోవును. గతములో నైతే శతము ౧ కి రెండు చొ॥ వృద్ధియగును. ఇట్లుచేయగావత్సరధ్రువమగును గాని యొక విశేషము కలదు. ఏమనగా లీపుసంవత్సరమైనయెడల ఆఫిబ్రవరి నెలాఖరువరకు మాత్రము అవచ్చిన వత్సరధ్రువములో ౧ తీసివేయగా ధ్రువమగును. మార్చిలగాయతు ౧ తీసివేయ నక్కరలేదు. అనుబవచ్చిన ధ్రువమే యుంచవలెనది ఇట్లుచేయగా హూణవత్సరధ్రువమగును.

—నెం 3 రు లీపుసంవత్సరలక్షణము —

శ్లో॥ కృత్వాష్టైకశతకోనాబ్దే శేషేశూన్యం యదాభవేత్
లీపుసంజ్ఞకవర్షంతదిత్యుక్తం హూణపండితైః
అత్యష్టి ౧౭ ధృత్య ౧౮ తిధృతి ౧౯ శతకేషునలీపుతా
షోడశేవింశతౌచైవశతకేలీపుసంజ్ఞకః॥

తా॥ ఇంగ్లీషుశకములో శతములు తీసివేసి తుదనుండు దశస్థానఏకస్థానాంకము లను ఉంచుకొని ౪ చే భాగింపగా శేషము యెప్పుడు శూన్యముగునో ఆసంవత్సరము లీపు సంవత్సరమనబడును. వాటియొక విశేషము గలదు. ఏమనగా; ౧౭౦౦, ౧౮౦౦, ౧౯౦౦ ఖరాగా యింగ్లీషుశకమయిన సంవత్సరములు లీపుసంవత్సరములు గావు. ౧౬౦౦, ౨౦౦౦ అయినపుడు లీపుసంవత్సరములగును. అనగా శతములు ౪ చే నిశ్శేషముగ భాగింపబడునపుడు లీపుసంవత్సరమగును.

—నెం 4 రు హూణమాసధ్రువములు.—

శ్లో॥ హూణమాసధ్రువాఃప్రోక్తాఃరస ౬ నేత్ర ౨ కరే ౨ షవః ౫
శూన్యా ౦ గ్ని ౩ శర ౫ చంద్రా ౧ బ్ధి ౪ ష ౬ ట్కరాం ౨
బుధయః ౪ క్రమాత్ ॥

—మాసధ్రువాంకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనవరికి | ౬ | మేయికి | ౦ | సెప్టెంబరుకు | ౪ |
| ఫిబ్రవరికి | ౨ | జూన్‌కు | ౩ | అక్టోబరు | ౬ |
| మార్చికి | ౨ | జూలైకి | ౫ | నవంబరుకు | ౨ |
| ఏప్రిల్‌కు | ౫ | ఆగస్టుకు | ౧ | డిశంబరుకు | ౪ |

—నెం 5 రు షష్టిధ్రువసాధనము.—

శ్లో॥ శాలివాహనజేశాకే గోవస్వద్రికు ౧౭౮౯ సమ్మితే
గతేతత్ప్రభవాబ్దాదిహ్యేవషష్ట్యబ్దంధ్రువోగజాః ౮
తదూర్ధ్వం ప్రతిషష్ట్యాంతుపంచపంచయుతోధ్రువః
గతాయాం ప్రతిషష్ట్యాంచ పంచపంచవిహీనతః
షష్టిధ్రువోభవత్యేవం త్రింశత్తచ్చక్రమీరితం ॥

తా॥ శాలివాహన శకము ౧౭౮౯ గతముగా గావచ్చిన ప్రభవసంవత్సరం ఆ గాయితే అక్షయ ఆఖరు వరకు అయిన యీషష్టి ౬౦ సంవత్సరములకు షష్టి ధ్రువము

౮ అని చెప్పబడును అటుపై షష్టికి ౮+౫=౧౩ ధ్రువమగును, యీలాగు ఏష్య ష ష్టులకు షష్టి ౧ కి ౫ చేసిచొ॥ వృద్ధియగును. వెనుకటిగతషష్టులకు షష్టి ౧ కి ౫ చేసి చొ॥ తగ్గిపోవును. అనగా గతషష్టికి ధ్రువము ౩ అని తెలియవలెను యీధ్రువము ముందు ౩౦ కంటె అధికమైతె ౩౦ తీసివేయవలెను. గతంలో ౫ పోవుంటె ౩౦ కూడి మరి ౫ ను తీసివేయవలెను. అనగా యిది శుద్ధిచక్రము ౩౦ అని యెరుగవలెను. ఇది తిథ్యాత్మకము.

—నెం 6 రు గతపదసాధనము —

ధృతి ౧౮ శ ౧౧ ది ౧౦ ఙ్నంద ౯ శైల ౭ శరే ౫ ష్వబ్దేషు తిర్త్ర్యవాత్ । శూన్యైక ౦ కా ౧ శ్వి ౨ గుణా ౩ బ్ధి ౪ షు ౫ మితంతత్పదకంగతం । ప్రతిషష్ట్యాంప్రైవ మేవప్రభవాద్యబ్దయోంతకం ॥

తా॥ ప్రతిషష్టియందును ౬ ఖండములు, ఆయాఖండములకును ౬ సంఖ్యలుగ లవు. ఆసంఖ్యలే గతిపదములగును. ఎట్లనగా ;—

ప్రభవలగాయితు సారణ అఖరుకు సంవత్సరములు ౧౮ కి గతపదము= (౦)
పార్థివలగాయితు మన్మథఅఖరుకు సంవత్సరములు ౧౧ కి గతిపదము =(౧)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దుర్ముఖి | ... | విశ్వావసు | ... | ... | ౧౦ | ...... | =(౨) |
| పరాభవ | ... | ఆనంద | ... | ... | ౯ | ...... | =(౩) |
| రాక్షస | ... | దుర్మతి | ... | ... | ౭ | ...... | =(౪) |
| దుందుభి | ... | అక్షయ | ... | ... | ౫ | ...... | =(౫) |

— నెం 7 రు ఖాగ్నితప్తశేషమును సాధించుట.—

శ్లో॥ గతాబ్దేషుత్రిభాజ్యంచ శివసంగుణశేషకం
షష్టిధ్రువంగతపదం మిళిత్వాఖాగ్నితప్తకం
తచ్ఛేషమంకం గృహ్ణీయాత్ఖాగ్నితప్తముదాహృతం ॥

తా॥ ఇష్టసంవత్సరమునకు పిరిభవాదిగతించిన సంవత్సరములెన్నో అంతసంఖ్య ను వుంచి యందులో ౩ చేత నిశ్శేషముగా భాగింపదగినంత సంఖ్యను ఒకచోటవుంచి ఆశేషమును ౧౧ చే గుణించి దానిని పైనవుంచిన త్రిభాజ్య సంఖ్యలోగూడి దానిలో నే షష్టిధ్రువమునున్ను, గతపదమునున్ను కూడి యీమొత్తమును ౩౦ చే భాగింపగా మిగిలిన శేషమును ఖాగ్ని తప్తశేషమని వ్రాసుకొనేది.

—నెం ౮ రు హ్రాణమాసదినపదకములు.—

శ్లో॥ జనేవరం కోత్కృతయః ౨౭ ఫిబ్రవర్యభగాగ్నయః ౩౦౦
మార్చిరంధ్రాక్షిరామాశ్చ ౩౨౯ ఏప్రిలబ్ధిర్వహ్నయః ౩౫౪
మేయీచవ్యోమనేత్రాణి ౨౦ జూన్ తత్శ్చంద్రబాణఖం౦౫౧
జూలైనేత్రగజాః ౮౨ ప్రోక్తా అగస్త్యగ్నికుచంద్రకం ౧౧౩
శెప్టెంబరర్ధదేవేంద్రా ౧౮౫ అక్టోబర్బాణసప్తభూః ౧౭౫
నవంబరశ్వఖాక్షిణి ౨౧౭ డిశంబ్రస్త్రినేత్రకం ౨౩౭
ఏవంమాసపదాన్యత్రసావనానిదినానిహి ॥
గదితానీహతత్కార్యం లౌకికం వచ్మిలాఘవం
ప్రోక్తపకరణాన్యష్టౌజ్ఞాత్వాపశ్చాత్ప్రసాధయేత్ ॥

—నెం ౮ రు పూర్వోక్తహ్రాణమాసపదకములు. సావనదినములు—

జనవరి నెలకు= ౨౭ సావనదినములు.

| | | | |
|---|---|---|---|
| ఫిబ్రవరి నెలకు= | ౩౦౦ | మార్చి నెలకు= | ౩౨౯ |
| ఏప్రిల్ నెలకు= | ౩౫౪ | మేయి నెలకు= | ౨౦ |
| జూన్ నెలకు= | ౫౧ | జూలై నెలకు= | ౮౨ |
| ఆగష్టు నెలకు= | ౧౧౩ | శెప్టెంబరుకు = | ౧౮౫ |
| అక్టోబరుకు = | ౧౭౫ | నవంబరుకు= | ౨౦౭ |
| డిశంబరుకు = | ౨౩౭ | | |

—ఇక యింగ్లీషుతారీఖు చెప్పి నాటివారముం జెప్పవలసినదంటె చెప్పేసాధనము వ్రాయబడుచున్నది.—

శ్లో॥ వర్షమాసధ్రువైక్యంతు తన్మాసీయదినాన్వితం
సప్తభక్తావశేషంతువాసరోర్కాదితస్మృతః

తా॥ వెనుక నెం ౨ రు పద్ధతి ప్రకారంవచ్చిన వత్సరధ్రువమున్ను, నెం ౪ రు పద్ధతి ప్రకారం మాస ధ్రువమున్ను, ఆనెలలో యేయింగ్లీషు తేదీకి వారము తేవలయునో ఆతేదీ సంఖ్యయును యీమూడుసంఖ్యలున్ను కూడి యామొత్తమును ౭ చేత భాగింపగా యెంతశేషముండునో ఆదివారాదిగా అన్నవవారమగును. నిశ్చయము. ఇంగ్లీషు తారీఖునుబట్టి వారముం దెలుసుకొనుటకు నిదియేపద్ధతి.

—ఇక తెలుగుతిథి, వారమున్ను చెప్పి, నాటి యింగ్లీషు తేదీని అ
డిగినయెడల చెప్పుసాధనము.—

శ్లో॥ చైత్రాదిచాంద్రతిథయస్త్వధిమాసాదినాన్వితాః
ఖాగ్నితష్టావశేషోనాయున్మాసీయపదానితాః
తచ్ఛేషోహూణదివసోమథ్యోవారాత్స్ఫుటోథ వేత్ ॥

తా॥ చైత్ర శు ౧ లగాయతు ఇష్టతిథినాటికి యెన్ని తిథులగునో వ్రాసుకో
ని, మరియును చైత్రములగాయతు యిష్టమాసముకు లోపల అధికమాస ముండెనేని వె
నుకటి తిథులలో మరి ౩౦ కూడగా దినములగును. ఆదినములలో వెనుకటి నెం ౭ రు
ప్రకారంవచ్చినఖాగ్ని తష్టశేషమును తీసివేసి యాశేషములో వెనుకటి నెం ౯ రు మా
సపదక పట్టీలో మిక్కిలీ దగ్గరగా పోదగినపదకమును తీసివేయగా శేషమెంతయగునో
అన్నవతేదీయగును. యేనెలతాలూకు మాసపదకము తీసివేయబడెనో ఆనెలయేయని
యెరుగవలెను. ఇంగ్లీషుసంవత్సరము తెలియుసాధనము వెనుకనే చెప్పబడినది. వార
మును సరిచూచి స్ఫుటముచేయవలెను.

—ఇక యింగ్లీషు తేదీని చెప్పి నాటి తెలుగుతిథివారములఁజెప్పు
సాధనము—

శ్లో॥ ఖాగ్నితష్టావశేషంచ తన్మాసపదకాన్వితం
ఉద్దిష్టదినసంయుక్తం ఖత్రి ౩౦ హృల్లబ్ధశేషకౌ
తల్లబ్ధసమ్మితామాసామధ్యోర్వ్యాతామలాన్వితాః
శేషతుల్యాతిథిర్మధ్యా తద్వారోక్తాస్ఫుటాథ వేత్ ॥

తా॥ నెం ౭ రు ఖాగ్నితష్టశేషమున్ను, నెం ౮ రు ప్రకారం ఆయానెలకు జెప్ప
బడినమాసపదకమున్ను, ఆనెలలోని యిష్టతారీఖున్ను యీ ౩ న్ను కూడి యామొత్త
మును ౩౦ చేభాగింపగా వచ్చులబ్ధమున్ను, ఆశేషమున్ను వ్రాసుకుని, లబ్ధమెంతయ
గునో చైత్రము మొదలుగా అన్ని తెలుగుమాసములు వెళ్ళినవనియు, ఆశేష మెంతయుం
డునో అవర్తమానమాసములో అన్నవ తెలుగుతిథియనియు తెలియవలెను అనగా చె
ప్పినవారము నాటి తిథియని సవరించుకోవలెను. లబ్ధమును బట్టిమాసములు గణించునపుడు
అలోగడ అధికమాసముఁడెని అధిమాసరహితంగా లెక్కించవలెను. ఇదివక్ష్యమాణ
సంక్రాంతి తంత్రమువల్ల మిక్కిలిస్ఫుటమగును.

. టీపు॥ ఈయాప్రకారము యింగ్లీషు తారీఖు చెప్పగానే నాటివారంబును, నాటి తెలుగు తిథ్యాదికంబును, తెలుగు తిథివారంబును జెప్పిన యెడల నాటి యింగ్లీషు తేదీ యున్ను అనాయాసముగ గణితమక్కరలేకయే చెప్పుటకు యెనిమిది నెంబర్లుగల యుపకరణములు చెప్పఁబడినవి. గనుక యిష్టకాలమునకు ఆ ఉపకరణములను దెలిసినపిమ్మట పైనజెప్పినయున్ని సంగతులను అతిసులభముగ జెప్పవచ్చును. ఉదాహరణము—

వెనుక జెప్పబడిన శాలివాహనశకము 1814 గతముకాగా వర్తమాననందననామ సంవత్సరఆశ్వయుజ శు ౧౬ గురువారమునకు సరియగు అన 1892 సం॥ అక్టోబరు 6 వ తేదీకి వెనుక జెప్పబడిన 8 నెంబర్లుగల సాధనము లన్నిటికి ఉపయోగమును జూపించు చున్నాడు. ముందుగా ఉపకరణములు 8 న్ని చూపబడుచున్నవి.

నెం 1 రు క్రీస్తుశక సాధనోదాహరణము :—నందనసంవత్సరమునకు వెనుకఁజె ప్పిన శాలివాహన శకము 1814+78= 1892 క్రీస్తుశకము అనగా ఇంగ్లీషుశకము.

నెం 2 రు. ఇక హూణవత్సరధ్రువోదాహరణము:— ఇంగ్లీషు శకము1892–1800=92 శేషము. దీనియొక్క ర వభాగము, 92÷4=23 దీనినాశేషములో గూడవ తెనుగనుక శేషము 92+23=115+4=119÷7=0 శేషము. ఇదియేవత్సరధ్రువము. అ యితే; వెనుకయింగ్లీషుశకము 1900 పైనఅయితే 2 కలపవలెనని చెప్పినాడు. దాని క్రింది శతము 1800 పైనున్నది గనుక గతశతము 1 కి 2 చొ॥ వృద్ధియగును. గనుక పై న 1892 కి 4 చేర్పడమయినది. గనక యీసంవత్సరమునకు వత్సరధ్రువము( 0 ) అని యెరుగవలెను.

నెం 3 రు లీపుసంవత్సరోదాహరణము:—మరియును ; యీనాటి యింగ్లీషుశక ము 1892 లో 1800 తీసివేయగా మిగిలిన 92 ను 4 చే భాగింపగా శేషము (0) అగుట చేత యీ1892 వ సంవత్సరము లీపుసంవత్సర మనబడినది. గనుక పైవచ్చినవత్సరధ్రువ ము (0) గదా. యీసంవత్సరంజనవరిలగాయితు యీఫిబ్రవరి ఆఖరువరకును ఆవత్సరధ్రు వములో 1 తీసివేయవలెను. ఇక్కడ సున్న అనగా 7 అంకె అని యర్థము గనుక 7–1=6 యీసంఖ్యను యీజనవరి ఫిబ్రవరి 2 నెలలకును వత్సరధ్రువముగా జేసికొని పిమ్మ ట మార్చి ది 1 తేదీ లగాయితు వత్సరధ్రువమును ముందువచ్చిన (0) యేవత్సరధ్రువముని వ్రాసికొనవలెను. ఇదియే లీపుసంవత్సరలక్షణము.

నెం 4 రు హూణమాసధ్రువోదాహరణము :—వెనుకటి యుదాహరణములో అక్టోబరు 6 వ తేదీయని వ్రాయబడెనుగనుక అక్టోబరునెలకు లోగడ నెం 4 రు మాస

ధ్రువపట్టీలో 6 అని యుండెనుగనుక అక్టోబరు నెలకు పూర్ణమాసధ్రువము 6 అని తెలియబడినది.

నెం 5 రు షష్టిధ్రువోదాహరణము :—వర్తమాన నందనసంవత్సరమునకు శాలివాహనశకము ౧౮౧౪ అని వ్రాయబడెను. ఇది శాలివాహనశకము ౧౭౮౯ కి పైనుండు షష్టిలోనిదిగనుక యీషష్టికి ధ్రువము 8 అని చెప్పబడియున్నది గనుక షష్టిధ్రువము 8 అని తెలియవలెను.

నెం 6 రు గతపదకోదాహరణము :—ఈనందనసంవత్సరము ; పార్థివను, మన్మథకును నడుమనుండు 11 సంవత్సరములలోనిది గనుక యీ 11 సం॥ ల ఖండమునకు గతపదకము 1 అని వ్రాయబడియుండెను గనుక యిచ్చట గతపదము 1 అని తెలియవలెను.

నెం 7 రు భాగ్నిశిష్టశేషోదాహరణము :—ఈనందన సం॥ నకు వర్తమానషష్టిలో ప్రభవాదిగా గతించిన సంవత్సరములసంఖ్య 25 ఇందులో 3 చేత నిశ్శేషముగా భాగింపదగిన సంఖ్య 24 ఇది త్రిభాజ్యము 25 లో 24 పోగా శేషము 1×11=11 ఇది శివగుణశేషము. కనుక పైన వ్రాసినటువంటి

| | | |
|---|---|---|
| త్రిభాజ్యము | 24 | ఈ 4 సంఖ్యలుగూడగా అయిన 44 ను 30 చే భాగింపవలెనుగనుక 44÷30=14 శేషము. |
| శివగుణశేషము | 11 | |
| షష్టిధ్రువము | 8 | |
| గతపదము | 1 | |

వెరశి 44–30=14 ఇది యేభాగ్నిశిష్టశేషము.

నెం 8 రు పూర్ణమాసపద కోదాహరణము :—ఈ నెం 8 రు మాసపదక పట్టీలో చెనుక యీ అక్టోబరు నెలకు మాసపదకము ౧౨౫ అనియున్నది గనుక యీ అక్టోబరుకు దినములు ౧౨౫ అని తెలిసినది.

ఇక్కడికి వెనుకటి 8 నెంబర్లుగల యుపకరణములు చేయుపద్ధతి కనుపర్చబడెను గనుక తనయిష్టకాలమునకు రెండు విషయమై యేయుపకరణము కావలసియుండునో ఆయుపకరణమును యీప్రకారము సాధించుకొనవలయును.

లోగడయీగ్రంథోదాహరణనిమిత్తము అన 1892 సం॥ అక్టోబరు 6 తేది అని వ్రాయబడియున్నదిగదా. నాటివారమేమిటగునని ప్రశ్న చేసినయెడల ఆవారమును తెలియు సాధనము చెప్పబడుచున్నది.

ఎట్లనగా :—

